# మెకంజీ కైఫియ్యతులు

## తూర్పుగోదావరి జిల్లా

బొల్లోజు బాబా




**పల్లవి పబ్లికేషన్స్**

**59-1-23/2 ,అశోక్‌నగర్, విజయవాడ - 520010**

**సెల్ : 9866115655**

**మెకంజీ కైఫియ్యతులు - తూర్పుగోదావరి జిల్లా**

**బొల్లోజు బాబా**
30-7-31
గొల్లల వీధి, సూర్యనారాయణ పురం
కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్ - 533001
ఫోన్ : 9849329443

**అక్టోబరు 2020**

**ప్రచురణ**
పల్లవి పబ్లికేషన్స్
59-1-23/2 ,అశోక్‌నగర్,
విజయవాడ - 520010
సెల్ : 9866115655

**కవర్ డిజైన్**
శ్రీ గిరిధర్ అరసవెల్లి

**గెటప్**
చిన్నారి, యానాం

**ముద్రణ**
నాగేంద్ర ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ - 520002



ISBN 978 - 93 - 5408 -115 - 6

**వెల : ₹ 200.00**

# విషయ సూచిక



## Appendix

## తూర్పు గోదావరి జిల్లా చరిత్ర అధ్యయనంలో మెరుపులు
## మెకంజీ కైఫీయతులు

**డా. పి. చిరంజీవినీ కుమారి**

చరిత్ర అధ్యయనంలో మౌలికమైన అంశం ఆ ప్రాంతపు ప్రజలు తమ చరిత్రను ఏ విధంగా సృష్టించుకున్నారు అనేది. ఏ దేశచరిత్ర అయినా ఆ దేశంలోని ప్రాంతాలు, గ్రామాలు, వాడలలో జనం ఎలా జీవించారు, ఏ విధంగా పాలించబడ్డారు, మరి ఏరకంగా చరిత్రను మలుపు తీసుకుంటూ వచ్చారు అనేది అధ్యయనం చేయడం చరిత్రకారుని విధి.

శ్రీ బొల్లోజు బాబాగారు కవిగా, రచయితగా, కార్యనిర్వహణదక్షుడిగా పేరు పొందటం అందరికీ పరిచయమే. ఇపుడు వారి "మెకంజీ కైఫీయతులు తూర్పుగోదావరి జిల్లా" అను పరిశోధనా గ్రంథం బాబాగారిని ఒక కొత్తకోణంలో, ప్రజా చరిత్ర కారుడిగా ప్రతిష్ఠించింది.

ఆయన దృష్టిలో చరిత్ర గతానికి, వర్తమానానికి జరిగే నిరంతర సంభాషణ. ఇది నిజం. అధునాతన చరిత్ర అధ్యయనంలో శ్రీ డి.డి. కొశాంబి వంటివారు మనిషికి తను చరిత్ర సృష్టిస్తున్నాడని తెలియదు అన్నారు. అయితే మన పూర్వీకులు వారి వేష భాష సంస్కారాలు, వారి జీవితాల్లో వచ్చిన అనుభవాలు వారి పాలనావ్యవస్థలు, నమ్మకాలు, అవి ఏ విధంగా చరిత్రలో మారుకుంటూ వచ్చాయి అనేది తెల్సుకోవడం ఒక ఆసక్తిదాయకమైన విషయమే కాకుండా చరిత్రగమనం ఏ దిశలోకి పోతున్నది అన్న అవగాహన కూడా ఇందులో ఇమిడి ఉంది.

బొల్లోజు బాబా గారి తూర్పుగోదావరి జిల్లా మెకంజీ కైఫీయతులు జనం నుంచి అంటే క్రిందినుంచి వచ్చిన Sub Altern చరిత్ర.

మెకంజీ కైఫీయతులలో ప్రాంతీయ, గ్రామ, దేవాలయ ఆస్తుల వివరాలు, దానాలు, పట్టాలు, శాసనాలు మాత్రమే కాకుండా సామాజికమైన జీవన విధానాలు, శ్రామికులకు, పాలకులకు నడిచిన ఆదాన ప్రదానాలు, యుద్ధాలు,

తద్వారా జరిగిన భీకరమైన హింసాకాండలు కనబడతాయి. అంతే కాకుండా ఇంతవరకూ వెలుగులోనికి రాని కొన్ని ప్రజాజీవన విశేషాలు కూడా మెరుపు తీగల్లాగ మన ముందుకొస్తాయి.

బోయినపూడి గ్రామ కైఫీయతులో నీలపువారి వృత్తాంతంలో, బోయిన గ్రామాన్ని అభివృద్ధి చేసిన వారిని నీలం అనే జాతిగా పిలవబడడం కనబడుతుంది.

సర్పవరం కైఫీయతులో క్రీ.శ.1422 లో దేవాలయం ఎదుట నందికి మండప నిర్మాణంలో పనిచేసే జంగాలకు సర్పవరం గ్రామాల్లో 9 పుట్ల భూమిని వృత్తి మాన్యంగా ఇవ్వడం జరిగింది.

జల్లూరు కైఫీయతులో అన్నిలదేవు అనే రాజు ప్రభుత్వంలో భూమి కొలతకు గడ అని స్థిరీకరించడం జరిగింది.

సామర్లకోట కైఫీయతులో కుమార భీమేశ్వరుని ఆలయాన్ని అపవిత్రం చేస్తున్న గెద్దలను, రాబందులను చెదరగొట్టేవారికి ఉందూరు గ్రామం, కాపలా ఉండేవారికి కాపవరం అనే గ్రామం, జంగాలకు జంగాలదొడ్డి అనే గ్రామం ఇవ్వడం తెలుస్తోంది.

పూసపాటి జమిందారు ఆనందగజపతికి పిఠాపురం పాలకులు నీలాద్రి నాయుడు మొదలైన వారికి యుద్ధాలు జరిగినపుడు జరిగిన విశేషం:

కాకినాడ జగన్నాథపురం రేవులో ఆగిన ఫ్రెంచి ఓడనుంచి రెండువందల మంది ఫ్రెంచి సైన్యాన్ని దించి, సామర్లకోటకు నావలమీద తీసుకొనివచ్చి జరిగిన యుద్ధంలో ఆనందగజపతి సామర్లకోటకు వచ్చి ఫ్రెంచివారిని తరిమివేసి ఇంగ్లీషువారి జండాను తిరిగినిలబెట్టారు.

చిన్నిపువ్వు తేనె కైఫీయతులో కోన అడవిలో ఆవులు, ఎడ్లు బలిష్ఠంగా ఉండి కొమ్ములు ఏ వంకరా లేకుండా ఎలా ఉంటాయో, చిన్నిపువ్వు తేనె ఎలా వస్తుందో వివరించారు.

ఇలాంటి అంశాలు సాధారణ చరిత్రకారునికి అందని విశేషాలు. మెకంజీ కైఫీయతులలో గ్రామ, కుగ్రామ, వాడల, జనుల జీవితాలు, అనుభవం నిక్షిప్తమై యున్న విషయం బొల్లోజు బాబాగారి దృష్టిలోనికి రావడం అసమాన్యమైన పరిశోధకతత్త్వం.

పురాతన తాళపత్రాలలో భద్రపర్చుకుంటూ వచ్చిన విషయాలు ఆనాటి తూర్పుగోదావరి జిల్లా గ్రామకరణాలు తయారుచేసిన దండకవిలెలనుంచి సంగ్రహించి మెకంజీ సేకరించిన శతాబ్దాలకాలం నాటి ఈ పత్రాలను సమకాలీన భాషలోకి అనువదించి పఠితలకు అందించారు శ్రీ బొల్లోజు బాబా.

తూర్పుగోదావరి జిల్లా చరిత్ర-సంస్కృతి సామాజిక విషయాల అధ్యయన సంస్థ అధ్యక్షులు, నేటి ఆంధ్రప్రదేశ్ గౌరవ మంత్రివర్యులు శ్రీ చెల్లుబోయిన శ్రీనివాస వేణుగోపాల కృష్ణగారు, ఈ సంస్థ కార్యవర్గ సభ్యులైన శ్రీ బాబా గారి అద్భుతమైన కృషివలన సంస్థకు గౌరవ ప్రతిష్ఠను సంపాదించారని అభినందిస్తున్నారు.

తూర్పు గోదావరి జిల్లా మెకంజీ కైఫియతులు అందించడంతో, జిల్లా చరిత్రకు ఒక genuine చరిత్రకారుడు లభించాడని సంస్థ గర్విస్తోంది.

**15-10-2020**

**డా. పి. చిరంజీవినీ కుమారి**
**కార్యదర్శి**
***తూర్పుగోదావరి జిల్లా చరిత్ర-సంస్కృతి***
***సామాజిక విషయాల అధ్యయన సంస్థ***
**కాకినాడ**

# శుభాకాంక్షలు

***తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి***

తూర్పు గోదావరి జిల్లా మెకంజీ కైఫీయత్తులు పుస్తకంగా వేస్తున్నాను, మీరు దాని గురించి రెండు మాటలు రాసిపెట్టండని బొల్లోజు బాబాగారు అడిగారు. నేను అపండితుణ్ని గనుక రాయలేనని చెప్పుకొన్నాను. బాబాగారికి మనమాట వినే అలవాటు లేదు గనుక వదిలిపెట్టని కారణంగా వారికీ శుభా కాంక్షలు తెలియచేస్తున్నాను. మీరు నేను రాసినది విడిచిపెట్టి బాబాగారు రాసినది చదువుకోండి. బాబాగారు కవి. కొంతకాలం నుంచీ వారు చరిత్రమీద కలిగిన ఆసక్తివల్ల ఆంధ్రుల చరిత్రకి సంబంధించిన వ్యాసాలు రాస్తున్నారు. యానాం గురించి బాబాగారు రాసిన పుస్తకం అందరికీ తెలిసినదే.

దురదృష్టవశాత్తూ మెకంజీ గోదావరిజిల్లాలలో ఎక్కువకాలం గడపలేదు. అందుచేత రాయలసీమ కైఫీయతులలో అక్కడి సమాచారం ఉన్నంతగా తూ.గో.జిల్లా కైఫీయతుల్లో అంత వివరం కనిపించదు. బాబాగారు మెకంజీ పత్రాలను వాడుక భాషలో తిరగరాసి ప్రచురించారు. అవసరం అనుకొన్నచోట అధోజ్ఞాపికలలో అదనపు సమాచారం ఇస్తున్నారాయన. కానీ చాలాచోట్ల గ్రాంధిక వాక్యాలు కనిపిస్తాయి. అభ్యంతరం కాకపోయినా కైఫీయతుల వంటి చారిత్రిక పత్రాలను గానీ, పుస్తకాలను గానీ వాడుకభాషలోకి తీసుకురావటం వల్ల ప్రాంతీయ మాండలికం నష్టపోతూంది. నుడికారం, భాష, శైలి మనకి దక్కకుండా పోవటం మామూలు నష్టం కాదు.

ఈ కైఫీయతులలో ఎక్కువభాగం 18వ శతాబ్దిలో పెద్దాపురం, పిఠాపురం, సామర్లకోట, విజయనగరం జమీందారుల రాజకీయాలు, యుద్ధాలు వాటిలో ఈస్టిండియా కంపెనీ, ఫ్రెంచివారి జోక్యం తత్ఫలితంగా కోస్తాప్రాంతంలో ఈస్టిండియా కంపెనీ సాధించిన ఆధిపత్యం వివరంగా పొందుపరిచారు. పాఠకులకి ఈ చరిత్ర ఆసక్తికరంగా ఉంటుంది. పోతే తూర్పుచాళుక్యుల చరిత్ర

కొంత వివరించబడింది. ఇది చరిత్రగ్రంథాలలో సులభంగా దొరుకుతుంది. రాజమహేంద్రవరం చరిత్ర కైఫీయతులో లేకపోవడం నిరుత్సాహంగా ఉంటుంది. అయితే కైఫీయతులు రాసినవారు చరిత్రకారులు కాదు. గ్రామకరణాలు. స్థానిక ఐతిహ్యాలు సేకరించి పూర్వసమాచారం కొంత గ్రహించి పొందుపరిచిన పత్రాలివి. అందుకే కైఫీయతులను యధాతథంగా చరిత్ర పరిశోధనగా అంగీకరించడం, ఎవరికి వచ్చిన విశ్లేషణ వారు చేస్తున్నారు. దురదృష్టవశాత్తూ మన చరిత్ర రచనలోనే అనుసరించిన పద్ధతిలోనే లోపాలున్నాయి. కొన్ని కారణాలవల్ల పాలనావ్యవస్థలు, పాలకులు, కాలం అనే మూడు బిందువుల చుట్టూ మన చరిత్ర నేతపని జరిగింది. మొదట చరిత్ర రచనకు పూనుకున్న ఆంగ్లపండితులు దిగ్భ్రమ కలిగించే ఈ దేశ సామాజిక సాంస్కృతిక వైవిధ్యాన్ని అర్థం చేసుకోలేదు. ఆ వైవిధ్యాన్ని వాళ్లు సమూలంగా బల్లపరుపు తాపీపని చేసారు. అట్లా జరిగిన అపకారం మనకింత వరకూ అవగతం కాలేదు. వాళ్లకి ఇంగ్లాండులో పరిచయం ఉన్న MANOR HOUSE నమూనాలో మన చరిత్ర రాయడానికి పూనుకున్నారు. మనం ఆధునికం అని నమ్ముతున్న Colonial Mindset తోనే ఇంకా మన సాంస్కృతిక సాంప్రదాయాల్ని అర్థం చేసుకుంటున్నాం. అనేక ఉపజాతుల, కులాల మూలాలు అర్థం కావాలంటే విస్తృతమైన జీవావరణ వ్యవస్థల అధ్యయనం కావాలి.

బాబాగారు సంస్కృతీకరణ, Aryanization అనే పదాలు వాడుతున్నారు. వాటికి ఏర్పడ్డ రూఢ్యర్థం సరికాదు. అలాగే హిందూమతాన్ని విదేశీయుల మీద రుద్దడం జరిగిందని కూడా అన్నారాయన. అదికూడా నిజం కాదు. అటువంటివి జరగాలంటే వ్యవస్థీకృతమైన శక్తి ఉండాలి. అంతేకాదు. హిందూ మతం అనే పదం ఎలావాడాలో ముందు మనకి అర్థం కావాలి. అర్థం కావాలంటే, వ్యవసాయ విస్తరణ, ఆలయనిర్మాణాలు, చతుర్థకులజుల పాలన, జైన, బౌద్ధ, ప్రాచీన హిందూ మతానికీ Cult Centres కీ ఉండిన పేగుసంబంధం తెలియాలి. మనకిష్టమైన అభిప్రాయాలు చారిత్రిక వాస్తవాలనుకోకూడదు. ఇదంతా చాలా సంక్లిష్ట వ్యవహారం. బౌద్ధ ధర్మవ్యాప్తి విచ్ఛిత్తి ఎందుకు జరిగిందో తెలియకుండా వాటి గురించి మాట్లాడుతున్నారు. ఇది చాలామందికి రుచికరమైన వ్యాపకం. శాస్త్ర విషయాలలో అనేకుల అంగీకారం అవసరం లేదు.

చరిత్రరాయడానికి అందులో డిగ్రీలు ఉండితీరాలనే నియమం లేదు. మనకి కొంతమంది ఔత్సాహిక చరిత్ర, పురావస్తు పరిశోధకులు ఉన్నారు. వారు గ్రామగ్రామాలు శ్రమించి తిరుగుతూ కొత్తవిషయాలు తెలియచేస్తున్నారు. కొందరు చరిత్రమీద నిజమైన ఆసక్తి కలిగించడానికి శ్రమపడుతున్నారు. వాళ్లకి Self Promotion గుర్తింపు ధ్యేయం కాదు. అదొక దీక్ష. దరిదాపు ఇరవై సంవత్సరాల క్రితం వియన్నానుంచి ఒక జీవశాస్త్రవేత్త ఫోన్ చేశాడు. 'మీకు దగ్గరలో కోటిపల్లి అనే గ్రామంలో, ఆలయ కోనేరులో పెద్ద తాబేలు ఉందని మీరు ఎరుగుదురా' అనడిగాడు. తెలుసునన్నాను. తరువాత ఇద్దరం కలిసి తిరుగుతూ ఆయన తాబేలు మరణించిందని తెలుసుకున్నాం. అతనికి ఒక ప్రత్యేకజాతి తాబేళ్ల మీద ఆసక్తి. అతనింట్లో 1200 రకాల తాబేళ్లుతో ఉంటాడతను.

బహుముఖీనంగా, బహుశాఖీయంగా విస్తరిల్లిన విద్యలలో చరిత్ర, సామాజిక శాస్త్రం, జ్యోతిషం అనేవి ఏ కారణంచేతనో చాలామందికి లోకువ. చరిత్ర, సామాజికశాస్త్ర సంబంధమైన అభిప్రాయాలు వింటుంటే, ఇపుడు విరివిగా లభిస్తున్న బల్లిపాటు ఫలితాల అధ్యయన గ్రంథాల చేరువలోకి తీసుకువెడతారని అనిపిస్తూంటుంది. ఇటువంటి పరిస్థితి ఏర్పడ్డానికి మన విశ్వవిద్యాలయాలు కారణం అని నా అభిప్రాయం. అంతర్జాల మహాత్యం వల్ల గతంలోవలె కాకుండా, ఎవరి అంతర్జాల కుంపటిని వారే సులభంగా పెట్టుకుంటున్నారు. ప్రతి అయిదో ఆంధ్రుడిలో ఒక చరిత్రకారుడు, సామాజిక శాస్త్రవేత్త, జ్యోతిష్కుడు కలిసిగానీ విడివిడిగా కానీ ఉన్నారని నమ్ముతున్నాను.

బాబాగారి రచన చదవడానికి సుఖంగా ఉంటుంది. దానివల్ల పాఠకులకి కనీసం గోదావరి జిల్లాల చరిత్రమీద మక్కువ ఏర్పడుతుందని ఆశిస్తున్నాను. బాబాగారి కృషి కొనసాగుతూనే ఉంటుందని నమ్మకం.

**తల్లావజల పతంజలి శాస్త్రి**

**5-10-2020**

# మనవి మాటలు

పదేళ్లక్రితం "ఫ్రెంచిపాలనలో యానాం" పుస్తకం వ్రాస్తున్న సమయంలో మెకంజీ కైఫియ్యతులలో యానాం ప్రస్తావన ఉండొచ్చుననే ఉద్దేశంతో తూర్పు గోదావరిజిల్లా కైఫియ్యతుల పుస్తకం కొరకు వెతికాను. దొరకలేదు. చాన్నాళ్లక్రితం మిత్రులు శ్రీ పరుచూరి శ్రీనివాస్‌ను అడిగితే వారు, తూర్పుగోదావరి జిల్లా మెకంజీ కైఫియ్యతులు పుస్తకరూపంలో ఇంతవరకూ రాలేదు అన్నారు. ఆ తరువాత శ్రీ నడుపల్లి శ్రీరామరాజు వ్రాసిన "మెకంజీ కైఫియత్తుల సూచి" పుస్తకం లభించింది. ఆ పుస్తకంలో మెకంజీ తెలుగు కైఫియ్యతులు నేడు ఏ ఏ లైబ్రేరీలలో లభ్యమవు తున్నాయో ఇండెక్స్ నంబర్లతో సహా మొత్తం 2028 వ్రాతప్రతుల వివరాలు సేకరించి క్రోడీకరించారు. ఈ పుస్తకం వ్రాయటానికి శ్రీరామరాజుగారు చేసిన కృషి నాకు దిక్సూచిలా పనిచేసింది.

మెకంజీ కైఫియ్యతులను మొదటగా H.H. Wilson 1828 లో కేటాలాగ్ చేసాడు. దానిలో తూర్పుగోదావరికి చెందిన కైఫియ్యతులు ఇవి.

VIII 1. Account of Sarpavaram 2. Account of Jellur 3.Account of Korukonda village in papavaram district 4. Account of Samarla Kota Pitapur 5. Account of Kimmur in peddapuram country

IX 1. Account of establishments of Banians of Pennagonda in Rajamuhendri zilla 2. Account of tribes of hill people Kondavandalu, Koyavandlu, Chadaraboyellu residing in the mountains in the woods of the Kotapalli district in Rajamahendri zilla 3. Account of Hill Fort Ramavarapu durgam in Kottapalli 4. Account of holy place Dhavaleswaram in Rajamahendravam 5. Description of private mine in the Fort of Rajamahendri

XII 1. Account of Siddhantam in the zilla of Rajamahendri 2. Account of Boyanapudi 3. Account of Chinni Puvvutena 4. Provincial account of the Rajamahendri district 5. Account of the hill fort of Vamagiri durgam.

పైన చెప్పిన VIII, XII నంబర్లలోని కైఫియ్యతులు, తెలుగు యూనివర్సిటీ, బొమ్మూరు, గౌతమి గ్రంధాలయము రాజమహేంద్రవరం, ఎ.పి. ఆర్కైవ్స్ లలో లభించాయి. మిగిలిన IX నంబరులోని కైఫియ్యతులు ఎక్కడా దొరకలేదు. బ్రిటిష్ లైబ్రేరీలో ఉండచ్చేమోనన్న ఆశతో లండన్‌లో ఉండే మిత్రుడు డా. సలాదిని, శ్రీ పరుచూరి శ్రీనివాస్‌ను విచారణ చేయమని కోరాను.

మద్రాసులోని మెకంజీ కైఫియ్యతులకు 1862లో William Taylor రూపొందించిన కేటలాగ్ లో IX విభాగంలోని కైఫియ్యతులగురించి చెపుతూ – ఈ విభాగంలో ఉన్న రికార్డులు బాగా శిథిలమైపోయాయి, వాటిలో ఏముందో కూడా తెలియని పరిస్థితి, వాటిని ఎంతమాత్రమూ పునరుద్ధరణ చేసే అవకాసం లేదు అన్నాడు. తూర్పుగోదావరి కైఫియ్యతుల సంఖ్యే చాలా తక్కువ అనుకొంటే వాటిలో అయిదు ఏనాడో కాలగర్భంలో కలిసిపోవటం బాధాకరం.

**ఏం మార్పులు చేసాను?**

కైఫియ్యతులలోని భాష రెండు శతాబ్దాలనాటిది. కామాలు, ఫులుస్టాపులు, పారాగ్రాఫులు లేకుండా కొన్నిచోట్ల ఒకేవాక్యం రెండుమూడు పేజీలవరకూ ఉండటం గమనించాను. అది చదువుకొనటానికి ఇబ్బంది. రాజమహేంద్రవరం కైఫియ్యతులోని ఒక పారాగ్రాఫు అసలు రూపం దానికి నేను మార్చిన రూపాన్ని ఇక్కడ ఇస్తున్నాను. గమనించగలరు.

> "తరువాత యీయన కుమారుడు విజయాదిత్యమహేంద్రుడనేరాజు ఆంధ్రదేశంరాజరికంచేస్తూవుండి యొకనాటికాలమందున వేటసరదాచేసి సమస్తసైన్యముతోట్టున్ను పయినచెప్పిన హ్యేమగిరి పర్వతానకు సమస్త సాధనములతోనువెళ్ళి కొంతసేపు వేటలాడి ఆకొండపై నెత్తంపరుపు విశాలం వుండియున్నది గనుక అక్కడ పట్నం కట్టిస్తే బహుజాగ్రతగానుండును అనిఆలోచనచేసి అక్కడనుంచిఆకొండకు ఉత్తరపుదిక్కున రెండుక్రోసుల దూరముపరియంతం వెళ్ళి అక్కడకొంతసేపువేటలాడి గోదావరీసమీపమునకు వచ్చినిలిచి అక్కడ అడవిలోనొకగొల్లవాడు మేకలమందమేపుతూవుండగా వాని దగ్గరకిపిలిచి వోరీయిక్కడపట్టణము కట్టితే యేలాగువుంటుందిరా అని ఆలోచన అడిగితే ఆస్థలముమునుపుయెప్పుడు కట్టియున్నదికాదు అనే తాత్పర్యముచేత ఆగొల్లవాడు రాజునుజూచి దండముబెట్టి బాబుగారు యిదియెప్పుడుపాడుగాదు అని అన్నాడు. వాడినోట శుభదమన్న వాక్యం వచ్చినదిగనుక ఆక్షణమందే వానినోటినిండా వరహాలుపోయించి ఆస్థలమందు కుంభమువండివోయించి

పాదుగుడిపి యోమగిరికొండమొదలుకొని ఉత్తరం పాదుగుడిపిన స్థలందనుకా రెండుక్రోసులదూరమునపట్నం కట్టించ వలయునని నిశ్చయించి ...........”

తరువాత ఇతని కుమారుడు విజయాదిత్య మహేంద్రుడనే రాజు ఆంధ్రదేశం పాలించే కాలమందు తన పరివారంతో హ్యేమగిరి కొండలపై వేటకు వెళ్లాడు. ఆ కొండపై విశాలమైన పీఠభూమి ఉన్నట్లు గుర్తించాడు. ఇక్కడ కోట కట్టించినట్లయితే బాగుంటుంది అని భావించాడు. ఆ కొండకు రెండు క్రోసుల దూరం వెళ్ళి గోదావరి తీరాన్ని చేరి అక్కడ మేకలమంద మేపుతూ ఉన్న ఒక గొల్లవాడిని పిలిచి “ఓయీ ఇక్కడ పట్టణము కట్టిస్తే ఎలా ఉంటుందిరా” అని అడిగితే ఆ గొల్లవాడు “బాబుగారు ఇది ఎప్పటికీ పాడు గాదు” అని అన్నాట్ట. వాడినోట శుభం పలికినందుకు తక్షణం వాడి నోటినిండా వరహాలు పోయించి, ఆ క్షణమే హ్యేమగిరిని కేంద్రంగా రెండు క్రోసుల పరిధిలో పట్టణం కట్టించాలని నిర్ణయించుకొన్నాడు విజయాదిత్య మహేంద్రుడు.

పై విధంగా మార్చటం వల్ల కైఫియ్యతుల Antique Value పోతూన్నదనే బెంగకలిగినప్పటికీ తప్పలేదు. ఇలా మార్చటం మూలంలోని అంశాలను శక్తి మేరకు సరళంగాచెప్పే ప్రయత్నమే తప్ప మూలం పట్ల అవిధేయత కాదని మనవి చేసుకొంటున్నాను.

చాలాచోట్ల నిఘంటువు దగ్గరపెట్టుకొంటే తప్ప ఎన్నో పదాలు అర్థంకావు. కొన్ని పదాలకు బ్రౌన్ మిశ్రభాషానిఘంటువులో తప్ప మామూలు నిఘంటువులలో అర్థాలు లభించలేదు. ఈ నేపథ్యంలో ఈ కైఫియ్యతులను సమకాలీనభాషలోకి మార్చటం అనివార్యమనిపించింది. స్థలపురాణాలకు సంబంధించిన వివరాలను కొంతమేరకు సంక్షిప్తీకరించాను. అన్ని చోట్లా సంవత్సరాలను శాలివాహన శకం నుండి క్రీస్తు శకంలోకి మార్చాను. ఈ మార్పులు పెద్దలు, సహృదయులు అర్థం చేసుకొంటారనే అనుకొంటాను.

కైఫియ్యతులలోని చరిత్రను వీలున్నని చోట్ల ఫుట్ నోట్సుల ద్వారా ప్రధాన స్రవంతి చరిత్రతో అనుసంధానించటానికి ప్రయత్నించాను. ఫుట్ నోట్సులలో చెప్పటానికి వీలుచిక్కని విషయాలను వ్యాసాలుగా విస్తరించి చివరలో చేర్చాను.

ఎందుకీ పుస్తకం?

ఆంధ్రప్రదేష్‌కు చెందిన 13 జిల్లాలలో పది జిల్లాలకు సంబంధించిన కైఫియ్యతులను ఎపి ఆర్కైవ్స్, సిపి బ్రౌన్ సంస్థల వారు ఇప్పటికే ముద్రించారు.

కడప జిల్లా ఏడు సంపుటాలు, గుంటూరు జిల్లా అయిదు సంపుటాలు, మిగిలిన జిల్లాలకు సంబంధించి ఒక్కొక్కటి చొప్పున వెలువరించారు. వీటిలో కడపజిల్లానుంచి అత్యధికంగా ఏడు సంపుటాలను సి.పి.బ్రౌన్ పరిశోధనా సంస్థ వెలువరించింది. ఇక మిగిలిపోయిన మూడు జిల్లాలలో తూర్పుగోదావరి ఒకటి. ఆ లోటు ఈ పుస్తకం తీరుస్తుందని భావిస్తాను. ఈ జిల్లాకు సంబంధించి పది కైఫియ్యతులు మాత్రమే లభిస్తున్నాయి. వీటిని 1814-1815 ప్రాంతాలలో సేకరణ జరిపినట్లు అర్థమౌతుంది. వీటిలోంచి చామర్లకోట, కిమ్మూరు కైఫీదులను 1915లో విఆర్ జగపతివర్మ ప్రచురించారు.ఆ తరువాత ఏవిధమైన కృషి జరిగినట్లు లేదు.

మనపూర్వీకులు ఎలా జీవించారో తెలుసుకోవాలన్న ఆసక్తి ప్రతిఒక్కరిలో ఉంటుంది. ఏ విలువలు నిలుపుకొని, వేటిని త్యజించటం ద్వారా వర్తమానంలో పురోగతి సాధించవచ్చో చరిత్ర నేర్పుతుంది. గతానికి వర్తమానానికి జరిగే నిరంతర సంభాషణే కదా చరిత్ర అంటే.

ఈ కైఫియ్యతులన్నీ మన పూర్వికులు తాటియాకులపై వ్రాసుకొని శతాబ్దాలపాటు భద్రపరచుకొంటూ వచ్చిన విషయాలు. ఇవన్నీ వారి అనుభవాలు, జ్ఞాపకాలు, రక్తమాంసాలతో చరించిన వారిజీవితాలు. మన వెనుకతరాల వారి స్మృతులను ముందుతరాలవారికి అందించటం మన బాధ్యత అనుకొంటాను.

## ఏముందీ కైఫియ్యతులలో

పైనఉండే పాలకవర్గాలనుంచి కాక క్రిందఉండే పాలితవర్గాల నుంచి రాయబడిన చరిత్రలుగా కైఫియ్యతుల స్థానం చెక్కుచెదరనిది. ప్రధానస్రవంతి చరిత్రపుస్తకాలలో కనిపించని వివరాలు, జీవనశకలాలు ఈ రాతలలో కనిపిస్తాయి. ఉదాహరణకు ఈ ప్రాంతం గోల్కొండరాజుల పాలనలోకి వచ్చాక రాజమహేంద్రవరాన్ని కేంద్రంగా చేసుకొని ప్రభుత్వం చేసిన వ్యక్తుల వివరాలు బయట ఎక్కడా లభించవు కైఫియ్యతులలో తప్ప. యుద్ధసమయంలో ఆలయ స్తంభాలను తీసుకెళ్ళి కోటను బలపరచుకొన్న సంగతులు మనపూర్వికులు గమనించారు, రికార్డు చేసారు.

ఈ కైఫియ్యతులు క్రిందనుంచి వ్రాయబడిన సబ్ ఆల్టర్న్ రాతలు. వీటిలో మన విశ్వాసాలు, సంప్రదాయాలు, సంస్కృతులు, చరిత్రా అన్నీ మిళితమై పోయి

ఉంటాయి. జరిగిపోయిన విషయాలలో తప్పొప్పులు ఎంచటం అనవసరం. మనపూర్వీకులు అలా జీవించారని అనుకోవాలి.

లోపల ఒక వ్యాసంలో అన్నమాటే మరోసారి "జగపతిరాజు భార్య శాపం పెట్టటం కైఫియ్యతు అయితే, 1760లో ఆనందగజపతిరాజు చనిపోవటం చరిత్ర. రెండిటినీ విడదీయలేం".



తూర్పుగోదావరి జిల్లా చరిత్ర-సంస్కృతి సామాజిక విషయాల అధ్యయన సంస్థ కార్యదర్శి డా. పి. చిరంజీవినీ కుమారి అమ్మ ఎంతో ప్రేమతో పలికిన ఆత్మీయ వచనాలకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి చెప్పిన శుభాకాంక్షలలో ఎన్నో విలువైన, లోతైన, చర్చనీయ సంగతులను ప్రస్తావించిన శ్రీ తల్లావజల పతంజలి శాస్త్రిగారికి సదా వినమ్రుడను.

ఈ పుస్తకం రూపుదిద్దుకొనటంలో అనేక సలహాలు, సూచనలు ఇచ్చి ప్రోత్సహించిన ప్రముఖ చరిత్రకారులు, విశ్రాంత చరిత్ర ఆచార్యులు శ్రీ కూచిభొట్ల కామేశ్వరరావు గారికి నా నమస్సులు.

శ్రీ సాయి పాపినేని గారికి, శ్రీ ఈమని శివనాగిరెడ్డి గారికి, బాల్య మిత్రుడు శ్రీ ముమ్మిడి చిన్నారికి నా ప్రత్యేక ధన్యవాదములు.

మిత్రులు శ్రీ వద్ధిపర్తి రామకృష్ణ శ్రీవత్స ఇచ్చిన ప్రోత్సాహం మరువ రానిది. నాపై అవ్యాజమైన ప్రేమకురిపించే శ్రీ శిఖామణి, శ్రీ గనారా, డా.వాడ్రేవు వీరలక్ష్మిదేవి గారికి, శ్రీ దాట్ల దేవదానంరాజు,శ్రీ మల్లేశ్వరరావు, శ్రీమధునాపంతుల సత్యన్నారాయణమూర్తి, చెల్లి రాం అన్న ఇంకా కవిమిత్రులు శ్రీ ప్రభు ఆద్దేపల్లి, శ్రీ అవధానుల మణిబాబు, శ్రీసుంకర గోపాల్, అనిల్ డానీ, డా.పి. హరిరామ ప్రసాద్ అందరకూ వందనాలు.

**బొల్లోజు బాబా**

**అక్టోబరు, 2020**

# కల్నల్ కాలిన్ మెకంజీ

కాలిన్ మెకంజీ 1754లో స్కాట్లాండ్‌లోని Stornoway, Isle of Lewis లో జన్మించాడు. 2 సెప్టెంబర్ 1783న ఈస్టిండియా కంపనీ ఉద్యోగిగా మద్రాసులో అడుగుపెట్టాడు. అది మొదలు 1821లో కలకత్తాలో చనిపోయేవరకూ మెకంజీ ఇండియాలోనే ఉన్నాడు. 1784-90ల మధ్య ఇతను రాయలసీమ-కృష్ణా పరిసర ప్రాంతాలలో కంపనీ సైనిక ఇంజనీరుగా పనిచేసాడు. 1799లో టిపు సుల్తాను ఓటమి కారణంగా కంపనీ పరమైన కర్ణాటక జిల్లాలను, నిజాం దఖలు పరచిన సీడెడ్ జిల్లాలను సర్వే చేసే బాధ్యతను కంపనీ మెకంజీకి అప్పగించింది. ఆ సమయంలో సర్వే నిమిత్తం కృష్ణాదిగువ ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించాడు. ఏలూరుకు చెందిన కావలిసోదరుల సహాయంతో మెకంజీ అనేక స్థానికచరిత్రలను, శాసనాలను సేకరించాడు.

స్థానికులు వారి గ్రామచరిత్రను, సరిహద్దులను, దేవాలయ భూముల, పాలకుల వివరములను తాళపత్రములపై వ్రాసి ఎప్పటికప్పుడు మార్పులు చేర్పులు చేస్తూ భద్రపరచుకొనేవారు. వీటిని దండెకవిలెలు అనేవారు. ఇవి ఆ గ్రామకరణాల వద్ద ఉండేవి. మహమ్మదీయపాలనలో వీటిని కైఫియ్యతులు అనే పేరుతో వ్యవహరించటం మొదలైంది. కైఫియత్ అనే ఉరుదూ పదానికి సంగతులు, విశేషములు అని అర్థం ఇవి. మెకంజీని ఆకర్షించాయి. వాటిని విస్తారంగా సేకరించాడు. తాను సేకరించిన చారిత్రిక సమాచారాన్ని తన మిత్రులతో తరుచూ పంచుకొంటూ చర్చిస్తూ ఉండేవాడు మెకంజీ.

హిందువుల చరిత్రను వ్రాయటానికి హిందువుల మూలాలను శోధించాలి తప్ప పెర్షియన్ మూలాలు కాదు అని మెకంజీ వాదించేవాడు. అప్పటివరకూ హిందువులకు చరిత్రను దాచుకోవాలనే శ్రద్ధలేదు అని వాదించిన బ్రిటిష్ చరిత్రకారులను శతాబ్దాలుగా స్థానికులు భద్రపరచుకొన్న ఈ కైఫియ్యతులు విస్మయపరచాయి.

ఈస్ట్ ఇండియా కంపనీ 1810లో ఇతనిని మద్రాసు ప్రెసిడెన్సీ సర్వేయర్ జనరల్‌గా నియమించింది. 1811లో జావా ద్వీపంపై ఈస్ట్ ఇండియా కంపనీ సైన్యం దండయాత్ర చేసినపుడు మెకంజీ ఉద్యోగరీత్యా కంపనీసైన్యాన్ని వెంబడించవలసి వచ్చింది. అక్కడ 18 నవంబరు, 1812న డచ్ సంతతికి చెందిన Petronella jacomina Bartels ను వివాహమాడాడు.

1815లో తిరిగి ఇండియా చేరుకొన్నాకా మెకంజీ భారతదేశ సర్వేయర్ జనరల్‌గా నియమించబడ్డాడు. కలకత్తా సెయింట్ జార్జి కోటలో ఇతని ఆఫీసు. అక్కడకు వెళ్లాల్సి ఉన్నప్పటికీ – అప్పటిదాకా ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతాలలో సేకరించిన సమాచారాన్ని క్రోడీకరించటం కొరకు మద్రాసులో ఉండేందుకు కంపనీ అనుమతి తీసుకొని 1817 వరకూ మద్రాసులోనే ఉన్నాడు.

1817లో మెకంజీ తన మిత్రుడైన అలెగ్జాండర్ జాన్‌స్టన్‌కు వ్రాసిన ఒక లేఖలో ఈ స్థానిక చరిత్రలను సేకరించటంలో తన ఉద్దేశాలను, నిబద్ధతను, కష్టాలను ఇలా చెప్పుకొన్నాడు.

1. 1799 లో కంపనీకి సంక్రమించిన ప్రాంతాల హద్దులను నిర్ణయించే పని నాకు అప్పగించినపుడు– సరిహద్దులే కాక ఆ ప్రాంత చరిత్ర, భౌగోళిక స్వరూపాన్ని కూడా అధ్యయనం చేస్తానని నేను చెప్పిన ప్రణాళికను కంపనీ ఆమోదించి ముగ్గురు గుమస్తాలను, ఒక నాచురలిస్ట్‌ను నాకు సహాయకులుగా ఇచ్చింది. కానీ 1801లో వీరిని తొలగించటంతో నా ప్రణాళికలన్నీ భగ్నమయ్యాయి. ఈ ప్రాంతాల జీవరాశిని రికార్డు చేద్దామనే నా ఆలోచన ఫలించలేదు. అంతే కాక నా జీతం, నాకు ఇచ్చే కంటింజెన్సీ డబ్బులు కూడా తగ్గించేసారు. దీనివల్ల నా ప్రణాళిక దాదాపు కుంటుపడింది.

2. అయినప్పటికీ నేనీ పనులు చేయగలిగాను

   జైనులు, బుద్ధులు వేరు వేరు అని నిర్ధారించగలిగాను (అప్పట్లో జైన బౌద్ధాలను హిందూమతంలో అంతర్భాగాలుగా భావించేవారు).

   ప్రాచీన మతసాంప్రదాయాలైన లింగాయత్, శైవం, పాండరం, మఠాలు వివిధ శాఖలు వాటి పుట్టుపూర్వోత్తరాలు స్పష్టపరిచాను.

   సుమారు మూడువేల వివిధ శిలాశాసనాలు, తామ్రపత్రాలకు నకళ్ళు తీయించాను

ఢిల్లీ నుంచి కేప్ కొమరిన్ దాకా ఉన్న Veeracul, Maastie culls లోని పురాతనజాతుల సంస్కృతిని వెలికితీసాను. (పైన చెప్పిన అన్ని అంశాలను మెకంజీ మొత్తం 12 రీసెర్చ్ పేపర్లుగా ఆసియాటిక్ జర్నల్ లో ప్రచురించాడు)

3. కొన్నాళ్ళు మద్రాసులోనే ఉంచమని కోరటానికి కారణాలు ఈ లేఖలో ఇలా చెప్పుకొన్నాడు మెకంజీ – "నాకు సహాయకులుగా ఉన్న వ్యక్తులతో నా అనుబంధం వ్యక్తిగతమైనది. వాళ్ళు ఈ ప్రాంతపు స్థానికులు, కలకత్తాకు నాతోపాటు వచ్చి వాళ్ళు జీవించలేరు. మేము సేకరించిన విషయాలను కేటలాగ్ చేయాలి. చాలా వాటిని అనువదించాలి. ఇది కలకత్తాలో సాధ్యపడదు. నేను ఇంగ్లాండు వెళ్ళేలోగా కనీసం స్థానిక వ్రాతప్రతులు, పుస్తకాలు, శాసనాల సంక్షిప్తసమాచారాన్ని పుస్తక రూపంలో చూడాలని నా కోరిక. దీనికి నా ఆరోగ్యం సహకరించక పోవచ్చు. కనీసం విద్యావంతులకు తదుపరి పరిశోధనలకు వీలుగానైనా వీటిని కేటలాగ్ చేయించాలి[1].

అలా ఇంగ్లాండు వెళ్లాలని ఆశపడ్డ మెకంజీ పాపం వెళ్ళనే లేదు. మెకంజీ సేకరణలు శిధిలమౌతున్నాయని గమనించిన సి.పి. బ్రౌన్ 1840లలో సుమారు 419 వాల్యూములకు నకళ్ళు తయారు చేయించాడు. వాటికి మరలా తిరిగి 1940–65ల మధ్య మరోసారి నకళ్ళు తీయించటం జరిగింది[2]. ఆంధ్రప్రదేశ్ ఆర్కైవ్స్ విభాగం వారు 1970లలో మెకంజీ సేకరణలను మైక్రోఫిల్ములుగా మార్చారు. నేడు మద్రాసు లైబ్రేరీలో ఉన్న తెలుగు మెకంజీ కైఫియ్యతుల వ్రాతప్రతులు చదవటానికి వీల్లేని విధంగా పూర్తిగా పాడయి పోయాయి.

---

1. మెకంజీ మరణానంతరం Alexander Johnston వ్రాసిన ఒక వ్యాసంలో 1817 లోనే మెకంజీ తన సేకరణలను 17 విభాగాలుగా విభజించుకొని సుమారు పదిపేజీల నోట్సు రాసుకొన్నాడని అన్నాడు. Royal Asiatic society, Journal 1834 vol 1

2. 1940–50ల మధ్య ఎస్. గంగిరెడ్డి, జి. నరసింహశర్మ, కె.వి జోగయ్య, కె. శేషాచార్లు, షేక్ అబ్దుల్ ఖాదర్, పి. సీతారామమూర్తి లాంటి వారు మెకంజీ కలక్షన్లను తిరిగి కాపీ చేసారు. 1950–65ల మధ్య వై.వి చలపతి, పి. లలిత, పి.శాంత, జి. సావిత్రి, ఎస్. పాప, డి. మధుసూధనరావులు కాపీ చేసారు.

అరవైల తరువాత తీసిన నకళ్లకు verified by ఎస్. వెంకటరావు అని సంతకం ఉన్నది. (శ్రీ నిడదవోలు వెంకట్రావు)

## మెకంజీ సేకరణా విధానం

మెకంజీకి భారతీయ భాషలు రావు. దీనికి కారణం ఇతని ఉద్యోగమే. మెకంజీ ఒక  సర్వేయరు. ఇతని ఉద్యోగం విపరీతమైన శారీరిక శ్రమ, నిత్యం ప్రయాణాలతో కూడుకొని ఉండేది.  ఒక చోట  స్థిరంగా, స్థిమితంగా కూర్చుని గురుముఖంగా బారతీయ భాషలను అధ్యయనం చేసే అవకాసం అతనికి ఎన్నడూ రాలేదు. భారతీయభాషలు నేర్చుకోలేకపోవటం తన బలహీనత అయినప్పటికీ తన వద్దనున్న పండితులు బహుభాషాకోవిదులు కనుక ఆ లోపం పెద్దగా ఇబ్బంది పెట్టలేదు అని  చెప్పుకొన్నాడు మెకంజీ.

సర్వే అనేది స్థానికంగా వెళ్ళి చేయాల్సినపని. అందువలన ఇతనికి ఆయా ప్రాంతాలలో స్వయంగా పర్యటించే అవకాశం వచ్చింది. దీనిని వినియోగించుకొని ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక ప్రాంతాలలోని అసంఖ్యాకమైన కైఫియ్యతులను, తాళపత్ర కావ్యాలను, శాసనాల ప్రతులను, ప్రాచీన ఆలయచిత్రాలను, నాణాలను సేకరించగలిగాడు.  గ్రామాలనుంచి సేకరిస్తున్న కైఫియత్తులతో భారతదేశ చరిత్రను తెలుసుకోవచ్చునని మెకంజీ నమ్మాడు.  గ్రామ చరిత్రలేకాక, ఆయాప్రాంతాలలోని వృక్ష, జంతురాశి, ప్రజల అలవాట్లు ఆచారాల గురించి కూడా సమాచారం సేకరించాలని అనుకొన్నాడు మెకంజి.

ఇతను నియమించుకొన్న ఉద్యోగుల జీత భత్యాలు కంపనీ భరించేది. ఇది లక్షరూపాయిల మేరకు అయినట్లు రికార్డులు చెపుతున్నాయి. క్రమేపీ కంపనీ డబ్బులు ఇవ్వటం మానేసాకా, ఒకానొక దశలో వారికి జీతాలు మెకంజీయే స్వయంగా ఇచ్చాడు.  మెకంజీ సేకరణలలో ఎక్కువ భాగం ఈ విధంగా స్వయంగా సేకరించినవే.



కాలిన్ మెకంజీ స్వయంగా చిత్రకారుడైనప్పటికీ ఇతనివద్ద వివిధ చిత్రకారుల బృందమొకటి ఉండేది.  వీరు మెకంజీ ఆదేశాలకనుగుణంగా అనేక చిత్రాలను లిఖించారు.  మెకంజీ గీయించిన చిత్రాల ఆధారంగా  Illustrating India, The Early Colonial Investigations of Colin Mackenzie పేరుతో Jennifer Howes 2010లో ఒక పుస్తకాన్ని వెలువరించింది.  ఈ పుస్తకంలో ఆమె కొన్ని వందల మెకంజీ డ్రాయింగ్స్ ని తీసుకొని, వాటి చారిత్రిక నేపథ్యాన్ని ఆ చిత్రంలో ఉన్న లోతైన విశేషాలను అద్భుతంగా వర్ణించారు.

మెకంజీ వద్ద సహాయకులుగా ఉన్న కావలిసోదరులకు తిరిగి మరలా సహాయకులు ఉండేవారు. అలాగ కావలి వెంకట లక్ష్మయ్య వద్ద నారాయణరావు, నిట్టల నారాయన, ఆనందరావు, నరసింహులు, సీతయ్య అనే అనుయాయిలు ఉండేవారు. వీరిని వివిధ ప్రాంతాలు పంపించి అక్కడి వివరాలను రిపోర్టులు రూపంలో తెప్పించుకొనేవారు. అలా నారాయణరావు అనే వ్యక్తి పంపిన అనేక రిపోర్టులు మెకంజీ కైఫియ్యతులలో లభిస్తాయి. ఇతని రిపోర్టులలో ఆయా ఊర్లకు ఎలా వెళ్ళిందీ, ఎంతదూరం, ఎక్కడ బసచేసాడు, ఎంతెంత ఖర్చయింది లాంటి వివరాలు కూడా ఉండటం విశేషం.

ఎక్కడకు వెళ్లాలి, ఏం సేకరించాలి అనే విషయాలపట్ల మెకంజీ చాలా స్పష్టంగా వీరందరికీ దిశానిర్ధేశం చేసే వాడు. ఒకసారి మెకంజీ వెంకటలక్ష్మయ్యను మహాబలిపురం పంపిస్తూ – "నువ్వు అక్కడ మొదటగా ఆలయ ప్రధానఅర్చకులను, ఊరిపెద్దలను కలుసుకో, వారితో మర్యాదగా వ్యవహరించు, వారి విశ్వాసాన్ని చూరగొను, నీపని తప్ప మరే ఇతర విషయాలలోను తలదూర్చకు, అక్కడి వివరాలు ప్రతీరోజు డైరీలో రాయి, అక్కడి భవనాలు, శిల్పాలు, ఆసక్తి కలిగించే అంశాలు అన్నింటినీ నమోదు చెయ్యి, వారితో పరిచయం పెంచుకొన్నాక మొదట వ్రాతప్రతులు సేకరించు, తరువాత శాసనాలు, ఆ పిదప ఆ ప్రాంతంలో గతంలో జరిగిన ఆసక్తికర ఉదంతాలను అడుగు – అంటూ ఖచ్చితమైన సూచనలు ఇచ్చాడు[3].

కొన్ని చోట్ల స్థానికులు సమాచారాన్ని పంచుకోవటానికి ఇష్టపడక మెకంజీ అనుచరులను అటకాయించిన సంఘటనలు ఎదురయ్యేవి. తమిళనాడులోని ఈరోడ్ నుంచి నిట్టల నాయిన 10 మార్చ్, 1807న వ్రాసిన ఒక ఉత్తరంలో "ఇక్కడ సమాచారం ఇవ్వకుండా ఇద్దరు బ్రాహ్మలు నన్ను బెదిరిస్తున్నారు, మీరీ విషయాన్ని కలక్టరుగారికి చెప్పి నాకు మార్గం సులభం చేస్తే తప్ప ఇక్కడి శాసనాల వివరాలను సేకరించలేను" అని వ్రాసాడు. మెకంజీ బహుసా M. Gorrow అనే కలక్టరుకు ఈ విషయం చెప్పి ఉంటాడు. ఏప్రిల్ 18 న నిట్టల నాయన వ్రాసిన మరో ఉత్తరంలో "కలక్టరు M. Gorrow గారి చొరవవల్ల నేను ఇక్కడ 20 శాసనాలు, కొన్ని తామ్రపత్రాలు, చాలా గ్రామాల కైఫియత్తులను సేకరించాను" అని చెప్పాడు.

3. Origins of Modern Historiography in India – by Rama Sundari Mantena p. 67

మొదట్లో మెకంజీ సేకరిస్తున్న స్థానిక చరిత్రలను సమకాలీన బ్రిటిష్ చరిత్రకారులు పెద్దగా పట్టించుకొనేవారు కాదు. అవి పురాణగాథలని వాటికి చారిత్రిక విలువ ఉండదనీ తీసిపారేసేవారు. కానీ HH Wilson, Charles Wilkins లాంటి చరిత్రకారులు మెకంజీ చేస్తున్న ఈ ప్రయత్నం చాలా గొప్పదని, దీని ద్వారా భారతదేశ చరిత్ర, సంస్కృతులను అర్థంచేసుకొనే అవకాసం చిక్కుతుందని సమర్థించేవారు. శాసనాలలో, తామ్రపత్రాలలో దానం ఇచ్చిన రాజు వంశావళి ద్వారా హిందువుల చరిత్రను నిర్మించవచ్చు అని Mark wilks అనే మరో చరిత్రకారుడు గమనించాడు.

ఈ నేపథ్యంలో తనకు కావాల్సిన సమాచార సేకరణలో తన అనుచరులు వివిధ చోట్ల ఎదుర్కొంటున్న సమస్యలను ఈస్ట్ ఇండియా కంపనీ బోర్డు సభ్యులకు చెప్పి వారిని తన బృహత్ యత్నానికి సహాయపడవలసినదిగా మెకంజీ కోరి ఉంటాడు. కంపనీబోర్డు సానుకూలంగా స్పందించి తమ ఆధీనంలో ఉన్న జుడిషియల్, మెడికల్, రెవెన్యూ అధికారులకు 14 ఫిబ్రవరి 1808న ఒక మెమో జారీచేసి మెకంజీ చేస్తున్న సేకరణలకు సహకరించమని కోరింది[4].

ఆ మెమోలో ఏయే అంశాలలో సహాయపడాలో స్పష్టంగా తెలిపింది. అవి 1. వంశావళులు. 2. దండకవెలలు. 3. కాలజ్ఞానం సంగతులు (భవిష్యత్తును ఊహించి చెప్పే విషయాలు). 4. చరిత్రలు (ప్రసిద్ధిగాంచిన కథలు, పాత్రలు). 5. పన్ను వసూళ్ల వివరాలు. 6. ఒక గ్రామంలో ఉండే కుటుంబాల సంఖ్య, గ్రామజనాభాలో కులాల వారి విభజన. (ఇది చాలా విలువైన సమాచారం. మరి ఎందుచేతనో ఈ వివరాలు ఏ కైఫీయత్తులోను కనిపించలేదు) 7. గుడులు, గుడిమాన్యాలు, మఠాలు మఠాధిపతులు, స్థలపురాణాలు. 8. శాసనాలు, తామ్ర పత్రాలు. 9. దానపత్రాలు. 10. పురాతన దేశ, విదేశీ నాణాలు. 11. ప్రాచీన ప్రధానపట్టణాలలో నేటికీ ఉన్న పాత భవనాలు, శిధిలమౌతున్న ఆలయాల చిత్రాలు. 12. వీరకల్ లు (వీరుల స్మారకంగా నిర్మించే శిలా విగ్రహాలు) 13. వివిధ శిల్పాల, నగిషీల చిత్రాలు.

ఈస్ట్ ఇండియా కంపనీ మెకంజీ పట్ల మొదట్లో కొంత ఉదాసీనతచూపినా పై మెమోద్వారా అతని కృషిని గుర్తించి సహాయపడినట్లు గ్రహించవచ్చు. ఒక

4. Origins of Modern Historiography in India, Annexure II, by M. Rama Sundari

గ్రామంలో పైన చెప్పిన అన్ని రకాల వివరాలు లభించకపోవచ్చు. కానీ పై సూచనలు మెకంజీ అనుచరులకు ఒక చెక్‌లిస్ట్ లా ఉపయోగపడి ఉంటుంది.



అమరావతి స్థూపాన్ని గుర్తించిన మొదటి యూరోపియన్ కాలిన్ మెకంజీ. ఒక స్థానిక జమిందారు అమరావతిలో తాను చేపట్టిన భవన నిర్మాణం చేయటానికి రాయి కొరకు "దీపాల దిన్నె" గా స్థానికులు పిలుచుకొనే ఒక ఎత్తైనగుట్టను తవ్వించటం మొదలుపెట్టాడు. ఈ తవ్వకాలలో అక్కడ పాలరాతి ఫలకాలు అనేకం ఉన్నట్లుగా గుర్తించారు. ఈ వార్త కాలిన్ మెకంజీ దృష్టికి రావటంతో 1796లో అమరావతి వచ్చి అక్కడ తొంభై అడుగుల వ్యాసం ఇరవై అడుగుల ఎత్తుతో ఏదో పాలరాతినిర్మాణం ఉందని గుర్తించాడు. ఆ ప్రాంతంలో లభించిన కొన్ని శిధిలాలచిత్రాలతో కూడిన ఒక వ్యాసాన్ని వ్రాసాడు[5].

అనేక ఉద్యోగ ఒత్తిళ్ల కారణంగా మెకంజీ తిరిగి పదేళ్లకు కానీ అమరావతి రాలేకపోయాడు. మార్చ్, 1816లో అమరావతి వచ్చి అక్కడే అయిదునెలలు ఉన్నాడు. అక్కడి జమిందారు చెరువును నిర్మించటం వలన అమరావతి స్థూపం మరింత శిధిలమై కన్పించింది మెకంజీకి. అనేక ఫలకాలు చెల్లాచెదురుగా ఆ చెరువుగట్టున పడి ఉండటాన్ని గమనించాడు. అక్కడ తవ్వకాలు జరిపించి బాగున్న ఫలకాలను భద్రపరచమని మచిలీపట్నం పంపించాడు. తన అనుచరులను, చిత్ర కారులను ఆ ప్రాంతంలో పెట్టి తిరిగి వెళిపోయాడు. వీరు అమరావతి కట్టడం యొక్క అనేక చిత్రాలను రెండేళ్లపాటు గీస్తూనే ఉన్నారు.

మెకంజీ చిత్రకారులు 1798-1817ల మధ్య చిత్రించిన 132 అమరావతి ఫలకాలలో 81 ఫలకాలు 1845 నాటికే అదృశ్యమైపోయాయి. డ్రాయింగ్స్ మాత్రమే మిగిలాయి[6]. వాటి ఆధారంగా Elliot, Sewell లాంటి ఆ తదుపరి చరిత్రకారులు అమరావతి స్థూపస్వరూపాన్ని నిర్ణయించారు[7].

అమరావతి స్థూపాన్ని మెకంజీ మొదట్లో జైన నిర్మాణంగా భావించాడు. అమరావతిపై వ్రాసిన మొదటి వ్యాసంలో దాన్ని జైన ఆలయంగా పేర్కొన్నాడు.

5. 1807 Asiatic Researches Vol IX

6. Colin Mackenzie and the Stupa at Amaravati, Jennifer Howes

7. Sculptures From Amaravati In The British Museum by Barrett, Douglas

1817 లో తవ్వకాలు జరిపినపుడు అది బౌద్ధమతసంబంధమైనదనే అనుమానం కలిగింది మెకంజీకి. అప్పట్లో సాంచీ స్తూపంపై పరిశోధనలు చేస్తున్న Edward Fell కు బౌద్ధ నిర్మాణాల వివరాలు పంపమని కోరాడు. ఆ వివరాల ఆధారంగా వ్రాసిన రెండవ వ్యాసంలో మెకంజీ జైన మత ప్రస్తావన తేలేదు. అమరావతి బౌద్ధానికి చెందిన నిర్మాణం కావొచ్చు అన్నాడు. ఇదేసమయంలో మెకంజీకి ఉదరసంబంధ అనారోగ్యం మొదలైంది.

మద్రాసులో పదివేల వరహాల విలువచేసే భవనాన్ని అద్దెకు ఇచ్చేసి 1817లో మెకంజీ కలకత్తాకు వెళ్ళిపోయాడు. 1820 నాటికి ఇతని ఆరోగ్యం మరింత క్షీణించింది. గాలి మార్పు కొరకు ఒరిస్సా వెళ్లాడు. అక్కడ పూరీ జగన్నాథ ఆలయం, రథయాత్ర, చిల్కా సరస్సుల డ్రాయింగ్స్ సేకరించాడు. తిరిగి కలకత్తా వచ్చేసాడు. మెకంజీ సేకరించిన ప్రతులు సుమారు “14 భాషలకు” సంబంధించినవి. వీటిని మెకంజీ కూడా సంపూర్ణంగా పరిశీలించలేదు. వాటిని ఎప్పటికైనా స్థిమితంగా కూర్చొని క్రోడీకరించాలని అనుకొని తనదారిలో కనిపించిన ప్రతి చిన్న అంశాన్నీ జీవితాంతం సేకరించుకొంటూ పోయాడు.

తీవ్ర అనారోగ్యం వల్ల తన సేకరణలపై పెద్దగా దృష్టి నిలపలేక పోయేవాడు. ఉప్పుగాలిని పీల్చితే రోగం నయమౌతుంది అన్న వైద్యుల సలహా మేరకు హుగ్లీ నదిపై రోజూ 12 మైళ్ల దూరం పడవ సవారి చేసేవాడు. 8 మే 1821న అలా పడవప్రయాణం చేస్తూ పడవలోనే మరణించాడు[8].

## మెకంజీ మరణం తరువాత

మెకంజీ చనిపోయేనాటికి అతని భార్య పెట్రొనెల్లా వయసు ఇరవై ఏళ్ళు. ఈమె తన స్వస్థలమైన Isle of Lewis లో ఉంటున్న తన అక్క మేరి వద్ద ఉండేటట్లు మెకంజీ తనవీలునామాలో ఏర్పాట్లు చేసాడు. పెట్రొనెల్లా 1823లో Robert Fulcher అనే సైనికాధికారిని పెళ్ళి చేసుకొని కొంతకాలం ఇండియాలో ఉండి 1828లో భర్తతో పాటు లండన్ వెళిపోయింది.

మెకంజీ సొంతడబ్బులు పెట్టి కొనుక్కొన్న పుస్తకాలు, పురావస్తువుల విలువ సుమారు లక్షరూపాయిలు ఉండొచ్చని విలువకట్టారు. వీటన్నింటిని ఇరవైవేల

8. Illustrating India, Jennifer Howes

రూపాయిలకు మెకంజీ భార్య కంపనీ ప్రభుత్వానికి ఇచ్చివేసింది. బహుసా విడివిడిగా వ్యక్తుల వద్ద ఉండే కంటే ఒకచోట ఉంటాయని భావించిందేమో!

మెకంజీ మరణించాక అతని స్థానంలోకి వచ్చిన అధికారికి దాదాపు "లక్ష పేజీల" వరకూ ఉన్న ఈ వ్రాతప్రతులను, ఇతరసేకరణలను ఎలా మదింపువేయాలో అర్ధంకాలేదు. వాటిని ఏంచేయాలో తెలియక కంపనీ అధికారులు తలలు పట్టుకొని కూర్చునేవారు. అలాంటి సమయంలో మెకంజీ మిత్రుడు H H Wilson అనే అధికారి వీటిని క్రోడికరించటానికి ముందుకురాగా, కంపనీ బోర్డు వెంటనే అనుమతినిచ్చింది.

విల్సన్ మెకంజీ సేకరణలను పరిశీలించి వాటిలో – 2070 స్థానిక చరిత్రలు; 8076 శాసనాలు; పన్నెండు భారతీయ భాషలకు చెందిన 1568 కావ్యాలు, తెలుగులో ఉన్నవి 176; 2159 ఇంగ్లీషు అనువాదాలు; 79 పటాలు; 2630 డ్రాయింగ్స్; 106 ఇమేజెస్; 6218 నాణాలు అంటూ వేరుచేసి వాటికి ఇండెక్స్ నంబర్లు ఇచ్చి మొత్తం ఆ వివరాలతో 1828లో Meckenzie Collection - A Descriptive Catalogue of the Oriental Manuscripts and Other articles అనే రెండు వాల్యూములు వెలువరించాడు. పైన చెప్పిన సేకరణలలో చాలా మట్టుకు బ్రిటిష్ లైబ్రేరీకి, కొన్నింటిని మద్రాసు లైబ్రేరీకి తరలించారు.

విల్సన్ ఈ పుస్తకానికి వ్రాసిన ముందుమాటలో– వీటన్నింటిలో శాసనాలు, స్థానికచరిత్రలు ముఖ్యమైనవని, వీటిని మరింత శోధించవలసి ఉందని భావించాడు. తెలుగు సాహిత్యంలో ఎక్కువగా సంస్కృత అనువాదాలు ఉన్నాయని, కొద్దిగా మాత్రమే స్వతంత్ర రచనలు లభించాయని అన్నాడు. కృష్ణా నదికి దక్షిణభాగం (రాయలసీమ ప్రాంతం) నుంచి మెకంజీ ఎక్కువ సేకరణలు జరిపినట్లు ఉత్తర భాగం నుంచి పెద్దగా సేకరణలు లేనట్టు గుర్తించాడు. బహుసా ఆ కారణం వల్లనే కడపజిల్లా కైఫియ్యతులు ఏడు సంపుటాలుగా మనకు లభించినట్లుగా ఇతర కోస్తా జిల్లాల కైఫియ్యతులు లభించవు.

ఆ తరువాత William Taylor మద్రాసు లైబ్రేరీలోఉన్న మెకంజీ వ్రాత ప్రతులకు సంక్షిప్తానువాదం చేసి Examination and analysis of the mackenzie manuscripts deposited in the madras library అనే పేరుతో 1862లో మూడు వాల్యూములు ప్రకటించాడు.

విల్సన్, టేలర్ చేసిన కేటలాగులను సమన్వయపరుస్తూ T.V. Mahalingam, 1976 లో Mackenzie Manuscripts: Summaries of the Historical Manuscripts in the Mackenzie Collection పేరుతో రెండు వాల్యూములను వెలువరించాడు.

**కాలిన్ మెకంజీ ప్రాసంగిత**

భారతీయులు చరిత్రను రకరకాల రూపాల్లో భద్రపరచుకొన్నారని మెకంజీ గ్రహించాడు. ఏఏ చోట్ల భారతదేశచరిత్ర నిక్షిప్తమై ఉందో కూడా మెకంజీ గుర్తించాడు. వాటిని తన జీవితకాలం అకుంఠిత దీక్షతో శ్రమించి సేకరించాడు. విల్సన్ అన్నట్లు మెకంజీ సేకరణలలో శాసనాలు, కైఫియ్యతులు ముఖ్యమైనవి. వీటిద్వారా అప్పటి సామాజికవ్యవస్థ, సాహిత్యం, ఆనాటి పాలకుల వంశావళి, ఆలయాలు, వాటికి ఇచ్చిన దానాలు, వాటి మాన్యాలు, ఆ ప్రాంతంలో పండే పంటలు, ప్రజలుకట్టిన పన్నులు, ఆ గ్రామ పుట్టుపూర్వోత్తరాల గురించిన కథలు, ఆనాటి గాథలు, విశ్వాసాలు, ఆచారవ్యవహారాలులాంటి అనేక సంగతులు తెలుస్తాయి. మెకంజీ వీటిని సేకరించి ఉండకపోతే చాలాస్థానిక విషయాలు కాలగర్భంలో కలసిపోయి ఉండేవి. ఈ కైఫియ్యత్తులు స్థానికులు వ్రాసుకొన్న చరిత్రలు. నేడు సబ్ఆల్ట్రన్ చరిత్రల అధ్యయనం ప్రపంచవ్యాప్తంగా విస్తృతంగా జరుగుతున్నది.

నేడు చరిత్రను మూడు కోణాలలో అధ్యయనం చేస్తున్నారు

1. చరిత్రను స్థలము, కాలము, అక్కడి ప్రజల సంస్కృతులను దృష్టిలో ఉంచుకొని చూడటం.
2. చారిత్రిక దస్తావేజులను ఆ దేశ స్మృతులుగా గుర్తించటం
3. వివిధ శాస్త్రాలు పరస్పర సహకారం అందించుకొని చరిత్రను నిర్మించటం.

పై మూడు కోణాలలోంచి చరిత్రకారులు నెరేటివ్స్‌ను నిర్మిస్తున్నారు. చరిత్రలో జరిగిన వివిధ సంఘటనలద్వారా మానవజాతి గమనం ఇలా నడిచింది అని చెప్పే కథనాలను హిస్టారికల్ నెరేటివ్స్ అంటున్నారు. ఇది ఒకరకంగా Civil history of Mankind. దీనిలో ఆధారాలను సేకరించటం ఒక ఎత్తు అయితే వాటిని విశ్లేషించటం మరొక ఎత్తు.

దక్షిణభారతదేశ చరిత్రను అధ్యయనం చేసే చరిత్రకారులకు మెకంజీ సేకరణలు రెండువందల ఏళ్లతరువాత కూడా ఇంకా తరగనిగని లాగ ఉన్నాయి.

ఇటీవలికాలంలో యూరోపియన్ చరిత్రకారుల దృష్టి బ్రిటిష్ మ్యూజియంలో ఉన్న అపారమైన మెకంజి సేకరణలపై పడింది. వాటిపై లోతైన రీసర్చ్ జరుగుతోంది. Jennifer Howes, Philip Wagnoner, Dirks Nicholas, Nick Barnard, Rama Sundari Mantena, Sushma Jansari లాంటి చరిత్రకారులు Mackenzie సేకరణలపై గొప్ప పరిశోధనలు చేసి పుస్తకాలు వ్రాస్తున్నారు.

**ఉపసంహారం**

కాలిన్ మెకంజీ దిగువమధ్యతరగతికి చెందిన కుటుంబంనుంచి వచ్చాడు. ఇతని తండ్రి ఒక పోస్ట్ మాస్టర్.

మెకంజీ ఆరు అడుగుల రెండు అంగుళాల పొడవుతో బలమైన దేహంతో ఉండేవాడట. మెకంజీ 57 ఏండ్ల వయసులో జావాయుద్ధంలో పాల్గొన్నపుడు అతనితో పాటు ఆ యుద్ధంలో పాల్గొన్న ఒక యువసహచరుడు చెప్పిన ఉదంతమిది. “ఒకరోజు అకస్మాత్తుగా చాలా సమీపంనుంచి మాపై శతృవుల దాడి జరిగింది. ఏం చేయాలో పాలుపోని నేను, ఆ ముసలాయన (మెకంజీ) జేబులో రెండు రైఫిల్స్ పెట్టి అతని తలరాత బాగుంటే తప్పించుకొంటాడు అని వదిలేసి మేం మా స్థావరాలవైపు పరుగులు తీసాం. ఆశ్చర్యకరంగా అతను మాకన్నా వేగంగా పరిగెత్తి, పొడవైనదేహంతో నీళ్లల్లో ఈదుకొంటూ మమ్ములను దాటుకొని శిబిరాన్ని చేరుకొన్నాడు. అతని శరీర దారుద్యం, హృదయ సామర్ధ్యంతో సమానమని మాకు అర్ధమైంది”



మెకంజి ప్రతినెలా తన జీతంలో చాలా భాగం లండన్‌లో ఉండే తన మిత్రుడైన Thomas Anderson ద్వారా స్కాట్లాండ్‌లోని తనకుటుంబానికి పంపించేవాడు. 1793 లో వ్రాసిన ఒక ఉత్తరంలో – తండ్రికి 50 పౌండ్లు, అక్కకు 25 పౌండ్లు, మేనత్తకు 10 పౌండ్లు అందచేయమని చెపుతాడు. 1796లో వ్రాసిన మరో ఉత్తరంలో తాను పంపుతున్న వంద పౌండ్లతో ఆర్ధిక ఇబ్బందులు

ఎదుర్కొంటున్న తన తండ్రిని చిక్కుల్లోంచి బయటపడేయమని కోరాడు. వీలైతే స్వయంగా వెళ్లి ఎలా మంచిదనిపిస్తే అలా సమస్యను పరిష్కరించమని అభ్యర్ధించాడు. మెకంజీ లేఖలలో తాను స్వస్థానానికి వెళ్లాలన్న కోర్కెను పదే పదే చెప్పుకొనేవాడు. ఇండియాలో అడుగుపెట్టిన తరువాత ఒక్కసారికూడా ఇంగ్లాండ్ వెళ్ళకుండానే చనిపోయాడు. మెకంజీ సమాధి కలకత్తాలోని South Park Street Cemetery లో కలదు.

మెకంజీ చెల్లెలు మేరీమెకంజీ స్కాట్లాండ్‌లో ఉండేది. తమ కుటుంబ సభ్యుల కొరకు ఈమె 1823లో అక్కడ ఒక సమాధి మందిరాన్ని కట్టించింది. మెకంజీ తల్లిదండ్రులు అక్కడే ఖననం చేయబడ్డారు. అక్కడ ఖననం చేయబడని కల్నల్ మెకంజీ సమాధిఫలకాన్ని కూడా మేరీ వేయించింది. దీన్ని నేటికీ అక్కడ చూడవచ్చును. ఆరుద్ర అక్కడకు వెళ్లి ఆ విశేషాలు సమగ్రాంధ్రసాహిత్యచరిత్రలో పొందుపరచాడు.

మేరీ తన తమ్ముడిని 29 ఏండ్ల వయసులో ఉన్నప్పుడు చూడటమే. మెకంజీ భారతదేశంలో ఏమి సేకరించాడో కళ్ళారా చూడలేదు. ఉత్తరాలు, సన్నిహితులు చెప్పే విషయాల ద్వారా మాత్రమే ఆ అక్కాతమ్ముళ్ళ అనుబంధం కొనసాగింది. ఆ పరిమితజ్ఞానంతోనే ఆమె వేయించిన మెకంజీ జ్ఞాపికాఫలకంలోని ఈ వాక్యాలు...

> "నాలుగుదశాబ్దాల పాటు భారతదేశంలో ప్రాచీన చరిత్ర, సాహిత్యం, పురావస్తువుల సేకరణలో– మానవశ్రమకు, అన్వేషణకు మించి చేసిన విశేష కృషి వల్ల నేడు ఎంతో విలువైన అపారసంపద ప్రపంచానికి కానుకగా మిగిలి ఉన్నది"

మెకంజీ సార్ధకజీవనానికి అద్దంపడతాయి.



# బోయినపూడి గ్రామ కైఫియత్తు[1]

*(పూర్వము ఈ గ్రామము జైనుల అగ్రహారము అని ప్రసిద్ధి కలదు. ఈ కైఫియత్తును గ్రామకరణమైన వత్తెనపల్లె వెంకట్రాయుడు వ్రాయించినది)*

శ్రీరామచంద్రులవారు పితృవాక్య పరిపాలనా దురంధరుడయి సీతాలక్ష్మణ సమేతముగా వనవాసము చేయు కాలములో ఈ ప్రాంతమునందు కల బిల్వవనములో కొన్ని రోజులు గడిపారు. బిల్వవనం మధ్యలో శ్రీరామచంద్రుడు, సిద్ధీశ్వరుడు అనే ఈశ్వరలింగాన్ని ప్రతిష్టచేసి, పూజాపునస్కారములు చేసి, దానికి చిన్నకుటీరము నిర్మించి ముందుకు సాగిపోయారట.

మరికొన్ని సంవత్సరములు గడిచాకా సిద్ధులు అనే మహాపురుషులు ద్రాక్షారామమును దర్శించి తిరిగి వారణావతం వెళుతుండగా ఈ బిల్వవనంలోని శివలింగం వారికి కనిపించింది. అరణ్యం మధ్యలో శివలింగాన్ని ప్రతిష్టచేయటం మానవమాత్రులవల్ల అయ్యేపని కాదు అనివారు తలచి దానిచుట్టూ రాళ్లతో చిన్న ఆలయము నిర్మించి, చాన్నాళ్ళు పూజాపునస్కారములు చేసారు. ఆ పిమ్మట ఆ సిద్ధులు ఆ ప్రాంతమును వీడి వెళిపోయారు.

అలా కొంతకాలము గడిచాకా, కలియుగము ప్రవేశించిన తరువాత ముక్కంటీశ్వరుడు[2] అనేరాజు ధరణికోటను పరిపాలించేవాడు. ఇతను ఒకరోజు ద్రాక్షారామ భీమేశ్వరుని, సర్పవరములో ఉన్న భావనారాయణ స్వామిని దర్శించుకొని, తన మందిమార్బలముతో అరణ్యములో వేటకు బయలుదేరాడు.

బిల్వవనం మధ్యలో దివ్యలింగాన్ని చూసిన ముక్కంటీశ్వరుడు, దీనిని ఎవరో మునీశ్వరులు ప్రతిష్టించిఉంటారు అని తలచి శిథిలావస్థకు చేరుకొన్న

---

1. AP Archives kaifiyats No 1084
2. ఈ ముక్కంటీశ్వరుని గురించి పుస్తకం చివరలో విపుల వ్యాసం కలదు.

ఆ చిన్న ఆలయం స్థానంలో రాతితో పెద్ద ఆలయమును, చుట్టూ మండపమును నిర్మించాడు. ఆలయమును ఆవరించి ఉన్న అరణ్యాన్ని తొలగించి నివాస యోగ్యంగా చేసాడు. ఆలయ నిర్వహణను సిద్ధముని అనే జైన బ్రాహ్మణునికి అప్పగించి అతనికి ఆ అడవిని తొలగించగా ఏర్పడిన ప్రాంతమును దానం చేసాడు. సిద్ధముని ఆ ప్రాంతమునకు జైనులను ఆహ్వానించి నూట ఒక్క వృత్తులు ఏర్పరచి దానిని ఒక అగ్రహారముగా అభివృద్ధిచేసాడు. అగ్రహారము మధ్యలో జైనప్రతిమలు, శిలావిగ్రహములతో కూడిన జైనాలయము కట్టించాడు. జైనులు క్రమేపీ అంతరించేవరకూ ఆ అగ్రహారము కళకళలాడుతూ ఉండేది.

ముక్కంటి మహరాజుకు జైన బ్రాహ్మణులంటే ఎంతో ఆదరభావం ఉండేది. ఆయన భార్యకు దేవబ్రాహ్మణులు అనే తెలుగు బ్రాహ్మణులంటే అభిమానము. వీళ్ళిద్దరూ తరచూ ఒకరు గొప్ప అంటే మరొకరు గొప్ప అని తరచూ చర్చించుకొనేవారట. ఒకరోజు రాణిగారు ఇద్దరినీ పరీక్షించి ఎవరు గొప్పో తేల్చండి అని కోరగా – ముక్కంటీశ్వర మహారాజు డబ్బై రెండు వినియోగముల వారితో (సభాసదులు) నిండు సభనేర్పరచి, జైన బ్రాహ్మణులను, దేవ బ్రాహ్మణులను సభకు పిలిపించి వారికి ఒక సమస్యను ఇచ్చాడు. అదేమిటంటే "సభాస్థలిలో రహస్యముగా ఒక వస్తువును భూమిలో పాతి ఉంచుతాను, దానిని చూడకుండా అందులో ఏమి ఉందో మీరు చెప్పాలి. జైనబ్రాహ్మణులు చెప్పలేకపోతే నా రాజ్యములో ఉన్న మొత్తం జైనబ్రాహ్మణులనందరనీ ఎక్కడెక్కడ ఉన్నా బంధించి గానుగలో వేసి తొక్కిస్తాను. దేవబ్రాహ్మణులు చెప్పలేకపోతే వారిని కూడా అలాగే సమూలంగా నిర్మూలిస్తాను" అని సభాసదుల సమక్షంలో పలికాడు. దీనికి ఇరుపక్షాలు అంగీకరించక తప్పలేదు. ఆ రాత్రిపూట ముక్కంటి రాజు, ఎవరికీ తెలియకుండా ఒక మట్టికుండలో ఒక సర్పమును ఉంచి పైన గుడ్డమూత కట్టి ఒక గోతిలో పాతించాడు[3].

మరునాడు రాజు ఆ జైన, దేవ బ్రాహ్మణులను సభకు పిలిపించి "నేను భూమిలో పాతి ఉంచిన వస్తువును మీమీ సామర్థ్యములతో గ్రహించి తెలపండి" అన్నాడు. దీనికి దేవ బ్రాహ్మణులు "మహాప్రభో ముందుగా జైన బ్రాహ్మణులను చెప్పమనండి" అని విన్నవించుకొన్నారు. దీనికి అంగీకరించిన జైన బ్రాహ్మణులు

---

3. ఇదే తరహా వృత్తాంతము పూరి జగన్నాథం కైఫియ్యతులో కూడా ఉంది.

మూడు రోజుల సమయము అడిగారు. మూడురోజుల తరువాత జైన బ్రాహ్మణులు నిండు సభలో “ప్రభూ ఈ సభముందర ఒక నూతన మంటపమున్నది (ఘటము?) అందులో ఒక సర్పము ఉన్నది” అని చెప్పారు. ఇది విన్న దేవ బ్రాహ్మణులు కూడా మూడు రోజుల సమయము కోరారు.

“జైన బ్రాహ్మణులు మంటపము, సర్పము ఉన్నవని చెప్పారు, మనమూ అదే చెపితే వారు యధార్ధము చెప్పినట్లు అవుతుంది అప్పుడు మనల్ని రాజు గానుగలో పడవేయిస్తాడు, గొప్ప సంకటము వచ్చిపడింది మనకు. మరియొక మాట చెప్పుటకు ఏమియూ తోచకున్నది. మనమీ పరీక్ష జయించలేకపోతే మన శిశు, బాల, వృద్ధము యావత్తూ క్షయము అయ్యేయోగము సంభవించినది అట్లయిన మన జాతి మొత్తం నిర్మూలించబడుతుంది” అనుకొంటూ దేవ బ్రాహ్మణులు తమలో తాము తర్జనభర్జనలు పడ్డారు. దేవబ్రాహ్మణులందరూ ఏకమై తమను రక్షించమని సూర్యభగవానుని వేడుకొన్నారు. అపుడు సూర్య భగవానుడు పన్నెండేండ్ల వయసుగలిగిన ఇద్దరు చిన్నవాండ్లను వెంటపెట్టుకొని, ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపంలో వచ్చి “ఓయీ బ్రాహ్మణోత్తములారా! మీరు ఎందుకు బాధపడుతున్నారు? ఈ చిన్నవాండ్రను వెంటపెట్టుకొని వెళ్ళి సమస్యకు పరిష్కారము ఈ పిల్లలు చెపుతారని రాజుతో చెప్పండి. మీకు జయం కలుగు తుంది” అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

దేవబ్రాహ్మణులు ధైర్యం తెచ్చుకొని ఆ పిల్లలను వెంటపెట్టుకొని ముక్కంటి మహారాజు ఆస్థానముకు వచ్చి “ప్రభూ ఈ సమస్య చాలా చిన్నది. మా స్థాయికి తగినది కాదు మా యొద్ద చదువుకొంటూ వున్నషువంటి విద్యార్ధులు పరిష్కరిస్తారు” అని చెప్పారు. అప్పుడా చిన్నవాండ్రు “మహారాజా మట్టిలో ఉంచిన వస్తువు ఒక సువర్ణ ఘటము, అందులో నవరత్నాలు పొదిగిన బంగారు పతకము” అని చెప్పారు. అంతట మహారాజు “ఇప్పుడే భూమిలో పాతిన వస్తువును పైకి తీయించు తాను, మీరు ఉభయులు చెప్పిన విధముగా లేకపోతే అనుకొన్న ప్రకారము తప్పుగా చెప్పినవారిని గానుగలో పడవేయిస్తాను” అని చెప్పి తాను పాతించిన చోటును తవ్వి చూడగా అక్కడ బంగారు పాత్ర దానిలో నవరత్నాలు పొదిగిన పతకము ఉన్నవట. అంత ఖచ్చితముగా దేవబ్రాహ్మణులు సమస్యను పరిష్కరించి నందుకు ముక్కంటీశ్వర మహారాజు, సభాసదులు ఆశ్చర్యం చెందారు. ముందుగా

అనుకొన్న షరతు ప్రకారం రాజ్యమునందున్న జైన బ్రాహ్మణులను ముక్కంటీశ్వర మహారాజు ఏరి ఏరి అందరినీ గానుగ లో పడవేయించి చంపించాడు. జైనులకు చెందిన సామాగ్రిని, సిద్ధాంత గ్రంధాలను తగలపెట్టించాడు.  ఆ విధంగా జైన బ్రాహ్మణులు ఈ ప్రాంతములో సమూలంగా నిర్మూలించబడ్డారు. ఆ తరువాత సిద్ధముని అగ్రహారము పాడుపడిపోయినది.

## నీలపువాండ్ల వృత్తాంతము

ఆ తరువాత గౌతమీ తీరం, హేమగిరి (వేమగిరి) దుర్గము నుండి వేంగి దేశమును పాలించిన చాళుక్య మహారాజు, సామర్లకోట, కుమారరామ భీమేశ్వరారామ ఆలయముకు గోపురము, ప్రాకారము, మండపాలు కట్టించాడు. ఆ ఆలయమునకు కాపలా కాసే నిమిత్తం ఆ  మహారాజు బోయన అనే శూద్రుని నియమించి, అతని పోషణ నిమిత్తం పైన చెప్పిన సిద్ధముని అగ్రహారము, ఆ గ్రామము ఆధీనంలో ఉన్న మాన్యాలను దానం చేసాడు. అపుడు ఆ బోయన, తూర్పుదేశములో ఉన్న వందమందికి పైగా తనబంధువులను పిలిపించుకొని ఆ గ్రామమును వృద్ధిచేసాడు. ఈ గ్రామము బోయినపూడిగా పిలవబడుతున్నది. వీరినందరినీ ఈ దేశములో నీలంవాళ్ళు అనే జాతిగా పిలుచుచున్నారు. వీరంతా ఆ కుమారరామాలయాన్ని, బ్రాహ్మణుల సత్రమును రేయనకా పగలనకా కాపలా కాస్తూ, ఆలయ అభరణాలు, సామాగ్రిని దొంగలబారి పడకుండా కాపాడుతూ ఉండేవారు. బోయన అనే అతను ఈ గ్రామానికి పశ్చిమభాగంలో పెద్ద చెరువు తవ్వించాడు.  అది ఇరవై సంవత్సరముల క్రితం వరకూ ఉండేది. ఆ తరువాత మరమ్మత్తు లేక ఆ చెరువు  పూడుకు పోయింది. ఊరికి నాలుగు వైపులా కట్టను కూడా తవ్వించాడు.

ఈ బోయనపూడి గ్రామం పూర్వభాగమునందు ఒక శిలాశాసనము ఉండేది.  పది సంవత్సరముల క్రితము కొందరు బైరాగులు వచ్చి ఆ శాసనము వద్ద వండుకొని భోజనము చేసి ఆ రాత్రి అక్కడే పడుకొని, ఆ శాసనపు రాతి క్రింద ఏవైనా నిధి నిక్షేపములు ఉన్నవేమోనని దాన్ని తవ్విచూసారు. ఏమీ లభించక ఆ బైరాగులు అలాగే వదిలేసి వెళిపోయారు. అలా ఆ రాయి చాన్నాళ్ళు అక్కడే ఉండేది, ఆ తరువాత దానిని ఎవరైనా గడపలకో, పునాదులకో తీసుకొని పోయి ఉంటారు. ప్రస్తుతం ఆ  రాయి కనిపించటం లేదు.

ఇప్పుడు ఈ గ్రామములో ఉండే నీలంవాళ్ళు ఒక జాతిగా శూద్రులలోను లేరు, చండాలురలోను లేరు. వీళ్ళు కారునలుపుగా ఉంటారు. వీరి వివాహాదులకు బ్రాహ్మణులు వచ్చి పౌరోహిత్యం చేస్తారు. వీళ్లు తెలగాలతో కాని చండాలురతో కాని కంచంపొత్తు, మంచం పొత్తు లేదు. వీళ్లను చండాలురున్ను చండాలురను వీళ్ళున్ను ముట్టడము లేదు. వీరు బ్రాహ్మణులవద్దకు వచ్చినప్పుడు చండాలురు ఎంతదూరంలో ఉండి మాట్లాడతారో అంతే దూరములో ఉండి మాట్లాడతారు. బ్రాహ్మణుల ఇండ్లకు వచ్చినపుడు చండాలుర వలెనె గుమ్మము వెలుపల ఉండి మాట్లాడడమే కానీ ఆవరణములోనికి రారు. ఈ బోయినపూడి గ్రామము నిండా నీలం వారే ఉన్నారు. వీళ్ళు మాంసాహారులైనా గోమాంస భక్షణ లేదు. పంది మాంసము తినుచున్నారు.

ఈ నీలము వాండ్లు గ్రామమునకు చెందిన పొలాలను దున్ని పండించి, దివాణానికి పన్నులు కడుతున్నారు. అంతేకాక దొంగతనములను కూడా వృత్తిగా కలిగి ఉన్నారు. చుట్టుపక్కల ఊర్లకు రాత్రుళ్లు వెళ్ళి గోడలకు కన్నములు తవ్వి ఇండ్లలో ఉన్న సొమ్మును దోచుకొనిపోవటం, పొలాలలో పుర్లు వేయించి ఉంచిన ధాన్యాన్ని ఎత్తుకుపోవటం, భూమిలో పాతర్లు[4] పెళ్లగించి ధాన్యము దొంగిలించటం, గోడలు దూకి పశువులను తోలుకుపోయి దూరప్రాంతములకు తీసుకువెళ్లి అమ్ముకోవటం, ఆ గ్రామ సమీపంగా వెళుతూన్న బాటసారులను కొట్టి దోచుకోవటం చేస్తూ ఉన్నారు. ఇటీవలి కాలములో ఇలా దొంగతనములు చేయటము తగ్గినది. వీరు వైష్ణవచక్రాంకనములను (నామములను) ధరించి ఆ మత సాంప్రదాయములను పాటించుచున్నారు.

---

4. పీడించే జమిందారులు, అగ్నిప్రమాదాలు, దొంగలనుండి తమ శ్రమను కాపాడుకోవటం కోసం రైతులు ధాన్యాన్ని పాతరలలో దాచుకొనేవారు. రైతుల ఇంటిముందు భూమిలో ఆరుఅడుగులలోతువరకూ గొయ్యితీసి, ఎండుగడ్డి పొరలు పొరలుగా అడుగున వేస్తారు. గడ్డిని జడలా అల్లి గోడలను తాకేలా దిగువనుంచి పైకి చుట్టూ పేరుస్తారు. అప్పుడా గోతిలో ధాన్యాన్ని నింపి పైన గడ్డిని, మట్టిని కప్పి పేడతో అలుకుతారు. దీన్ని ధాన్యం పాతర అంటారు. పాతరవేసి ధాన్యాన్ని భద్రపరచుకోవటం ఈనాటికీ ఉత్తరాంధ్రజిల్లాలలో కనిపిస్తుంది.

చాళుక్య రాజుల అనంతరం వచ్చిన శ్రీ కులోత్తుంగ చోడదేవ మహారాజులు కావేరీ తీరము మొదలుకొని గంగాతీరము వరకూ రాజ్యం ఏలుతున్నప్పుడు కూడా, బోయినపూడిలో నివసించే నీలము వారు శ్రీ కుమారరామ భీమేశ్వరారామ ఆలయ కాపలాసేవలు అందించారు.

గజపతి రాజు ప్రతినిధిగా సీతాఫిఖానుడు[5] అతని దివాను అవసరాల పెద్దిరాజు, రాజమహేంద్రవరం కోటను స్థావరంగా చేసుకొని ఈ ప్రాంత పరిపాలన సాగించారు. వీరిద్దరికి పొరపొచ్చాలు రావటంతో పెద్దిరాజు కనుగుడ్లు పీకించాడు సీతాఫిఖానుడు. గుడ్డివాడైన పెద్దిరాజు పల్లకిలో రాజమహేంద్రవరం నుండి గోలకొండకు పోయి అక్కడ విభురాం పాదుషా గారిని దర్శించుకొని, సీతాఫిఖానుడు తనకు చేసిన అన్యాయాన్ని చెప్పుకొని, తనకు సైనిక మద్దతు ఇచ్చినట్లయితే రాజమహేంద్రవరం కోటను మీ పరం చేస్తాను అని విన్నవించుకొన్నాడు. దీనికి పాదుషా గారు అంగీకరించి, పెద్దిరాజుకి సహాయంగా పటాలాన్ని పంపించాడు. గోల్కొండ నవాబు సేనలు క్రీశ.1572 లో రాజమహేంద్రవరం కోటను ముట్టడించినపుడు సీతాఫిఖానుడు వారి ధాటికి తాళలేక కోట విడిచి పారిపోయాడు. బోయినపూడి నీలపు వాండ్ల ధైర్యసాహసాలు, విశ్వాసపాత్రతలను అప్పటికే తెలుసుకనుక, సీతాఫిఖానుడు నూటయాభై మంది నీలపువాండ్లను రప్పించుకొని తనకు రక్షణగా పెట్టుకొన్నాడు. వీరందరినీ తురకబలములు పిల్లి లొద్దిలో పట్టుకొని శీతాఫిఖానుని తలనరికి చంపగా, నీలపువాండ్రు చెట్టుకొకరు పుట్టకొకరు పారిపోయారు. ప్రాణాలు దక్కించుకొన్న కొద్దిమంది నీలపువాండ్రు తిరిగి బోయినపూడి చేరుకొన్నారు.

దేశంలో తురకల ప్రభుత్వం వచ్చింది కనుక కుమారరామ మొదలయిన దేవస్థానముల గుమ్మములలో తురకలు బసలు చేసి పూజలు నడవనిచ్చేవారు కారు. ఉత్సవములు జరిగేవి కావు. ఆ రకంగా అంతవరకూ దేవాలయంను అంటిపెట్టుకొని జీవనాన్ని సాగించిన నీలపువాండ్రకు గడ్డుకాలం వచ్చిపడింది. క్రమేపీ వారు వ్యవసాయ కూలీలుగా స్థిరపడ్డారు.

---

5. సితాఫిఖానుడి గురించి విపులంగా పుస్తకం చివరలో వ్యాసం కలదు.

ఈ గ్రామమునకు పూర్వమందు వెదిరేశ్వర అనే కంసాలె వాండ్లు మిరాసీ దారులుగా ఉండేవారు. ఆ తరువాత గణపతి మహారాజు వారి పాలనలో గోపరాజు రామన్న[6] అనే నియోగి క్రీశ. 1144లో దేశమంతటికీ కరణపు హక్కులను తెచ్చుకొన్నప్పుడు బోయినపూడి కరణీకము పంతెన అనే ఆరువేలనియోగికి ఇప్పించినారు. నాటినుంచీ ఆ వంశీయులు అనుభవిస్తూ వున్నారు.

ఈ గ్రామములో పెసలు, ఆముదాలు, మినుములు, అలచందలు, అనుములు, లంకపొగాకు పండుతున్నాయి.



---

**6. గోపరాజురామన్న**

తెలుగు చోడరాజులు ధనదాపురాన్ని (నేటి గుంటూరు జిల్లా చందోలు) రాజధానిగా చేసుకొని పదకొండు, పన్నెండు శతాబ్దాలలో ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ఆ సమయంలో తూర్పుగోదావరి కూడా వీరి పరిధిలో ఉండేది. ఈ వంశానికి చెందిన గణపతి మహారాజు (కాకతి గణపతి కాదు) క్రీశ. 1128 నాటి ఒక శాసనము ద్వారా గొప్పయోధునిగా వర్ణించబడ్డాడు. (History of Andhra country 1000 AD to 1500 AD by Yashoda Devi, p.no 29)

ఈ గణపతి మహారాజు మంత్రి గోపరాజురామన్న. క్రీశ. 1144 రక్తాక్షినామ సంవత్సర భాద్రపద అమావాస్య, సూర్యగ్రహణం ఏర్పడింది. గ్రహణసమయములో రాజ్యాధినేతగా ఉండటం ముప్పు అని చెప్పటంచే, గణపతి మహారాజు ఆ సమయములో గోపరాజురామన్నకు రాజ్యభారాన్ని ధారాపూర్వకముగా అప్పగించాడు. సూర్యగ్రహణం ఉన్న కొద్దిగంటలలో ఇతను రాజ్యంలో ఉండే అన్ని గ్రామాల కరణీకపు హక్కులను రద్దుపరచి, అంతవరకూ పనిచేస్తున్న కరణములను తొలగించి వారి స్థానంలో ఆరువేలమంది బ్రాహ్మణులను నియోగించినట్లు గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల కైఫియత్తులలో కలదు. క్రీశ. 1144 ఆగష్టు 30వ తారీఖున పాక్షిక సూర్యగ్రహణం జరిగింది (Meckenzie Manuscripts, V Mahalingam, P.N 37) కృష్ణ స్వామి నాయుడు కూర్చిన సౌత్ ఇండియన్ క్రొనలాజికల్ టేబుల్స్ లో కూడా పేజి నంబరు 49లో క్రీశ. 1144 (1067 శాలివాహన శకం) రక్తాక్షినామ సంవత్సరంగా ఉన్నది. ఈ ఉదంతానికి సంబంధించి తారీఖులు గ్రహణతిథులు సరిపోతున్నాయి కానీ అంతకుపూర్వం కరణాలుగా పనిచేసిన ఆరువేలమంది ఎవరు అన్నది చరిత్రలో ఒక మిస్టరీగా మిగిలిపోయింది.

# చిన్ని పువ్వు తేనె కైఫియతు[1]

*రాజమహేంద్రము జిల్లా, పిఠాపురం తాలూకాలో కోన అడవి యందు చిన్న పువ్వు తేనె కయిఫియ్యతు*

రాజమహేంద్రవరమునకు తూర్పున ఇరవై క్రోసుల దూరముగా (65 కిమీ) ఉండే పిఠాపురమునకు ఆరుక్రోసుల (20 కిమీ) దూరములో ఒక అడవీ ప్రాంతం ఉంది. దానిని కోన అడవి అని పిలుస్తారు. ఈ కోనకు తూర్పువైపు సముద్రము, పడమరన పొన్నాడ, తొండంగి, వేమయి గ్రామాలు కలవు, ఉత్తర దక్షిణాల పొడవు సుమారు పది క్రోసులు. ఈ కోన అడవిలో సంచరించే ఆవులు, ఎడ్లు గ్రామములలో నుండే పశువులకంటే చాలా బలిష్టంగా ఉండి, కొమ్ములు తిన్నగా ఏ వంకరలు లేకుండా ఉంటాయి. ఇవి మనుషుల చప్పుడు వినగానే లేళ్ళు చెంగు చెంగున గెంతినట్లు గంతులు వేసి పారిపోతున్నవి. ఈ అడవి యందు దోమలు విస్తారముగా ఉండటంచే, ఈ పశువులు పగలు అడవిలో గడ్డి మేసి రాత్రిళ్ళు అడవిలో పడుకోకుండా సముద్రపు ఒడ్డుకు చేరి, కెరటాలు నీళ్ళ శరీరానికి తగిలేటట్లు పడుకొంటున్నాయి. ఒకోసారి సమీప గ్రామాలపై పడి వరిచేలను కూడా మేస్తున్నవి. అలా సముద్రపు ఒడ్డున పడుకొన్న ఈ పశువులను కలక్టర్లు మొదలైన దొరలు చెట్లచాటునుండి తుపాకితో కాల్చి చంపటం ఒక వినోదంగా సాగిస్తున్నారు.

ఈ అడవినందు పుశిణిగ, దొర్నిగ, గొల్లు వంటి గుబురుచెట్లు ఇవికాక కుంకుడు చెట్లు, పాలచెట్లు లాంటి పెద్ద చెట్లు ఇంకా చిన్నిచెట్లు అనే పేరుగల పొదలు అధికంగా ఉన్నాయి. వీటన్నిలోకెల్లా పాలచెట్లు పెద్దవి, ఒక్కోదాని మొదలు యాభై జానల వరకు ఉండి, లోపల ఒక మనిషి కులాసాగా కూర్చోగలిగేటంతటి తొర్రలను కలిగి ఉన్నవి. ఈ చుట్టుపక్కల గ్రామస్తులు,

1. AP Archives kaifiyats R No 1084

తొర్రలుకల ఈ పాలచెట్ల మానులను కొట్టి వ్యవసాయ పనులకు నీరు పారిం చేందుకు తూములుగా వాడుకొంటున్నారు.

ఈ కోన అడవిలో తేనె తుట్టెలు అధిక సంఖ్యలో ఉన్నాయి. ఈ అడవి పిఠాపురం జమిందారు గారి ఏలుబడిలో ఉన్నది. పైన చెప్పిన గ్రామాలలో పలుకుబడి కలిగినవారు పిఠాపురం దివాణం నుండి మూడేసి సంవత్సరములకు ఈ అడవిని కౌలుకు తీసుకొని, తమ తాలూకు మనుషులను ఉంచి బందోబస్తు చేసుకొని తేనె, కుంకుడు కాయలు, పిసిణిపండ్లు, గొల్గు పండ్లు సేకరించి అమ్ముకొంటూ ఉంటారు.

## చిన్నపువ్వు తేనె తయారయ్యే క్రమము

ఈ అడవిలో చిన్న పరిమాణంలో ఉండే తేనెటీగలు విస్తారంగా ఉన్నవి. ఇవి పాలచెట్ల తొర్రలలో తుట్టెలు పెడతాయి. చిన్నిచెట్లు అనబడే చెట్లకు చిన్ని చిన్ని తెల్లని పువ్వులు ఉంటాయి. వరిపంటలు పండే దినములలో వరి పువ్వారు అనే పేరుగల వరిపువ్వులు ఉంటాయి. ఈ చిన్నితేనెటీగలు చిన్నిచెట్లపువ్వులనుండి, వరి పువ్వారు నుండి మకరందాన్ని సేకరించి, పాలచెట్ల తొర్రలలో నిర్మించుకొన్న తుట్టెలలోకి చేర్చి తేనెగా మారుస్తాయి. అలాంటి తేనెను 'చిన్నిపువ్వు తేనె' అంటారు. ఈ చిన్నిపువ్వుతేనె ఆషాఢ, మార్గశిర మాసములలో లభిస్తుంది. ఆషాఢమాసములో లభించే తేనెలో వరిపువ్వారు మకరందం కలవదు కనుక పలుచగా, రుచి తక్కువగా ఉంటుంది. మార్గశిర, కార్తీక మాసాలలో లభించే తేనెలో వరిపువ్వారు కూడా కలవటం వలన చిక్కగా, అత్యంత తియ్యగా ఉంటుంది. ఒక్కొక్క తేనెతుట్టె నుండి ఎనిమిది నుంచి పది వీసెల తేనె వస్తుంది. (ఒక వీసె: 1400 గ్రాములు) ఈ సమయములో పిఠాపురం రాజుగారి సిపాయిలు ఈ అడవిలో పాకలు వేసుకొని, కాపలా కాస్తూ చిన్నిపువ్వుతేనెను సేకరించి రాజావారికి చేరుస్తారు. వారు దానిని తమ బంధు మిత్రులకు పంచుపెట్టుకొని, మిగిలినది తాము వాడుక కొరకు ఉంచుకొంటారు.

చిన్నిపువ్వుతేనె చిక్కగా తెల్లని పలుకులతో సూరేకారపు ఉప్పువలే గడ్డలుకట్టి, అతి మధురమైన రుచిని కలిగి ఉంటుంది. సంవత్సరం పొడవునా రెండు మూడు డబ్బులఎత్తు (సుమారుగా రెండు మూడు చెంచ్చాలు) ఎప్పుడు దీనిని తీసుకున్నా ఒంటికి మిక్కిలి చలువ చేస్తుంది.

ఈ చిన్నిపువ్వు తేనె అనేది సంవత్సరానికి రెండుసార్లు తయారవుతుంది. మొదట ఆషాడమాసములో అయ్యే చిన్నిపువ్వుతేనె కొంచెము పలచగా ఉండి పెద్దగా తీయదనం ఉండదు. ఆషాడమాసములో వరిపువ్వారు ఉండదు కనుక పాలచెట్ల పూలలోని మకరందాన్ని మాత్రమే ఈ చిన్నితేనెటీగలు తీసుకొని వచ్చి తేనెగా మారుస్తాయి. వరి పువ్వారు లేని కారణంగా ఈ కాలములో వచ్చే తేనె పలచగా, తక్కువరుచితో ఉంటుంది. కార్తీక, మార్గశిర మాసములలో వరిపంట ఉంటుంది కనుక వరిపువ్వారు నుండి లభించే మకరందమును ఈ చిన్నితేనెటీగలు సేకరించి తేనెగా మారుస్తాయి. వరిపువ్వారు మకరందం కలిసిన చిన్నిపువ్వుతేనె రుచికరంగా చిక్కగా ఉంటుంది. దిగుబడి కూడా ఎక్కువగా ఉంటుంది.

ఈ అడవి సమీపముగా ఉన్న పొన్నాడ, వేమవరం వగయిరా గ్రామాలలో వరిమొదలయిన పంటలు పండుతాయి. తొండంగిలో విస్తరించి నువ్వులు పండుతవి. ఎక్కడెక్కడినుంచో వర్తకులు వచ్చి తొండంగిలో నువ్వులను కొనుక్కొని రవాణాచేసుకొని తీసుకువెళ్ళటం కద్దు. ఈ అడవి బహుదట్టమయినది. పెద్దపులి వచ్చి వుండదు గనుక అడవియందు ఎక్కువగా అడవిగోవులు సంచరిస్తూ వుంటున్నవి. ఈ కోనఅడవిలో ఇండ్లకలప అయ్యే వృక్షములు లేవు. తుమ్మచెట్లు, చింతచెట్లు, వేపచెట్లు కలవు. తతిమ్మా అంతా తుప్ప అడవి.



---

**వివరణ**

పాలచెట్లు సపోటా జాతికి చెందిన అడవి వృక్షాలు. పన్నెండు మీటర్ల ఎత్తు వరకూ పెరుగుతాయి. ఆగస్టునుండి డిసంబరు మధ్యలో కాపుకు వస్తాయి. సాధారణంగా తేనెటీగలు వివిధ రకాల పూల మకరందాన్ని సేకరించి తేనెగా మారుస్తాయి. ఒకే రకమైన పూవులనుండి సేకరించిన తేనెను Monofloral Honey అంటారు. సేకరించబడిన పూల ఆధారంగా అలాంటి తేనెకు ప్రత్యేకమైన రంగు, రుచి, చిక్కదనం, సువాసన వస్తాయి. కొన్ని పూవ్వుల తేనెకు ఔషదగుణాలు ఉంటాయని భావిస్తారు. ఆ కారణంగా మోనో ఫ్లోరల్ తేనెకు వ్యాపారపరంగా

అధిక ధర పలుకుతుంది. ఆ పువ్వులు పుష్పించే కాలంలో ఉత్పత్తి అయిన తేనెను సాధారణంగా ఆ పూల తేనెగా పరిగణించి సేకరిస్తారు. తులిప్ పూల తేనె, తుమ్మపూల తేనె, యాపిల్ పూల తేనె, యూకలిప్టస్ పూల తేనె, లావెండర్ పూలతేనె అంటూ వివిధ రకాల తేనెలు ఈ రోజు మనకు లభిస్తున్నాయి.

చిన్నిచెట్ల పువ్వులు, వరి పువ్వారు నుంచి సేకరించిన తేనెను చిన్నిపువ్వు తేనె గా ఈ కైఫియత్తులో వర్ణింపబడింది. చిన్ని చెట్టు శాస్త్రీయనామం Maytenus senegalensis. దీనినే దంతి చెట్టు, చిన్ని తుప్ప అని కూడా పిలుస్తారు. ఇంగ్లీషులో Thorny staff tree అంటారు. పెద్దగా సారవంతం కాని నేలలో పెరిగే ఔషద విలువలు కలిగిన ముళ్ల పొద ఇది. దీని ఆకులరసం పచ్చకామెర్లకు, పండ్ల రసం అల్సర్స్, పైల్స్, రక్తశుద్ధి, పిప్పిపళ్ల, నివారణకు ఆయుర్వేదంలో వినియోగిస్తారు[1]. చిన్నిపువ్వు తేనెకు ఔషదవిలువలు ఉంటాయని ఒక విశ్వాసం.



1. Thorny staff tree, Indian Medicinal Plant, Indianetzone.com.

# రాజమహేంద్రవరం మరియు యోమగిరి కైఫియ్యతు[1]

ఆంధ్రదేశమునందు గౌతమీ తీరమున హ్యేమగిరి కోటకు (ప్రస్తుత వేమగిరి) ఉత్తర బాగమునందు దట్టమైన అరణ్యం కలదు. పూర్వం చాళుక్య వంశానికి చెందిన కుబ్జవిష్ణువర్ధనుడు[2] మొదలయిన రాజులు ఆంధ్రదేశాన్ని పాలించే కాలములో హ్యేమగిరికి సమీపములో బిరుదాంకరాయపురం (ప్రస్తుత బిక్కవోలు) అనే పట్నమందు నివాసము ఉంటూ పరిపాలించేవారు. పట్నము క్రమేపీ వైభవం కోల్పోయి గ్రామముగా మారిపోయినది. ఆ ఊరికి సమీపంలో కోటదిబ్బలు కలవు. ఆ చోట్లో మూడు ప్రాకారములతో కోటలు ఉండేవి అని ప్రజలు చెప్పుకొంటారు. బిక్కవోలు ఒకనాటి రాజధాని అని తెలిపే శిలాశాసనముల ఆధారములేవీ లేవు కానీ కొన్ని నిదర్శనములు కనిపిస్తాయి.

కుబ్జవిష్ణువర్ధన మహారాజు సింహాసనానకు తొమ్మిదో పురుషుడైన విష్ణువర్ధన మహారాజు కుమారుడైన విజయాదిత్య మహేంద్ర మహారాజు[3] నలభైఎనిమిది సంవత్సరములు రాజరికం చేసాడు. ఈయన రాజరికంలో నూట ఎనిమిది యుద్ధములందు జయము పొందినందుకు నూటఎనిమిది శివాలయములు ప్రతిష్ఠ

---

1. AP Archives kaifiyat s R No 1084
2. కుబ్జవిష్ణు వర్ధనుడు (624-641) పిఠాపురాన్ని రాజధానిగా చేసుకొని గోదావరి ప్రాంతాన్ని పాలించాడు. ఇతని కుమారుడు జయసింహాI పరిపాలనా సౌలభ్యం కొరకు రాజధానిని పిఠాపురం నుంచి వేంగికి మార్చాడు. బిక్కవోలునందు ఆ వంశీకులలో ఎవరు నివసించారో తెలియరాదు.
3. ఇతను రెండవ విజయాదిత్యుడు (క్రీ.శఈ 806-846). ఇతని తమ్ముడు భీమసళుకె తో వారసత్వపోరు ఎదుర్కొన్నాడు. ఇతను శత్రువులతో 108 యుద్ధాలు చేసి, ఆయా చోట్ల నూట ఎనిమిది శివాలయాలను నరేంద్రేశ్వరునిపేరిట నిర్మించి వేంగి అంతటా అగ్రహారాలు, చలివేంద్రలు, తోటలు, చెరువులు, ఉద్యానవనాలు పాపపరిహారంగా నిర్మించాడని Cp.3 of 1908-09, సాతలూరు శాసనాల ద్వారా తెలుస్తున్నది.

చేయించినట్లు పిఠాపురం కుంతీమాధవస్వామి దేవాలయములో కల శిలా శాసనమునందు కలదు. ఇదికాక రాజమహేంద్రవరం జిల్లా, తాడేపర్తిలో భూమిలో దొరికిన తామ్రశాసనపు పలకలలో కూడా వ్రాసిఉన్నది. నేటి బిక్కవోలు గ్రామములో శిథిలమయిన దేవాలయాలు విస్తరించి ఉన్నాయి. గ్రామములో ఎవరైనా నూతులు తవ్వేటపుడు, కాలువలు తవ్వేటపుడు, దేవాలయాల విమాన పీఠములు, కీర్తి ముఖాలు చెక్కిన రాళ్ళు, మంటపాల స్తంబాల పీటలు, మూరడు పొడవుండే ఇటుకలు అనేకం కనపడుతున్నాయని చెప్పుకొంటారు. ఈయన తదనంతరము ఇతని కుమారుడు కలి విష్ణువర్ధనుడు ఆంధ్రదేశమును రెండు సంవత్సరములు రాజరికము చేసాడు.

తరువాత ఇతని కుమారుడు విజయాదిత్య మహేంద్రుడనే రాజు ఆంధ్రదేశం పాలించే కాలమందు తన పరివారంతో హ్యామగిరి కొండలపై వేటకు వెళ్లాడు. ఆ కొండపై విశాలమైన పీఠభూమి ఉన్నట్లు గుర్తించాడు. ఇక్కడ కోట కట్టించినట్లయితే బాగుంటుంది అని భావించాడు. ఆ కొండకు రెండు క్రోసుల దూరం వెళ్ళి, గోదావరి తీరాన్ని చేరి అక్కడ మేకలమంద మేపుతూ ఉన్న ఒక గొల్లవాడిని పిలిచి "ఓయీ ఇక్కడ పట్టణము కట్టిస్తే ఎలా ఉంటుందిరా" అని అడిగితే ఆ గొల్లవాడు "బాబుగారు ఇది ఎప్పటికీ పాడుగాదు" అని అన్నాట్ట. వాడినోట శుభం పలికినందుకు తక్షణం వాడి నోటినిండా వరహాలు పోయించి, ఆ క్షణమే హ్యామగిరిని కేంద్రంగా రెండు క్రోసుల పరిధిలో పట్టణం కట్టించాలని నిర్ణయించుకొన్నాడు విజయాదిత్య మహేంద్రుడు[4].

ఆ మరునాటినుంచి హ్యామగిరిమీద విశాలమైన కోట కట్టించటం మొదలెట్టాడు మహేంద్రుడు. కోట చుట్టూ కందకము తవ్వించి, నీళ్ళ వసతి కొరకు కోట దక్షిణభాగమున పెద్దచెరువు తవ్వించాడు. ఆ వైపు ఉన్న కోట ద్వారమును

4. విజయాదిత్య మహేంద్ర మహారాజునే గుణగ విజయాదిత్యుడంటారు (క్రీశ. 848–891). ఇతని సేనాని పండరంగడు నెల్లూరు లోని బోయకొట్టములను జయించటంతో దక్షిణాంధ్ర మొత్తం ఆధీనంలోకి తెచ్చి పాలించాడు. గుణగ విజయాదిత్యుని అనంతరం చాళుక్య భీముడు I (892–921) పాలించాడు. ఇతని అనంతరం ఇతని మనవడు అమ్మరాజు I (921–927) వేంగిని పాలించారు. ఆ తరువాత అంతఃకలహాల వల్ల కొంతకాలం "రాజులేని కాలం" గా చెప్పబడింది శాసనాలలో. కాగా, రాజమహేంద్ర పట్టణాన్ని క్రీశ. 945–970 మధ్యలో పాలన చేసిన అమ్మరాజు II నిర్మించాడని H. Morris, రాజరాజ నరేంద్రుడు నిర్మించాడని ఎన్. వెంకట రమణయ్య అభిప్రాయ పడ్డారు.

మంచినీళ్ళ ద్వారమని, గోదావరివైపు ఉన్న ద్వారమును పశ్చిమ ద్వారమని, ఈశాన్యపు వైపున ఉన్నద్వారము కోరుకొండవైపునకు ఉంటుంది కనుక దానిని కోరుకొండ ద్వారమని, కోటకు ప్రధాన ద్వారమును సింహద్వారము అనే పేర్లతో కోటనిర్మాణం జరిగింది. కోటలోపల కోదండరామస్వామికి, ఈశ్వరునికి ఆలయములు, నివసించటానికి విశాలమైన మేడలు నిర్మించాడు.

హ్యామగిరి కోటకు ఉత్తరభాగమున రెండుక్రోసుల దూరములో రాజ మహేంద్రవరము అనే పేరిట పట్టణము కట్టించి, పట్టణమునకు ఉత్తర భాగమున నేలకోట ఒకటి కట్టించినారు. ఆ కోటచుట్టూ ఎత్తుతక్కువ కల గోడలను మధ్యలో రాళ్ళు, వాటికి ఇరువైపులా మన్నుపూసి రాళ్లు కనిపించకుండా నిర్మించారు. కోటకు పశ్చిమ బురుజులు గోదావరి ఒడ్డుకు చేర్చి ఉన్నవి. కోటకు దక్షిణం వైపు పట్టణములోకి పోవటానికి పెద్ద సింహద్వారము ఉంచారు. దీనికి పుర ద్వారము అని పేరు. (నేటి రాజమండ్రి కోటగుమ్మం అని పిలవబడే స్థలం).

ఇటీవల రాజమహేంద్రపురములో ఉన్న జడ్జి లాంగు దొర గారు ఈ కోట శిధిలాలలో భూగర్భంలోకి వెళ్ళే మూసుకుపోయిన మార్గాన్ని[5] కొంతదూరము తవ్వించి లోపలకు కూలీలను పంపించాడు. ఈ విషయము తెలుసుకొన్న నేను 14 సెప్టెంబరు 1815న విని సీతానగరమునుండి రాజమహేంద్రవరము కోట శిధిలాలవద్దకు వెళ్ళి, రెండు దివిటీలు వేయించి, కోట సొరంగములలో యాభై బార్ల వరకూ వెళ్ళగా, మట్టి అడ్డముగా ఉన్నకారణంగా వెనుకకు తిరిగిరావడమైనది. (ఈ కైఫియ్యతు లేఖరి). ఆ సొరంగము ఎంతవరకూ పోవుచున్నదో తెలియదు.

కోటలోపల పురద్వారమునకు సమీపమున గోపాలస్వామి ఆలయము, ఈశ్వరాలయము, మార్కండేయాలయములు కట్టించారు. అంతేకాక పట్టణము

5. ఈకోటలో నందగోపాలుడు, వీరభద్రస్వామి ఆలయములు ఉండేవని శ్రీనాథుని పద్యాలద్వారా తెలుస్తున్నది. కోటలో కల నేలమాళిగ దారి కోరుకొండ కోటకు వెళుతుందని స్థానికులు నమ్ముతారు. కోటగోడలు క్రిందిభాగం అరవై అడుగుల వెడల్పుతోను, పై భాగము పదిహేను అడుగుల వెడల్పుతోను ఉండేవి. కోటలోపల రాజభవనం, అంతఃపురం, సభా భవనం, అశ్వశాల, గజశాల, మంత్రుల భవనాలు, పరిచారకుల గృహాలు ఉండేవి. నాటి మదన వేణుగోపాల స్వామి దేవాలయమే నేటి పెద్దమసీదు. నేటి గోదావరి రైల్వేస్టేషన్, మున్సిపల్ ఆఫీసు, ఆనం కళాకేంద్రం సుబ్రహ్మణ్య మైదానం, దామెర్ల ఆర్టు గాలరీ, గౌతమీ గ్రంధాలయం, పశువుల ఆసుపత్రి, లూథరన్ హైస్కూలు మొన్నగు ప్రదేశాలు ఆనాటి కోట ఉండిన స్థలానికి చెందినవే.

మధ్యలో కొన్ని ఈశ్వరాలయములు, విష్ణు ఆలయములు అక్కడక్కడా కట్టించి, హ్యేమగిరి దుర్గము కేంద్రముగా దేశం యావత్తును నలభైనాలుగు సంవత్సరములు రాజరికం చేసినాడు.

విజయాదిత్యమహేంద్రునకు తరువాత ఇతని తమ్ముడయిన విక్రమాదిత్యు కొమారుడు చాళుక్యభీమ మహారాజు హ్యేమగిరి కోటకు అధిపతి అయి ముప్పై ఆరు సంవత్సరములు రాజరికం చేసాడు.

ఆ తరువాత ఆయన కుమారుడు విజయాదిత్యమహారాజు, తరువాత ఈ వంశస్థుడే అయిన అమ్మరాజు ఏడు సంవత్సరములు రాజరికం చేసాడు. తరువాత చాళుక్య భీమ మహారాజు కొమారుడు, విక్రమాదిత్యుడు పదకొండు నెలలు రాజరికము చేసినాడు. అంతట చాళుక్య వంశస్థుడయినట్టి యుద్ధ మల్లుడనే వాడు[6] దేశం ఆక్రమించుకోని యుద్ధములో జయించి హ్యేమగిరి కోటకు అధిపతి అయి ఆరునొక సంవత్సరములు ప్రభుత్వము చేసినాడు.

తరువాత భీమ మహారాజు పద్దెనిమిది సంవత్సరములు, పిదప అమ్మరాజు కొన్నిదినములు రాజరికం చేసినారు. అటుపిమ్మట దాన భూపతి రాజరికం చేస్తూ ఉండగా, చోళ రాజులు వచ్చి ఈ వేంగిదేశమును ఆక్రమించు కొనిరి. అంతవరకు దానభూపతి[7] మూడు సంవత్సరములు ప్రభుత్వము చేసినాడు. చోళరాజులు ఇరవైయేడు సంవత్సరములు వేంగి దేశము యేలుకొని పోయిరి.

6. ఇతను రెండవ యుద్ధమల్లుడు (927-933 ). ఇతని పాలన అనేక ఒడిదుడుకులతో సాగింది. ఇతనుపరిపాలించిన కాలాన్ని ఆ తరువాత వచ్చిన రాజులు గుర్తించలేదు. శాసనాలలో "అస్వామిక" అంటే రాజులేని కాలంగా వర్ణించారు. అమ్మరాజు మరణం తరువాత సింహాసనం కొరకు జరిగిన పోరులో యుద్ధమల్లుడు, చాళుక్య భీమ II తల పడ్డారు. ఈ అంతఃకలహంలో చాళుక్య భీమ II రాజ్యం దక్కించుకోవటానికి ఏడేళ్ళు పట్టింది. రాజ్యం దక్కించుకొనే ప్రక్రియలో యుద్ధమల్లుడు, శత్రువులైన రాష్ట్రకూటులతో చేయికలిపినందుకు, అతని ఉనికిని తదనంతర రాజులు ఎక్కడా ప్రస్తావించలేదు. ఇతను రాజమహేంద్రవరంనుంచి కాక విజయవాడనుంచి పాలన సాగించాడు.
7. ఇది బహుసా దనార్నవుడు కావొచ్చు. ఇతను అమ్మరాజు II ను కూలదోసి రాజ్యం చేజిక్కించుకొన్నాడు. ఇతను క్రీశ.973లో జటా చోడ భీముని చేతిలో హతమయ్యాడు. దనార్నవుని కొడుకులు వేంగినుంచి పారిపోయి తంజావూరులోని చోళచక్రవర్తి రాజరాజచోడుని వద్ద శరణుజొచ్చారు. వీరిలో పెద్దవాడైన విమలాదిత్యుడిని రాజరాజ చోడునిఅల్లుడిగా చేసుకొన్నాడు. రాజరాజచోడుడు జటా చోడభీముడుని సంహరించి వేంగి రాజ్యాన్ని తన అల్లుడు విమలాదిత్యుని అన్న అయిన శక్తివర్మ I కి కట్టబెట్టాడు. ఇతను క్రీశ.1000-1011 వరకు వేంగి రాజ్యం ఏలాడు. ఇతని తరువాత విమలా దిత్యుడు వేంగి రాజయ్యాడు.

తరువాత చాళుక్య వంశస్థుడయిన కీర్తివర్మ (శక్తివర్మ I) అనేరాజు తిరిగి వేంగిదేశం సాధించి పన్నెండు సంవత్సరములు రాజరికము చేసెను.

ఆ తరువాత విమలాదిత్యమహారాజు యేడు సంవత్సరములు రాజరికం చేసినాడు. ఈ విమలాదిత్యుని కొమారుడు రాజరాజు వేంగి దేశానకు అధిపతి యయి హ్యేమగిరి కోటలో సమస్త సైన్యముతోను ఉండి రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు. ఈ రాజరాజునే రాజరాజ నరేంద్రుడని[8] ప్రజలు పిలుచుకొంటారు.

**సారంగధర వృత్తాంతము**

రాజరాజుకు రత్నాంగి, చిత్రాంగి అని ఇద్దరు భార్యలు. ఈ ఇద్దరకు వేరువేరు మేడలు కట్టించాడు రాజు. చాలాకాలము సంతానము లేని రాజుకు, రత్నాంగి ద్వారా సారంగధరుడు జన్మించాడు. ఇతనికి పద్దెనిమిది సంవత్సరములు వచ్చి అతిసౌందర్యవంతుడై ఉండేవాడు. ఒకరోజు చిత్రాంగి తన మేడపైనుండి సారంగధరుని చూసి, అతనిపై తలచరాని తలంపు తలచింది. ఒకనాడు సారంగధరుడు పావురములతో ఆడుకొనుచుండగా, అతని చేతిలోంచి ఎగిరి పోయిన పావురము చిత్రాంగి మేడపై వాలింది. ఆ పావురమును పట్టుకోవటానికి సారంగధరుడు చిత్రాంగి మేడలోకి వెళ్లాడు. చిత్రాంగి సారంగధరుని చూచి

---

8. విమలాదిత్యునికి, కుందవాయికి పుట్టిన జేష్ఠపుత్రుడు రాజరాజనరేంద్రుడు. కుందవాయి చోళచక్రవర్తి రాజరాజచోడుని కూతురు, రాజేంద్రచోడుని చెల్లెలు. రాజరాజనరేంద్రునికి విజయాదిత్యుడను సవతి తమ్ముడు కలడు. వీరిద్దరి మధ్యా వారసత్వ పోరు వచ్చినపుడు కాంచిపురం నుంచి రాజేంద్రచోడుడు రాజమహేంద్రవరం వచ్చి తన మేనల్లుడైన రాజరాజనరేంద్రునికి 16,ఆగస్టు, 1022 న రాజ్యం కట్టబెట్టాడు. తనకూతురు అమ్మంగిని ఇచ్చి పెళ్ళిచేసి అల్లుడిని చేసుకొన్నాడు. రాజరాజ నరేంద్రుడు 1063 వరకు పరిపాలించాడు. ఇతను రాజధానిని వేంగి నుంచి రాజమహేంద్రవరానికి మార్చాడు. రాజ రాజ నరేంద్రుని కాలములో భారతమును నన్నయ తెనుగు చేయటం ప్రారంభమైనది. క్రీశ.1053 లో రాజరాజనరేంద్రుడు నందంపుండి (నేటి అమలాపురం వద్ద) అనే గ్రామాన్ని నన్ని నారాయణ కవిరాజశేఖరునికి దానం ఇచ్చినట్లు ఒక రాగిరేకు పత్రం లభిస్తున్నది. ఈ నన్ని నారాయణుడే నన్నయ అని చరిత్రకారుల అభిప్రాయం (Epigraphia Indica vol IV p.no 303).

నన్నయ భట్టుకు మతిభ్రమించటంతో భారత అనువాదం నిలిచిపోయింది. రాజరాజ నరేంద్రుడు అవసాన దశలలో చోళదేశములో ఉన్నాడు. చోళదేశానికి కాంచిపురము ముఖ్యపట్టణము. అది నెల్లూరుకు దగ్గరగా ఉండటంచే నెల్లూరులో ఉన్న తిక్కన సోమయాజిని మహాభారత తెనిగింపుకొరకు రాజరాజ నరేంద్రుడు కోరి ఉండవచ్చు (కవిజీవితములు,పేజి 68).

తన కోర్కె తీర్చుమని అడిగింది. దీనికి పాపభీతుడయిన సారంగధరుడు ఆమెను తప్పించుకొని ఆ మేడలోంచి బయటకు వచ్చేసాడు. ఆ తరువాత ఆ రాత్రి రాజరాజు వచ్చేవేళకు చిత్రాంగి తన శరీరమంతా చీరుకొని, ఏడుస్తూ సారంగ ధరుడు తన మేడలోకి వచ్చి తనను బలాత్కరించబోయాడని, మీకీ విషయము చెప్పి ప్రాణత్యాగము చేసుకొందామని ఇంకా బ్రతికి ఉన్నానని చెప్పింది. కొడుకుపై తీవ్రమైన ఆగ్రహం కలిగిన రాజు, ఆ మరునాడు నిండుసభలో “మాతృద్రోహము చేసిన వానికి శిక్ష ఏమిటని” సభికులను విచారించగా, వారు కాళ్ళు, చేతులు నరికించమని చెప్పారు. ఆ ప్రకారము సారగంధరుని శిక్షింపమని తలవర్లను ఆజ్ఞాపించాడు రాజు. తలవర్లు సారంగధరుని వెంటబెట్టుకొని, రాజమహేంద్ర వరమునకు సమీపంలో ఉన్న ఒక చిన్న మెట్ట వద్దకు తీసుకువెళ్లారు. వారు సారంగధరుని సుకుమార దేహాన్ని చూసి జాలిపడి “నిన్ను విడిచిపెడతాము, పట్టణానికి రాకుండా ఎక్కడికైనా పారిపొమ్ము” అనగా “మీరు రాజాజ్ఞ తప్పరాదు, ఇదంతా నా ప్రారబ్ధము మీ పని కానివ్వండి” అని బదులిచ్చాడట సారంగధరుడు. తలవర్లు సారంగధరుని కాళ్లు చేతులు నరికి వెనుతిరుగుతుండగా ఒక అశరీరవాణి సారంగధరుని ఉద్దేశించి “ఓయి! సారంగధరుడా! నీ పూర్వజన్మ ప్రారబ్ధము చిత్రాంగి ద్వారా నీకు తీరిపోయినది” అన్నదట. అదే సమయములో ఆ మార్గమున ఆకాశవీధిలో స్వేచ్ఛగా విహరిస్తున్న కొందరు సిద్ధులు సారంగధరుని చూసి, ఇతని పూర్వకర్మము నిశ్శేషమైనది అని తమ యోగబలముచే అతనికి కాళ్ళు చేతులు ప్రసాదించి తమతో పాటు తీసుకొని పోయిరట.

ఈ మొత్తం ఘటనలనన్నింటిని తలవరులు వచ్చి మహారాజుతో చెప్పారు. తొందరపడి సత్యవంతుడైన తన కుమారుడిని అనవసరంగా శిక్షించానే అని రాజు ఎంతో బాధపడ్డాడు. చిత్రాంగిని శిక్షించటానికి సభకు పిలువగా “తలవరులు విన్న అశరీరవాణి మాటలు ఈ సభలో మరలా పలికితే తప్ప తనను శిక్షించటానికి వీలులేదు” అని అన్నది. వెంటనే అశరీరవాణి ప్రత్యక్షమయి “సారంగధరునిలో ఏ దోషము లేదు, ఈ కృత్రిమము చేసినది చిత్రాంగియే! ఓయి రాజా! ఈ చిత్రాంగి దేహమును ఖండించి ఉప్పుపాతర వేయించుము” అనిచెప్పి అంతర్ధాన మయి పోయింది. అంతట అశరీరవాణి చెప్పిన ప్రకారము చిత్రాంగి దేహమును ఖండించి ఉప్పుపాతర బెట్టించినారు.

రాజరాజనరేంద్రుడు నలభై సంవత్సరములు పాలించాడు[9]. తరువాత రాజేంద్రచోళ మహారాజు వేంగి దేశమును పదిహేను సంవత్సరములు పాలన చేసాడు. తదనంతరము విక్రమచోళ మహారాజు అయిదు సంవత్సరములు రాజరికం చేసినాడు. ఆ తరువాత శ్రీ కులోత్తుంగ చోడమనుమడు గొంకరాజు కొమారుడు పృథివీశ్వర మహారాజు ముప్పయి అయిదు సంవత్సరములు రాజ్యము చేసినాడు. తరువాత చాళుక్యవంశ సంభవుడయిన మల్లదేవ చక్రవర్తి వేంగిదేశానికి అధిపతియయి పది సంవత్సరములు రాజరికం చేసినాడు. అటుపిమ్మట సూర్య వంశోద్భవుడయిన అన్నయదేవమహారాజు[10] రామవరపు దుర్గమందు పట్టం కట్టుకొని ముప్పయి సంవత్సరములు రాజరికము చేసినాడు. ఆ తరువాత ఆయన కుమారుడు అన్నయదేవభూపాలుడు రామవరము పట్టణములో పట్టాభిషిక్తుడయి భీమవోలు, సీమ గోదావరితీరము మొదలుకొని తూర్పు కొన పర్యంతము రాజరికం చేసినాడు. ఈయన ముప్పై సంవత్సరములు ప్రభుత్వం చేసినాడు.

తరువాత వేంగిదేశము రెడ్లవారి స్వాధీనమైనది. ఈ రెడ్లవారు రామా పురపు దుర్గం మీదనున్న అన్నయదేవభూపాలుని చంపివేసినారు. రెడ్డిరాజులయిన

---

9. రాజరాజ నరేంద్రుని తరువాత వేంగి రాజ్యము మరలా వారసత్వపోరులో పడి పోయినది. విజయాదిత్యుడు తన కొడుకు శక్తివర్మIIను వేంగిరాజుగా చేసాడు. చోళ చక్రవర్తి అయిన చోడరాజేంద్రుడు శక్తివర్మను సంహరించి రాజరాజ నరేంద్రుని కొడుకు రాజేంద్రుడికి వేంగి రాజ్యం అప్పగించి, తన కూతురు మధురాంతకిని ఇచ్చి పెళ్ళిచేసాడు. తంజావూరులో చోళ సామ్రాజ్య వారసులు హత్యచేయబడినపుడు ఈ రాజేంద్రుడు కుళోత్తుంగ I పేరుతో 1070 లో చోళ సామ్రాజ్యాన్ని అధిష్టించాడు. తన కొడుకు ముమ్మడి చోడుడినిని 1076 లో వేంగి రాజ్యానికి రాజుని చేసాడు. తరువాత మరోకొడుకు వీర చోడుడిని 1078లో ద్రాక్షారామంలో వేంగి రాజ్యాభిష్కక్తుడిని చేసాడు. ఇతను 1104 వరకు పాలించాడు. ఇతని వద్ద సైన్యాధ్యక్షునిగా గొంక I పనిచేసేవాడు.
   వీరచోడుని కాలంలో తమిళనాడునుంచి పెద్దసంఖ్యలో బ్రాహ్మణులు ఆంధ్రప్రాంతానికి వచ్చారు. ఇతను 536 అగ్రహారాలు దానం ఇచ్చాడు. వీరచోడుడు చెల్లూరు వైష్ణ వాలయానికి అనేక మాన్యాలు దానం ఇచ్చాడు. వీరచోడుని పాలన తరువాత చోళ చక్రవర్తి వేంగి రాజ్యాన్ని తనకు సహాయకులుగా ఉంటున్న సేనాధిపతులను తన ప్రతినిధులుగా ఉంటూ వేంగి రాజ్యాన్ని ఏలుకొమ్మని అప్పగించాడు. అలా గొంక II (1132–1161), రాజేంద్ర చోడ II (1161–1181), గొంక III (1181–86), పృధ్వీశ్వర (1186–1207) వేంగిరాజ్యాన్ని ఏలారు. పృధ్వీశ్వరుని కాలంలో వేంగి రాజ్యం కాకతీయుల పాలనలోకి వచ్చింది. ఆ విధంగా వేంగి–చోళ రాజ్యాల సంబంధం తెగి పోయింది.
10. ఇతను కాకతీయ గణపతిరుద్రునికి సామంతుగా ఉంటూ వేంగిని పాలించాడు.

ప్రోలయవేమారెడ్డి[11], అనవోతవేమారెడ్డి, ధర్మ వేమారెడ్డి, కోమటి వేమారెడ్డి, రాజ వేమారెడ్డి[12] వీరు వరుసగా నూరు సంవత్సరములు పాలన చేసారు.

తరువాత కటక సింహాసనాధీశ్వరులయిన వీరనరసింహ లాంగూల గజపతి కళింగమును, ఆంధ్రదేశమును కూడా ప్రభుత్వము చేసాడని చెపుతారు. తరువాత ప్రతాపరుద్ర గజపతి, శ్రీకాకుళం, రాజమహేంద్రవరం ఏలూరు, కొండపల్లి మొదలుకొని ఉదయగిరి వరకూ రాజరికం చేసాడు. ఈయనపేరు హంవీరగజపతి అని చెపుతారు. తరువాత ఈయనకొమారుడు ముకుందదేవ గజపతి రాజ మహేంద్రవరము ఏలూరు కొండపల్లి పర్యంతము సహరాజరికం చేస్తూ కటక పట్నములో సింహాసనస్థుడై ఉండెను. ముకుందదేవు గజపతి మేనల్లుళ్ళు రాజ విద్యాధరుడు, జూకాసిశ్చంద్రుడులు రాజమహేంద్రవరం సర్కారుకు నిఘావానీ (అధికారం) చేస్తూ ఉండేవారు.

**నిశ్శంకుల నాయనకు ఇచ్చిన దానపత్రం**

ఇంతకు పూర్వము శ్రీమన్మణిమతాకురువరప్రసాద శ్రీ వీరకపిలేశ్వర గజపతి దేవుమహరాజులుంగారు కటకసింహాసనస్థులు అయి పృధ్విరాజ్యమునేలు

---

11. ప్రోలయవేమారెడ్డి కొండవీటి రెడ్లవంశానికి చెందినవాడు (1325–1353). అద్దంకి ఇతని రాజధాని. ఇతను శైవ వైష్ణవమతాలను సమాదరించాడు. కవిత్రయంలో చివరి వాడైన ఎర్రాప్రగడ హరివంశాన్ని తెలుగులోకి అనువదించి వేమారెడ్డికి అంకిత మిచ్చాడు. ముస్లిం దాడులలో కాకతీయసామ్రాజ్యం పతనమయ్యాకా ఆంధ్రప్రాంతంలో నెలకొని ఉన్న రాజకీయ సామాజిక పరిస్థితులకు అద్దంపడుతూ, ఆంధ్రదేశచరిత్రలో అత్యంత విలువైనదిగా భావించే విలస తామ్రశాసనం ప్రోలయ నాయుడు వేయించినదే. ఈ శాసనంలో– మహమ్మద్ బిన్ తుగ్లక్ దక్కనుపై చేసిన దండయాత్ర; 1323లో ప్రతాప రుద్రుని ఓటమి; సారాయితాగుతూ, పశుమాంసం తింటూ ఈ ప్రాంతంలో ముస్లిం పాలకులు ఆలయ విగ్రహాలను ధ్వంసం చేసి, బ్రాహ్మణులను, ధనవంతులను, సామాన్యులను చిత్రహింసలు పెట్టి వారి సంపదలను దోచుకొని వారిస్త్రీలను అపహరించటం– లాంటి ఆనాటి సమాజం ఎదుర్కొన్న ముస్లిందాడుల బీభత్స పరిస్థితులను కళ్ళకు కడుతుంది. అలాంటి పరిస్థితులలో ప్రోలయనాయకుడు రాజ్యాధికారం చేపట్టి సమాజంలో శాంతిభద్రతలను నెలకొల్పి హిందూధర్మాన్ని తిరిగి నెలకొల్పినట్లు చెప్పబడింది. ఈ శాసనంలో. (Epigraphia Indica vol no - 32)
12. కొండవీటిరెడ్డి రాజులలో చివరివాడు రాచవేమారెడ్డి (1420–1424). రాచవేమారెడ్డి పాలన జనరంజకముగా లేదు. ఇతను విధించిన పురిటి సుంకాన్ని చెల్లించటానికి నిరాకరించిన ఎల్లయ్య అనే బలిజనాయకుడు రాచవేమారెడ్డిని వీధిలో కత్తితో వధించాడని కొండవీటి కైఫియ్యతు ద్వారా తెలుస్తున్నది. దీనితో కొండవీటి రెడ్డిరాజ్యం అంతమైంది. ఆంధ్ర ప్రాంతంలో విజయనగర పాలన మొదలైంది.

చున్నప్పుడు, దేవువారి సన్నిధిలో చాన్నాళ్లుగా ఆశ్రయించుకొని ఉన్నటువంటి నిశ్శంకుల నాయన అనే బ్రాహ్మణునిపై ప్రభువువారికి అపరిమితమైన అనుగ్రహము వచ్చి "ఏమికావాలో కోరుకొమ్మని"అడుగగా ఆ బ్రాహ్మణుడు "రాజమహేంద్రవరము సర్కారు క్రింద ఇరవైఒక్క స్తలములకు కరణీకము ఇప్పించవలసినది" అని ప్రార్థించుకొన్నాడు. ఆ విధంగా కటకసింహాసన రాజ్యాధి గజపతి, శ్రీ మహమ్మేరు సార్వభౌమ మహంతి పండిత నిశ్శంకులనాయనకు ఇచ్చిన రాజమహేంద్ర స్థలాలు వరుసగా పొల్నాడు, బోడసకుర్రు, పొన్నాడ, సందిపూడి, కుమ్మూరు, బిక్కవోలు, ఈతకోట, కోఋకొండ, అరట్లకట్ట, సర్వసిద్ధి, చోడవరం, వింజరం, మురుమళ్ల, కాకినాడ, శలపాక, తాటిపాక, కోట, వాగుల్నాడు, మొల్లేరు, రాజపూడి, రాయవరము మొదలగునవి.

పైన చెప్పిన ఇరవై ఒక్క స్థలాల కరణీకం పుత్రపౌత్ర పర్యంతం అనుభవిస్తూ ఉండమని, వాటి ఆదాయంలో నూటికి ఒక వరహాచొప్పున, పుట్టికి తూమెడు భూమిచొప్పున (సుమారు ఇరవైభాగములలో ఒక భాగము) అనుభవిస్తూ, అధికారముచేస్తూ ఉండేందుకు రాయించిన ఒక శాశ్వత దానపత్రాన్ని ఒక వెండి పెట్టెలో ఉంచి గజపతిదేవు మహారాజు గారు నిశ్శంకుల నాయనకు అందచేసారు.

ఈ నిశ్శంకుల నాయన రాజమహేంద్రవరములో నివాసముంటూ ఆ గ్రామ కరణీకములను అనుభవిస్తూ ఉండేవారు. ఈయన గతించిన తరువాత అతని తమ్ముడు అప్పలయ్య ఆ గ్రామముల కరణీకపు హక్కులకు వారసుడయ్యాడు. ఇతను నండూరి తిమ్మరాజు, తోలేటి వీరరాజు, వడ్డావు మారుకొండరాజు అనే ముగ్గురిని గుమాస్తాలుగా ఉంచుకొని లెక్కలు రాయించుకొనేవాడు. ఈ ముగ్గురిలో పెద్దవాడయిన నండూరి తిమ్మరాజుకు 'మహాపాత్రుడు' అనే పెద్దగుమాస్తా పదవిని ఇచ్చి గొప్పచేసినాడు.

కొన్నాళ్లు గడిచాకా కాటంపల్లి వారి కోడలు, భర్తగతించాకా రాజ మహేంద్రవరములోని తన పుట్టింటికి వచ్చినది. ఆమె తన కుమారుడు కాటంపల్లి వీరయ్యకు విద్యాబుద్ధులు నేర్పమని నిశ్శంకుల వారింట ఉంచినది. ఆ పిల్లవాడు తెలుగు, తమిళ, సంస్కృత, పారశీక భాషలలో అనతికాలంలోనే ప్రావీణ్యం గడించాడు. ఈ కుర్రవాడు రాజమహేంద్రవరం నిఘావానీ చేస్తున్న శిరిశ్చంద్ర ప్రభువు వద్ద కనిపెట్టుకొని ఉంటూ ఉండేవాడు. ఒకనాడు గజపతివారి వద్దనుంచి శిరశ్చంద్రుడికి సంస్కృతములో వ్రాసిన ఉత్తరములు వచ్చాయి. అదేసమయములో

అక్కడ ఉన్న కాటంపల్లి వీరయ్య వాటిని చదివి, ప్రభువు అనుమతితో తిరుగు జవాబులు వ్రాసాడు. ఆ చిన్నవాని ప్రతిభను శిరిశ్చంద్ర ప్రభువు మెచ్చుకొని అతనికి పద్దెనిమిది గ్రామముల కరణీకపు హక్కులను బహుమతిగా ఇచ్చాడు. వాటిలో నిశ్శంకులవారికి ఇవ్వబడిన గ్రామాలు కూడా ఉండుటచేత– ముందు చెప్పిన ముగ్గురు గుమాస్తాలు నిశ్శంకుల వంశస్థులను వదిలేసి, వారిని లెక్కచేయక కాటంపల్లి వీరయ్యతో జతకలిసారు. నిశ్శంకుల వారిని అణచివేసి తామే మొత్తం మిరాసీకి దఖలు దార్లు అయినట్లు శిరిశ్చంద్ర ప్రభువు వద్ద పాతుకొనిపోయారు. అలా గజపతి దేవుమహరాజు నిశ్శంకుల వారికి ఇచ్చిన కరణీకపు హక్కులను పోగొట్టుకొన్నారు.

**సీతాఫిఖానుడి వృత్తాంతం**

రాజమహేంద్రపు సర్కారు లోని బిక్కవోలు పరగణాలో మయివెట్లపాలెపు కాపురస్తుడయిన అవసరాల పెద్దిరాజు అనే ఒక బ్రాహ్మణుని ఇంటియొద్ద సీతడు అనే ఒక శూద్రదాని కొడుకు దూడలు కాస్తూ ఉండేవాడు. సీతడికి మధ్యాహ్న భోజనం పెద్దిరాజే స్వయంగా తీసుకొని వెళ్ళేవాడు. ఒకనాడు అలా పెద్దిరాజు అన్నము పట్టుకొని వెళ్ళినపుడు– సీతడు ఒక తాడిచెట్టునీడను పడుకొని ఉండగా ఒక పెద్ద సర్పము తన పడగను విప్పి అతనిపై ఎండ పడకుండా గొడుగుపట్టటం చూసాడు. పెద్దిరాజు చాలా ఆశ్చర్యపడి, వీడు ఏనాటికైనా గొప్ప అదృష్టవంతుడు అవుతాడు అని ఊహించి "ఒరేయ్ సీతా నీకు అదృష్టమువస్తే నాకు ఏమి ఇస్తావని" అడిగాడు. అందుకు వాడు "నాకు అదృష్టము పడితే వచ్చే అధికారము నాది, ఐశ్వర్యము నీది" అన్నాడు. ఆ ప్రకారం వాడితో ప్రమాణము చేయించుకొని, ఆ రోజు మొదలు సీతడితో దూడలు కాయించటం మాని వానికి విద్యలు చెప్పించటం మొదలెట్టాడు పెద్దిరాజు. అన్ని విద్యలు నేర్చుకొన్న సీతడు ఒకనాడు పెద్దిరాజు వద్దకు వచ్చి, అయ్యా నాకు అనుమతి ఇస్తే సర్కారు నౌకరీకి వెళతాను అని అడుగగా పదిరూపాయిలు ఖర్చుకు ఇచ్చి పంపించాడు.

అలా బయలుదేరిన సీతడు ఓరుగల్లు వెళ్ళి సైన్యంలో చేరి, చురుకుగా పనిచేస్తూ ప్రభువు ఆదరణకు పాత్రుడైనాడు. నాలుగువేలమంది సైనికులకు సీతడిని నాయకుడిగా చేసాడు ప్రభువు. సీతడు సీతాఫిఖానుడు అనే బిరుదు పొందాడు. ఈ ప్రకారం కొన్నాళ్లు జరుగుతూ ఉండగా ఓరుగల్లుని తురకలు ఆక్రమించుకొన్నారు కనుక సీతాఫిఖానుడు ఓరుగల్లు విడిచి కటకం చేరాడు.

అక్కడ గజపతి ముకుందదేవు, సీతాఫిఖానుడికి అతని వెంట వచ్చిన కొంతమంది సైనికులకు ఉద్యోగాలు ఇచ్చాడు. ఇక్కడకూడా సీతాఫిఖానుడు ముకుందదేవుని అభిమానానికి పాత్రుడైనాడు. రాజమండ్రిని సంరక్షిస్తున్న శిరశ్చంద్రుడిని ముకుందదేవుడు కటకానికి పిలిపించి రాజమహేంద్రవరం నిఘావానీ బాధ్యతలను సీతాఫిఖానుడికి అప్పగించి, అతని వెంట నాలుగైదు వేలమంది సైనికులను ఇచ్చి పంపించాడు.

సీతాఫిఖానుడు రాజమహేంద్రవరము వచ్చి, అంతవరకూ చాళుక్యవంశపు రాజులకు అధికార కేంద్రముగా ఉన్న హ్యామగిరిని కాకుండా రాజమహేంద్రవరం పట్టణానికి ఉత్తరం వైపు ఉన్న నేలకోటను కేంద్రంగా చేసుకొని పరిపాలించటం మొదలెట్టాడు. ఎప్పుడో ఇచ్చినమాటకు మరువకుండా అవసరాల పెద్దిరాజును పిలిపించి అతనికి దివానుగిరి ఇచ్చాడు.

తరువాత సీతాఫిఖానుడికి నాగమ్మ అను ఒక కుమార్తె కలిగినది. ఆ చిన్నది యుక్తవయసుకు వచ్చింది. పెద్దిరాజు అందగాడు. అతను అంతఃపురములోకి స్వేచ్ఛగా వస్తూ పోతూ ఉండటంచే ఆ చిన్నది పెద్దిరాజుపై మోజుపడి తనవద్దకు రమ్మనమని కబురుపంపింది. అది విన్న పెద్దిరాజు "నేను నీకు తండ్రి సమానుడను, ఇలాంటి తలంపు నీవు తలచరాదు" అని నాగమ్మకు హితబోధ చేసాడు. దీనికి ఆ చిన్నదానికి చాలా కోపం వచ్చి పెద్దిరాజే తనను రమ్మన్నట్లుగా సీతాఫిఖానుడితో చెప్పింది. ఇది విన్న సీతాఫిఖానుడికి పెద్దిరాజుపై కోపం వచ్చి, కచేరీకి పిలిపించి అతని రెండు నేత్రములను పెరికించాడు. ఉక్రోషము పట్టలేని పెద్దిరాజు సీతాఫిఖానుడిని ఎలాగైనా దెబ్బతీయాలనే ఉద్దేశంతో, ఆ మరునాడే పల్లకిలో ప్రయాణమై గోల్కొండకు వెళ్ళి అక్కడ యిభరాం పాదుషా[13] వద్ద అధికారిగా ఉన్న జూపల్లె సామంతరావుద్వారా పాదుషాను కలసి గజపతి రాజ్యం యావత్తు ఆక్రమించుకోవటానికి ఇదే సరైన సమయం అని ఆయనను ఒప్పించగలిగాడు. అంతేకాక రాజమహేంద్రవరం కోటను స్వాధీనపరచుకొన్న ఒక ఝాము సమయంలోగా (మూడుగంటలు) ఆ విషయాన్ని మీకు తెలియ చేస్తాను, నన్ను నమ్మండి అని చెప్పాడు పెద్దిరాజు. అప్పటికే అవకాశం కొరకు ఎదురుచూస్తున్న యిభరామ్ పాదుషా తన సైన్యాన్ని గజపతివారి ఆధీనములో ఉన్న రాజమహేంద్రవరాన్ని ముట్టడించటానికి సిద్ధమైనాడు.

13. మల్కిభరాముడు అని పేరుతో పిలువబడే ఇబ్రహిమ్ కుతుబ్‌షా

మల్కినేబు (మాలిక్ నైబ్), అమల్దార్ తోప్ ఖాన్, సయ్యదు బడెఖాన్, సలాబతుఖాన్, సయ్యదు మీరా, మహమ్మదు ఖాన్ ఇంకా జూపల్లె సామంతరావు, కతారి వీరమరావు, ముత్యాల యల్లప్పాళ్వారావు, సెట్టిపల్లె భల్లేరావు, మెదర్లమెట్ట గోపాలనేడు, బల్లమ చిన్నారావు, వెల్లంకి రామారావు లాంటి సైన్యాధిపతులతో, పదకొండువేల అశ్వదళం, ఎనభైవేల సైనికులతో కూడిన సైన్యం రాజమహేంద్ర వరాన్ని ఆక్రమించుకోవటానికి గోల్కొండనుంచి బయలుదేరింది.

ఈ సైన్యం నార్కిడపల్లె వద్ద ఏరుదాటి ఈతకోటను జయించి తాతపూడి రేవు దాటి నల్లూరు మడుగువద్ద బసచేసినపుడు- నల్లూరిలో ఉండే చౌదరి గంధము తిమ్మయమహాపాత్రుడు కొన్ని గుర్రాలను అవసరమైన సరుకులను సమర్పించుకొన్నాడు.

సైన్యం నల్లూరు దాటి వెళిపోయాకా ఈ తిమ్మయమహాపాత్రుడు గోల్కొండ నుండి సైన్యం వస్తూందన్న విషయాన్ని సీతాఫిఖానుడికి ఉత్తరం వ్రాసి ఒక నౌకరుకిచ్చి రాజమహేంద్రవరం పంపించాడు. ద్రాక్షారామ పట్టణాన్ని సైన్యం ముట్టడి చేసిన సమయంలో ఆ నౌకరు గోల్కొండ సైన్యానికి దొరికి పోవటంతో తిమ్మయ మహాపాత్రుడు సీతాఫిఖానుడిని అప్రమత్తంగా ఉండమని వ్రాసిన రహస్య ఉత్తరం బయటపడిపోయింది. దీనికి మహమ్మద్‌ఖాన్ కోపించి గంధం తిమ్మయ్య మహాపాత్రుణ్ణి పట్టి తెప్పించి, ఇలాంటి కుట్రలు పన్నవచ్చునా అంటూ ద్రాక్షా రామములో దక్షగుండం చెరువు తూర్పుగట్టుమీద అతని తలనరికించాడు. ఆ తరువాత మల్కినేబు యెల్లోపంతులికి (ముత్యాల యల్లప్పాళ్వారావు కావొచ్చు) కొంతసైన్యాన్ని తోడిచ్చి, రాజమహేంద్ర కోటను ముట్టడించమని పంపించి తాను హ్యామగిరి కోటను కైవసం చేసుకొన్నాడు. క్రీశ. 1572, అంగీరసనామ సంవత్సరం ఆషాఢశుద్ధ గురువారం రోజున మల్కినేబు రాజమహేంద్రవరం కోటను ఆక్రమించుకొన్నాడు. సీతాఫిఖానుడు కోటవదిలి పారిపోయాడు.

అవసరాల పెద్దిరాజు గోల్కొండ మొదలు రాజమహేంద్రవరం వరకూ, ప్రతి నాలుగు మైళ్లకు ఒక నగారాను (పెద్ద ఢంకా) అంచెలంచెలుగా ఏర్పాటు చేసాడు. రాజమహేంద్రవరం కోట వశం అయిందన్న సమాచారాన్ని ఆ నగారా శబ్దాల ద్వారా అంచెలంచెలుగా ఒక ఝాము సమయంలో గోల్కొండకు చేరేలా చేసాడు. అలా అవసరాల పెద్దిరాజు సీతాఫిఖానుడిపై తన పగతీర్చుకోవటమే కాక ఒక ఝాము సమయములో విజయవార్తను మీకు తెలియచేస్తాను అని పాదుషాకు ఇచ్చిన మాటను నిలబెట్టుకొన్నాడు.

రాజమహేంద్రవరం నుంచి పారిపోయి తోటపిల్లి అడవిలో దాక్కొన్న సీతాఫిఖానుడిని తురకసైన్యం పట్టుకొని తలనరికి చంపేసారు.

అప్పుడు కవీశ్వరులు చెప్పిన పద్యము

లలితంపు గౌతమిలవణవారధిగాగ, నాయోమగిరి సువేలాద్రిగాగ
మహుడు పెద్దనమంత్రి మహివిభీషణుగాగ, మల్కినేయబు హనుమంతుగాగ
బాహు బలేంద్రుండు భల్లూకపతిగాగ, కరకు తురకలు ప్లవంగములుగాగ
రాజమహేంద్రమే లంకాపురముగాగ, రమణతో నిభరాముఁరాముగాగ
కనలియహితుని సీతాఫిఖానువెడల దోలియాంగీరయినందునుద్ధురతజూపి
సరవినాషాఢ శుద్ధపంచమి మొదలుగ, రాజ్యమేలెను ఇభరామరామశౌరి.

గోదావరిని సముద్రంతో, వేమగిరిని సువేలాద్రితో, అవసరాల పెద్దిరాజును విభీషణునితో, మల్కినేబును హనుమంతునితో, బాహుబలిని జాంబవంతునితో, ముస్లిం సైన్యాన్ని రామదండుతో, రాజమండ్రిని లంకతో, సితాఫిఖానుని రావణునితో ఇబ్రహిమ్ కుతుబ్‌షాను రామునితో పోల్చుతూ సీతాఫిఖానుడి వృత్తాంతాన్ని రామాయణంతో చక్కని సామ్యం చూపాడీ బ్రతకనేర్చిన అనామక కవి.

మల్కినేబు రాజమహేంద్రవరాన్ని జయించి కళింగ వరకూ జయస్తంభాలు వేయించి చిలుకా సరస్సు వరకూ హద్దులు నిర్ణయించి, కళింగదేశాన్ని కూడా పాలించటం మొదలెట్టాడు.

అప్పటికి మునుపు చెప్పిన నిశ్శంకుల నాయినకు సంబంధించిన వృత్తాంతంలో చెప్పిన ముగ్గురు గుమాస్తాల వారసులు ఈ ప్రాంతపు కరణీకాలు చేస్తూ ఉన్నారు. వారు నందూరి కృష్ణమరాజు, తోలేటి మార్కొండరాజు, వడ్డావు అయ్యపరాజు, అయ్యపటానేని మార్కొంద్రాజు (ఇతను కాటంపల్లి వీరయ్య సంతతి కావొచ్చు). వీరంతా గోల్కొండ వెళ్ళి పాదుషా గారిని దర్శనం చేసుకొని, పూర్వపు రాజులు ఇచ్చిన దాన పట్టాలు చూపించి, తమ కరణీకపు హక్కులను నిలుపమని వేడుకొన్నారు. అవన్నీ పరిశీలించిన పాదుషా, ఈ నలుగురికీ వారి వారి కరణీకములను యధావిధిగా కొనసాగించమని మల్కినేబుకు ఒక పరమాన (రాజాజ్ఞ) ఇచ్చాడు. ఆ పరమానాను తీసుకొని రాజమహేంద్రవరంలో ఉన్న మల్కినేబుకు చూపించి ఆ నలుగురు ఈ ప్రాంతముల కరణీకముల హక్కులను తిరిగి పొందారు.

ఉమ్మడిగా ఉంటే గొడవలు రావొచ్చుననే ఉద్దేశంతో వారు తమకు ఇవ్వబడిన హక్కులను వివిధ ప్రాంతాలకు చెందిన – పిఠాపురం దుర్యోధను గద్దాపాత్రుడు, ద్రాక్షారామం పాపలింగాపాత్రుడు, కోటస్థలము నరుకుల రాజపాత్రుడు, ఈతకోట అక్కిరెడ్డి లింగారెడ్డి, బోడసకుర్రు కర్నె మార్కొండా పాత్రుడు, కాకినాడ సబ్బినేని గుండాపాత్రుడు, రాజమహేంద్రవరము కసుబాహ వేలిపాకల భగవానుపాత్రుడు, గౌడిదాసరి శలపాక అర్జునపాత్రుడు, బిక్కవోలు వేంద్రభద్రిరాజు లాంటి పెద్దల సమక్షంలో ఈ క్రిందివిధంగా పంచుకొన్నారు.

అయ్యపటానేని మార్కొంద్రాజు – పొల్నాడు, బొత్సకుర్రు, పొన్నాడ, నంది పూడి కోఠాము, కిమ్మూరులో కొంతభాగము

వడ్డావు అయ్యపరాజు – కోట, చాగల్నాడు, మొల్లేరు రాజపూడి, సర్వసిద్ధి రాయవరం, తాటిపాకలో కొంత భాగము

తోలేటి మార్కొంద్రాజు – బిక్కవోలు, ఈతకోట, కొక్కొండ, అరట్లకట్ట

నందూరి కృష్ణంరాజు – చోడవరము, వింజరం, కాకినాడ శలపాక, కిమ్మూరులో వాటా, తాటిపాకలో వాటా

పై నలుగురూ ఆ ప్రకారము పెద్దల సమక్షములో సమాఖ్య సనదులు (దస్తావేజులు) వ్రాసుకొని ఈ ప్రాంత కరణీకములు కొనసాగించారు.



రాజమహేంద్రవరపు సర్కారు మల్కినేబు సలష్కరు (సేనానాయకుడు) గారు బందోబస్తు చేసి ఖాయపరచిన[14] తరువాత సర్కారు అమళ్ళు (ఏలుబడి) చేసిన వారి వివరములు.

---

14. సీతాఫిఖానుడి హతంతో సర్కారు జిల్లాలు గోల్కొండనవాబుల పాలనలోకి వెళ్ళాయి. గోల్కొండనవాబులకు సామంతులుగాఉంటూ వేంగి రాజ్యాన్ని క్రీశ. 1573 నుండి 1767 వరకూ ఏలుబడిచేసిన సుమారు అరవైమంది అమలుదారుల వివరాలు ఆనాటి సమాజపు సామాజిక స్తరీకరణను (Stratification) అర్థంచేసుకోవటానికి సహాయపడతాయి.

    కైఫియ్యత్తులలో వచ్చే వివిధ తెలుగు సంవత్సరాలను తెలుగు సంవత్సరనామ ఆధారంగా South Indian Chronological Tables by W.S Krishna svami Naidu, Edited by Robert Sewell, 1889 సహాయముతో క్రీస్తుశక సంవత్సరాలుగా మార్చుట జరిగింది ఈ పుస్తకంలోని అన్నిచోట్లా.

1. యల్లోముత్తు తరపుదారైన అంతో తిమ్మరుసు గారు - రాజమహేంద్రి అమలుదారుగా శ్రీముఖ సంవత్సరం లగాయతి ప్రమాది వరకు (క్రీశ 1573-1579) వరకు ఏలుబడి చేసారు.
2. యల్లప్పా అశ్వారావు- అమలుదారుగా వికృతినామ సంవత్సరం వరకు పదకొండు సంవత్సరములు ఏలుబడి చేసారు (క్రీశ 1580-1590)
3. అంతట జూపల్లె ధర్మారావు అమలుదారు ప్లవంగనామ సంవత్సరం వరకు పదిహేడు సంవత్సరములు ఏలుబడి చేసారు. (క్రీశ.1580-1607)
4. పిమ్మట బింగూరి మల్లప్ప అమలుదారు పింగళనామ సంవత్సర వరకు పది సంవత్సరములు ఏలుబడి చేసారు (క్రీశ 1608-1617)
5. తిరుగా అచ్చుతరాయ తరపుదారు పీలుకానా కోనప్ప ఏలుబడి క్షయనామ సంవత్సరం వరకూ తొమ్మిది సంవత్సరములు సాగింది (క్రీశ 1618-1626)
6. శరీభు మల్కీ తరపుదారులు గజ్జరపు కోనప్ప, బీరకాయల కోనప్ప, చిక్కుడు గాయల కోనప్పల అమలు విభవనామ సంవత్సరం వరకు రెండేళ్ళు జరిగింది (క్రీశ 1627-1628)
7. ఆ వెనుక మీర్ యిసుమాయాలు ఏలుబడి ఒక ఏడాది శుక్ల సంవత్సరం పరియంతమున్నూ జరిగింది క్రీశ 1629)
8. ఆ తరువాత కాజె మహంతదు ఏలుబడి మరియొక సంవత్సరం ప్రమోదూత సంవత్సరం వరకూ సాగింది (క్రీశ. 1630)
9. అనంతరం పాదుషా సులతాను కుదుపుల మల్కి, జూపల్లి ధర్మాజిల తరపున కోనప్ప ఏలుబడి నాలుగేండ్లు భావసంవత్సరం వరకూ జరిగింది. (క్రీశ 1630-1634)
10. అనంతరం హుసేను షహ గారు, బీరకాయల కోనప్ప వాటాలు నిర్ణయించుకొని భూములు కొలిపించి దుర్ముఖి పరియంతము ఇరవైరెండేళ్ళు అమలు జరిపించారు. (క్రీశ. 1635 -1656)
11. జిబిలిగె నరసప్ప చిక్కుడుకాయల కోనప్ప ఏలుబడి హేవళంబి సంవత్సరంలో నడిచింది. (క్రీశ 1657)
12. అంతట మహమ్మదు తరపున చిక్కుడుగాయల కోనప్ప వికారి సంవత్సరం పర్యంతం రెండేళ్ళు ఏలుబడి చేసారు. (క్రీశ.1658-1659)

13. షేరుమహమ్మదు ఖాన్, మొసలకండి నారాయణప్ప, గుండాల సింహాద్రి పంతులు సౌమ్యనామ సంవత్సరం వరకూ పదేళ్ళు. (క్రీశ.1660–1669)
14. మహమ్మదు బేగు తరపుదారులు అంగర కృష్ణోరామర్సు, జిల్లేళ్ళ కన్నప్పల ఏలుబడి నలనామవత్సరం వరకూ ఏడేళ్ళు నడిచింది. (క్రీశ.1670–1676)
15. రాజా తానీషా అబుల్ హస్సను, అంగర కృష్ణారామర్సుల మజుందారీ రౌద్రనామ సంవత్సరం వరకూ నాలుగేళ్ళు జరిగింది. (క్రీశ.1677–1680)
16. హుస్సెను బేగురు రుధిరోద్గారి వరకూ (క్రీశ.1681–1683)
17. పసుపునూరి వెంకటపతి క్రోధన సంవత్సరం వరకు (క్రీశ.1684–1685)
16. రాజాఅవరంగజాన్ నరసమత్ శుక్లవత్సర పర్యంతము (క్రీశ.1686–1689)
17. హుసేను బేగు, అల్లీమదానుఖానుడు ప్రజాపతి సంవత్సరం పరియంతము (క్రీశ.1690–1691)
18. ముస్తుఫాకొల్లిఖానుడు ధాతు సంవత్సరం వరకూ (క్రీశ.1692–1696)
19. రుస్తుందీలుఖానుడు యీశ్వర సంవత్సరం ఏలుబడి (క్రీశ.1697)
20. పకీరుల్లాఖానుడు బహుధాన్యనామసంవత్సరం పర్యంతము (క్రీశ. 1698)
21. మోహద్దిఖానుడు విషునామ సంవత్సరం వరకూ (క్రీశ.1699–1701)
22. రుస్తుందీలుఖానుడు స్వభాను సంవత్సరం పర్యంతం (క్రీశ.1702–1703)
23. మీర్ కాయీం వ్యయనామ సంవత్సరం వరకూ (క్రీశ.1704–1706)
24. మీర్ హుస్సన్ సర్వజితు సంవత్సరం (క్రీశ.1707). తరువాత జీవన మల్లుడు ఆరునెలలు.
25. మహమ్మద్ యూరు సర్వధారి పర్యంతం (క్రీశ.1708)
26. అబీదు ఖానుడు ఖరసంవత్సరం వరకూ (క్రీశ.1709–1711)
27. జాబీదు బేగుఖానుడు మన్మధ సంవత్సరం పర్యంతం (క్రీశ.1712–1715)
28. రాజాషహమ్మతు ఖాను, వుర్పుముబారఖు ఖానుడులు శుభకృతు వరకు (క్రీశ.1716–1723)
29. అరబ్బేగు ఖాను, మహమ్మదు సైదుఖానుడులు విశ్వావసు పర్యంతం (క్రీశ. 1724–1725)
30. ఫైజుల్లాబేగు ఖాను ప్లవంగనామ సంవత్సరం వరకు (క్రీశ.1726–1727)
31. ఖాజే బాదుల్లా ఖాన్ సౌమ్య సంవత్సరం వరకు (క్రీశ.1728–1729)

32. సయిదులష్కరుఖానుడు సాదారణ సంవత్సర పర్యంతం (క్రీశ. 1730)
33. హజీహుస్సేను, రుస్తుముఅల్లిఖాన్ నలవత్సరం వరకు (క్రీశ. 1731–1736)
34. అనవర్ధ ఖానుడు రౌద్రి సంవత్సరము వరకు (క్రీశ. 1737–1740)
35. అల్లాకొల్లి ఖానుడు రక్తాక్షి సంవత్సరము పర్యంతము (క్రీశ. 1741–1744)
36. ఉమ్మరు ఖొల్లీఖానుడు క్షయసంవత్సరం పర్యంతమున్ను (క్రీశ. 1745–1746)
38. ఖాజీఖలీలు శుక్ల సంవత్సరము పర్యంతము ఏలుబడి (క్రీశ. 1747–1749)
40. స్నేమతుల్లా ఖానుడు ప్రజాపతి సంవత్సరము వరకు (క్రీశ. 1750–1751)
41. జాఫరల్లీ ఖానుడు అంగీరస నుండి శ్రీముఖపర్యంతము (క్రీశ. 1751–1753)
42. శ్రీపూసపాటి విజయరామరాజు మహారాజులుంగారు యువనామ సంవత్సరం వరకూ ఏలుబడి (క్రీశ. 1754–1755)
43. మూసా భూంశి (Monsieur Bussey) పరాసులు ఈశ్వరనామ సంవత్సరం వరకూ ఏలుబడి చేసారు (క్రీశ. 1756–1757).

ఈ మూసా భూంశి, మూసా కొప్పి (Monsieur Goupil) మొదలయిన వారు పూసపాటి పెదవిజయ రామరాజు గారితో కూడ బొబ్బిలి మీద లడాయికి వెళ్లి విజయరామరాజు గారిని అక్కడ బొబ్బిలిలో బొబ్బిలి రంగారావు బావమరిది తాంద్రపాపయ్య గారు పొడిచివేసిన తరువాతను భూంశి ఎకాఎకిని గోలకొండకు లేచిపోయిన తరువాత బహుధాన్యనామ సంవత్సరం దేశం అరాచకముగా ఉండినది.

44. ఆ తరువాత పూసపాటి విజయరామరాజు అన్నకుమారుడు ఆనందగజపతి ప్రభుత్వము చేసి కళింగమాన్యాలు అన్ని సాధించి అదిగాక రాజమహేంద్ర వరము బందరు పరియంతము సాధించి రాజమహేంద్రవరములో ప్రవేశించి యుండి అక్కడ దేహము చాలించినారు. (క్రీశ 1760)
45. నావాబు హసనల్లీఖాన్ నాయబు సుల్తాను నవాబు తారణనామ సంవత్సరం వరకూ ఏలుబడి చేసాడు. (క్రీశ 1764)
46. తరువాత సాహుకారు దామోదరదాసు వత్సవాయి రాఘవరాజు అనుమతి చేత రాజమహేంద్రవరం, ఏలూరు సర్కార్లు రెండున్ను అలీమీర్ నిజామల్లీఖాన్ బహుదరు ఏలుబడి చేసాడు. రాజమహేంద్రవరం హవేలీ

వగయిరాకు బడెజమాలుఖాన్ అములు చేస్తూ ఉండేవాడు. ఇలా పార్థివనామ సంవత్సరం వరకూ జరిగినది. (క్రీశ. 1765)

47. ఆ పిమ్మట రాఘవరాజు పితూరిచేత పూసపాటి సీతారామరాజు[15] సైన్యం వచ్చి బడెజమాలుఖాన్‌ను చంపివేసి, రాజమహేంద్రవరం సర్కారును స్వాధీనము చేసుకొన్నది. సీతారామరాజు వ్యయ, సర్వజిత్ సంవత్సరములు ఏలుబడి చేసారు. (క్రీశ. 1766-1767)

48. అంతట దేశము కుంపిణివారికి స్వాధీనము అయినది. జోగిపంతులు, హసనల్లీఖానుడు సర్కారు యిజారాచేసి ఏలుబడి చేయుచున్నారు.



15. రాజమండ్రిని ముట్టడించి కైవసం చేసుకొన్న చివర వ్యక్తిగా పూసపాటి సీతారామ రాజు పేరు చరిత్రలో నిలిచిపోయింది. ఇతను జమాలుఖామన్‌ను చంపి కొంత కాలం ఈ ప్రాంతాన్ని ఏలుబడి చేసాడు.

1765 లో రాబర్ట్ క్లైవ్, మొఘల్ చక్రవర్తి షాఆలం తో చేసుకొన్న ఒడంబడికను గౌరవించి, ఈ ప్రాంతాలను ఏటా ఐదులక్షల రూపాయిల శిస్తు కట్టే ఒప్పందంపై 1, మార్చ్ 1768 న నిజాం రాజు ఈస్ట్ ఇండియా కంపనీకి ఇచ్చాడు.

1823లో ఈస్ట్ ఇండియా కంపనీ ఈ ప్రాంతాలను మూడవ నిజాం రాజు నుండి కోటి అరవై ఆరు లక్షల రూపాయలు చెల్లించి కొనుక్కోవటంతో కోస్తా ఆంధ్రా మొత్తం మద్రాసు ప్రెసిడెన్సీలో కలిసిపోయింది.

1940లో నిజాం ప్రభుత్వం తిరిగి ఈ కోస్తా, రాయలసీమ ప్రాంతాలను నలభై మిలియన్ పౌండ్లకు కొనుక్కొంటాను అని బ్రిటిష్ వారితో చర్చలు జరిపింది. బ్రిటిష్ ప్రభుత్వం అంగీకారం తెలిపింది. నిజాం రాజు తరపున Bahadur Yar Jung మచిలిపట్నం, ఏలూరు, మద్రాసులలో పర్యటించి ప్రజలను ఒప్పించే ప్రయత్నం చేసాడు.

ఈ మొత్తం వ్యవహారంపై ప్రజలలో తీవ్ర వ్యతిరేకత వచ్చింది. 'మమ్ములను రాత్రికి రాత్రి మా జన్మభూమినుంచి వేరుచేసి ప్రజాస్వామిక విలువలు లేని రాజ్యంలో కలిపేయాలని చూస్తారా, మమ్మల్ని డబ్బులకు అమ్మేస్తారా?' అంటూ పెద్దఎత్తున నిరసనలకు దిగారు. ఈ వ్యతిరేకత వల్ల బ్రిటిష్ ప్రభుత్వం వెనక్కు తగ్గింది. (Ref: Autocracy to Integration: Political developments in Hyderabad State, 1938-1948 by Lucien D. Benichou, http://missiontelangana.com/re-cession-of-seemandhra-to-the-nizam-a-historical-vignette)

# సర్వవరం కైఫియ్యతు[1]

ఆంధ్రదేశమునందు శ్రీ మద్రాక్షారామ భీమేశ్వరుని దివ్యమండప మహా స్థలానికి ఈశాన్యం పదిక్రోసుల దూరమున ఒక మహాదరణ స్థలము కలదు. పూర్వమున ఒకనాటి కాలమందు బ్రహ్మరుషి అయిన నారదమహాముని బ్రహ్మ సభకు వెళ్ళినపుడు, బ్రహ్మసాన్నిధ్యములోనున్న ఇతర మహారుషులందరూ నారద మహామునిని బహువిధాలుగా పొగిడారు. ఆ పొగడ్తలకు పొంగిపోయిన నారద మహాముని ఈలోకములో విష్ణుమాయకు లొంగని వ్యక్తిని కనుకనే కదా వీరందరూ నన్ను పొగుడుతున్నారు అని ఎంతో అతిశయముతో మనసులోపల అనుకొన్నాడు.

సర్వజ్ఞుడు అయిన శ్రీమహావిష్ణువు నారదుని భావనలను గ్రహించి, అతనికి గర్వభంగ మొనరించాలని నిశ్చయించుకొన్నాడు. ఒకనాడు భూలోక సంచారానికి వెళదామని నారదుణ్ణి వెంటబెట్టుకొని ద్రాక్షారామ మహాస్థలానికి ఈశాన్యముగా పదిక్రోసులదూరములో ఉన్న అరణ్యమధ్యమునకు వచ్చారు. ఒక రాత్రి గడిచాక ఉదయకాలోచిత కృత్యములు తీర్చుకోవటానికై నీటికొరకు అన్వేషణ చేయగా, శ్రీ మహావిష్ణువు తన మాయచేత అక్కడ ఒక దివ్యసరోవరాన్ని సృష్టించాడు. అంతట నారదుడు ఆ కొలనులో స్నానం చేసి బయటకు వచ్చి చూసుకొంటే విష్ణుమాయవల్ల తన పురుష రూపమును కోల్పోయి స్త్రీ రూపమును పొందాడు. గతాన్ని మరచిపోవటం చేత తనకు సంభవించిన స్త్రీత్వమునకు అనుగుణముగా ఆ అరణ్యమున వయ్యారములుపోతూ సంచరించసాగాడు నారదుడు.

ఆ స్థలానికి ఉత్తరభాగమున ఒకప్పుడు గయాసురడనే రాక్షసుడు ఒక పట్నం నిర్మాణం చేసుకొని ఆ పట్నమందు నివసించేవాడు. ఒకనాడు బ్రహ్మ

---

1. బొమ్మూరు తెలుగు విశ్వవిద్యాలయం, మెకంజీ కైఫియ్యతులు సంపుటం నంబరు 247, 251 పేజి నంబరు 194. ఈ కైఫియ్యతు పిఠాపురం కుంతీమాధవస్వామి, సర్పవరం భావనారాయణస్వామి ఆలయ స్థలపురాణము, శాసనముల ఆధారంగా వ్రాసినది కావొచ్చు ఇతర కైఫియ్యతులకు భిన్నంగా ఉంది.

వచ్చి యాగం చేసుకోవటానికి గయాసురుని యొక్క నాభీస్థానమును కోరగా తన నాభిపై యజ్ఞనిర్వహణకు అంగీకరించి తాను లోకాంతరగతుడయ్యాడు. గయాసురుడు పట్నం ఏలుతూ ఉన్నప్పుడు ఆ పట్నంలో శ్రీ పురుహూతికా శక్తి పేరిట నూటఒక్క దేవాలయములు కట్టించి సువర్ణ విగ్రహములు ప్రతిష్ఠలు చేయించాడు. దేవీఉపాసన చేసి మహాబలసంపన్నుడైనాడు. గయాసురుడు స్వర్గస్తుడైన తరువాత వీరుబాహుడనే రాజు దేవి ఉపాసన చేస్తూ గయాసురుడి పట్నమందు నివసించేవాడు. పురుహూతికా శక్తి పీఠరూపములో ఉన్నందువల్ల ఆ పట్నమునకు పీఠికాపురమనే పేరువచ్చింది. వీరబాహుకుమారుడు శృతకీర్తి ఆయన కుమారుడు నికుంఠమహారాజు పీఠికాపురాన్ని పాలించారు. నికుంఠ మహారాజు వయసు ఇరవై అయిదు సంవత్సరములు. ఒకనాడు ఇతను వన విహారము చేస్తుండగా, స్త్రీరూపము ధరించిన నారదుని చూసి మోహించి తన అంతఃపురమునకు తీసుకొనిపోయెను. క్రమేణా వారిరువురికి అరవైమంది కుమారులు కలిగిరి. వారి పేర్లు వరుసగా ప్రభవ, విభవ మొదలు క్రోధన, క్షయ వరకు మొత్తం అరవై.

ఈ ప్రకారం అరవైమంది కొమారులతో నికుంఠమహారాజు రాజ్యం ఏలుచుండగా ఒకనాడు రిపుంజయుడనే రాజు పీఠికాపురంపై యుద్ధానికి వచ్చాడు. నికుంఠమహారాజు తన కుమారులతో కలసి రిపుంజయునితో భీకరమైన యుద్ధం చేసాడు. ఈ యుద్ధంలో నికుంఠమహారాజు అతని కుమారులు అరవైమందీ మరణించారు.

స్త్రీరూపంలో ఉన్న నారదుడు ఈ విషయం తెలుసుకొని యుద్ధభూమికి వెళ్లి చాలాసేపు దుఃఖపడింది. కొంతసమయం గడిచేసరికి ఆమెకు విపరీతమైన ఆకలివేయగా ఆ అరణ్యమునందు తినడానికి ఏదైనా దొరుకుతుందేమోనని వెతుక్కొంటూ, తాను ఎక్కడైతే స్త్రీరూపాన్ని పొందిందో అదే ప్రాంతానికి వచ్చింది. ఆ సమీపమునందు ఒక వృక్షశాఖపై ఒక పండు కనిపించింది. ఆ ఫలమును అందుకోవాలని ఆ ప్రభవాదుల యొక్క తల్లి ప్రయత్నించింది. అందలేదు. అంతట తన కుమారులయొక్క కళేబరములను ఒక గుట్టగాపోసి దానిపై ఎక్కినా ఆ పండు అందలేదు. తన భర్త కళేబరమును కూడా గుట్టమీదకు చేర్చి దానిపై నిలబడి ఆ పండును అందుకోబోయింది.

అంతట శ్రీ మహావిష్ణువు నారదునికి గర్వభంగమైనది, ఇంతమట్టుకు చాలునని తలంచి ఒక వృద్ధబ్రాహ్మణుని రూపములో వచ్చి, నికుంతమహారాజు భార్యను ఉద్దేశించి ఓ చిన్నదానా నీవు అశౌచములో ఉన్నావు, ఇలాంటి సమయములో ఆ ఫలము నీకు లభ్యం కాదు. ఆ సరస్సునందు స్నానం చేసి రమ్మని అన్నాడు. అంతట ఆ స్త్రీ స్నానం చేయటానికి ఆ సరస్సులో మునిగి తేలినంతనే స్త్రీత్వం పోయి తిరిగి నారద రూపం వచ్చింది. తన గతం జ్ఞాపకం వచ్చింది. శ్రీమహావిష్ణువు వృద్ధబ్రాహ్మణుని రూపం విడిచి గరుడవాహనారూఢుడై నారదునికి దర్శనమిచ్చి అంతలోనే అంతర్ధానమైనాడు. జరిగినది అంతా విష్ణుమాయ అని నారదమహామునికి అర్ధమైంది. తన అజ్ఞానానికి ఎంతగానో సిగ్గుపడ్డాడు. శ్రీమహావిష్ణువు అనుగ్రహం కొరకు ఆ ప్రాంతమందే తపస్సుచేయగా శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయ్యాడు. భావన చేసినంతనే శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైన కారణం వల్ల నారదమహాముని ఆ స్థలములో భావనారాయణ స్వామి పేరుతో ఆలయ ప్రతిష్ఠ చేసాడు. నారదుడు స్త్రీరూపం పొందిన సరస్సుకు నారద గుండమని, స్త్రీరూపాన్ని కోల్పోయి నారదరూపాన్ని పొందిన సరస్సుకు ముక్తి గుండమని వాడిక అయినవి– అని స్థలపురాణములో చెప్పబడుచున్నది.

ఆ స్థలమందునే ముక్తి గుండానికి నైరుతిభాగమున అనంతుడనే ఒక సర్పము శ్రీమహావిష్ణువును గురించి తపస్సు చేసి తనను పానుపుగా స్వీకరించమని కోరగా స్వామి ఆ విధంగా వరమునిచ్చాడు. విష్ణువుచేత వరమును పొందిన క్షేత్రము కనుక ఆ స్థలానికి సర్పవరమని పేరువచ్చెను. నారదుడు క్షుద్బాధతో చెట్టుపైనున్న పండుకొరకు ప్రయత్నించిన ప్రాంతమును పండూరు అని పిలుచు కొనుచున్నారు. నికుంతమహారాజు అరవైమంది కుమారులు అరవై తెలుగు సంవత్సరములుగా మానవులు వ్యవహరించుకొనుచున్నారు.

తదుపరి చంద్రవంశపు రాజు అయిన జనమేజయుడు సమస్త భూమండలానికి అధిపతి అయి పాలించెను. అటుపిమ్మట పల్లవులు, చాళుక్యరాజుల పరంపర అయిన తరువాత కటకపురిరాజు బిలహుడు అనే జైన రాజు ఆంధ్రదేశమును ఏలినట్టు వాడిక కలదు. తరువాత శ్రీనిధి రాజరాజమహీపతి పాలించెను. అటు పిమ్మట యదువ వంశీకుడైన వైహయుడు అనేరాజు పుట్టెను. ఆయనకు ముమ్మడి భీమభూపాలుడు అనేరాజు కలిగి మహాధర్మ స్వరూపుడై పాలన చేసెను. ఈయనకు వెన్నభూపాలుడు, రాజుపరాజు అనే ఇద్దరు కొమారులు కలిగిరి. రాజుపరాజుకు

తొడ్డాంబిక అనే ధర్మపత్నియందు ముమ్మడి భీమభూపాలుడు[2] అనే కుమారుడు కలిగెను, ఈయనకు సత్యరాజు అనే కుమారుడు కలిగెను. ఇతనికే చోడభూపతి అనే పేరుకూడా కలదు. ఇతను వేంగీదేశమునకు అధిపతి అయి రాజేంద్ర చోడభూపతి[3]గా రాజ్యమునేలెను. ఈయన ధర్మపత్ని మయిలారుదేవి. ఈమెయందు ఇతనికి బేతరాజు, మల్లిదేవుడు, కోనరాజేంద్ర చోడుడు, ముమ్మడి భీమరాజు, సత్యరాజు అనే అయిదుగురు కుమారులు కలిగిరి. వీరిలో జ్యేష్టుడు అయిన బేతరాజుకు గంగాచ్చి, బింబమాచ్చి అనే ఇద్దరు భార్యలు కలరు. ఇతనికి మనుమచోడరాజు, సూర్యరాజు అనే ఇద్దరు కుమారులు కలిగిరి. మల్లిదేవుడు అనే ఆయన మహాధర్మ సంస్థాపన పరుడు అయిఉండెను.

కోనరాజేంద్ర చోడమహారాజు శ్రీభీమేశ్వరునికి మండపములు కట్టించి శాశ్వతమైనటువంటి ధర్మ సంస్థాపన చేసెను. తక్కిన ఇరువురు ముమ్మడి భీమరాజు, సత్యరాజు వేంగిదేశమును సమభాగములుగా విభజించుకొని ఏలుకొన్నారు.

ముమ్మడి భీమరాజుకు లోకరాజు[4] అనేకుమారుడు కలిగి తండ్రి తదనంతరం రాజ్యాన్ని అధిష్టించాడు. సత్యరాజుకు రాజపరాజు, కోనభీముడు అనే ఇద్దరు కొమరులు కలిగారు. ఇందు జ్యేష్టుడు అయిన రాజపరాజుకు వల్లభాధీశుడు అనే కుమారుడు కలిగెను. సత్యరాజు తదనంతరం రాజపరాజు సింహాసనాన్ని అధిష్టించాడు. కోనభీముడు , లోకరాజులు స్వర్గస్థులు అయిన తరువాత వారిద్దరు ఏలుచున్న దేశములకు వల్లభాధీశుడు అధిపతి అయ్యాడు.

---

2. ముమ్మడి భీమ I హైహయ వంశానికి చెందిన రాజు. ఇతను క్రీశ.1082లో కోన ముమ్మడిరాజు పేరుతో వేయించిన శాసనం ద్రాక్షారామంలో కలదు.

3. రాజేంద్ర చోడ I. ఇతను చోళుల సామంతుగా వేంగి రాజ్యాన్ని పరిపాలించాడు. ఇతని అయిదుగురు కొడుకులలో ముమ్మడి భీమ II సత్య I లకు రాజ్యాన్ని పంచాడు. వీరు క్రీశ. 1135–1150 లలో కోనమండలాన్ని పాలించారు. ఈ సత్యరాజు ద్రాక్షా రామ భీమేశ్వరునికి క్రీశ.1135 లో భూములు దానమిచ్చినట్లు శాసనము కలదు. వీరిని కోనమండల రాజులు అని అంటారు.

4. లోకభూపాల, భీమ III ఇరువురు కలసి క్రీశ 1150 నుంచి 1178 వరకు కోన మండలాన్ని పాలించారు (నేటి కోనసీమ). వల్లభాధీశుడు క్రీశ.1182 వరకూ పరిపాలించాడు.

ఈ వల్లభాధీశునకు అచ్చమాంబ, బెండాంబిక అనే ఇద్దరు భార్యలు కలరు. వీరిలో అచ్చమాంబ ద్వారా ఇతనికి మనుమసత్యరాజు[5] అనే కుమారుడు కలిగెను. ఈ వల్లభాధీశుడు పద్నాలుగేండ్లు రాజ్యం చేసాడు.

తదనంతరం హనుమకొండ రాజ్యమందలి ఏకశిలానగరము రాజధానిగా చేసుకొన్న ప్రతాపరుద్రుడు కొన్నాళ్ళు ఆంధ్రదేశమున ప్రభుత్వము చేశినట్టుగా ప్రజలు చెప్పుకొంటున్నారు కానీ వారి సంబంధమైన శిలాశాసనములు ఇంతవరకూ ఎక్కడా కనిపించలేదు.

అటుపిమ్మట కటకపురిని రాజధానిగా కలిగిన గజపతివారు[6] అనే కపిలేశ్వరగజపతి ఆంధ్ర, కళింగదేశాములను ఏలుకొనిరి. వీరు పశ్చిమమున కర్ణాటకదేశము వరకూ కూడా ఏలుబడి చేసారు.

అంతట కొండవీటి కాపురస్తులు అయిన కాటమరెడ్డి కొమారుడు మారారెడ్డి ఆయనకుమారుడు కాటమరెడ్డి ఆయనకు పెదవేమారెడ్డి, చినవేమారెడ్డి అనే ఇద్దరు కుమారులు కలరు. వారు రాజ్యాన్ని పశ్చిమమున అద్దంకి, అమ్మనబోలు మొదలుగొని తూర్పున శింహాచలం వరకూ విస్తరింపచేసారు. వీరిపాలనలో చామర్లకోట, పిఠాపురం, కోరుకొండ మొదలైన స్థలాలందు నేలకోటలున్ను, రామవరపుకొండ మొదలైన కొండలయందు కొన్ని దుర్గములు కట్టించారు.

క్రీశ. 1397 ఈశ్వరనామ సంవత్సరం చైత్రమాసమందు గోలి సోమారెడ్డి సర్పవరం భావనారాయణ పెరుమాళ్ళుకు బృందావనం నిమిత్తం తూర్పుటావ దొంపుగుట్ట ఉత్తరాన రెండుపుట్లు క్షేత్రం కొని మొక్కలు నాటించి అత్తిలి శింగన్న అనే ఆయన వశం చేసి స్వామికి అర్పించుకొన్నాడు. ఆ ప్రకారం గుడిముందర

---

5. మనుమసత్య, మల్లిదేవునితో కలసి క్రీశ. 1182–1231 వరకూ కోనమండలాన్ని పరిపాలించారు. వీరిద్దరూ కలిసి పిఠాపురం కుంతీమాధవ ఆలయానికి క్రీశ. 1195లో ఒడియూరు అనే గ్రామాన్ని దానంగా ఇచ్చినట్లు ఆ ఆలయ తూర్పు ద్వారం వద్ద ఉన్న స్తంభంపైన ఒక శాసనంలో ఉన్నది. ఈ గ్రామానికి తూర్పున వేళెంగు, దక్షిణమున సిరిపురం, ఉత్తరమున సంపర అని చెప్పటాన్ని బట్టి ఇది ప్రస్తుత ఓడూరు కావొచ్చు. ఈ శాసనంలో ఇవ్వబడిన కోనరాజుల వంశావళి చాలా విలువైనదిగా చరిత్రకారులు గుర్తించారు. Epigraphica Indica vol IV

6. క్రీశ. 1424–1541 మధ్య కటకం కేంద్రంగా ఏర్పడిన గజపతి సామ్రాజ్యం ఉత్తరాంధ్రాను దాటి కొంతకాలం గోదావరి జిల్లాలవైపు కూడా విస్తరించింది.

ద్వారపాలక విగ్రహం వెనుక ఒక శిలాశాసనము రాయించాడు. ఇదికాక గోలి సోమారెడ్డి ఇరవైటంకాల రొఖ్కం బృందావనం నిర్వహణ నిమిత్తం అత్తిలి సింగన్న కు ఇప్పించిరి

క్రీశ.1397 ఈశ్వరనామ సంవత్సరం, వైశాఖ మాసంలో కశిమికోట గోపయ్య, ఆకుమళ్లు పట్టించి చేను సమర్పణ చేసినట్లు దేవాలయములో తూర్పుముందరి ద్వారానికి దక్షణం వైపు స్తంభానికి శిలాశాసనం వేయించినారు.

క్రీశ.1399 ప్రమోదినామ సంవత్సరం ఆషాడమాస పుణ్యకాలమందు ప్రోలునాటి సీమలో సముద్రతీరము అయినటువంటి కొమరగిరిపురమనే పట్టణవాసి గోగ్గయ రాజు అనే ఆయన శ్రీ భావనారాయణ పెరుమాళ్లకు బృందావనము చేయించి సమర్పించినట్లు శ్రీపాతాళ భావనారాయణ పెరుమాళ్ల ఆలయము ఎదుట నిలువున పాతిఉన్న శిలాశాసనములో కలదు.

క్రీశ.1401 విష్ణునామసంవత్సరం వైశాఖమాసమందు శ్రీభావనారాయణ పెరుమాళ్ళ బృందావనానికి లక్కిరెడ్డి 18 ఎకరముల చేను, ముప్పై టంకముల ధనము స్వామివారికి సమర్పించుకొని ఆ ప్రకారము రంగమండపము ఎదుట ఒక శిలాశాసనము గోడమీద వ్రాయించినారు.

క్రీశ.1404 తారణనామ సంవత్సర కార్తీకమాసమందు ప్రాతఃకాల శృంగారభోగం అవసరం నిమిత్తం గోలిసోమారెడ్డి– అప్పములు, బియ్యం, తిరు భోనముతో (నైవేద్యము) పప్పుపెసలు, పోకలు, మూడుఆకులు,12 కూర గాయలు, నూరుటంకాల సొమ్ములు సమర్పించుకొన్నారు.

క్రీశ.1405 పార్థివనామ సంవత్సరం ఆషాఢమాసంలో కాటమవేమారెడ్డి తన స్వామి కొమరగిరి రెడ్డిగారికి, వారి అమ్మగారికి శుభం కలగాలని శ్రీసర్పవరపు భావనారాయణ స్వామి ముందర వసంతరాయ మండపమును కట్టించినారు. చింతపల్లి అనే గ్రామముకు కొమరగిరిపురాగ్రహారము అని పేరుపెట్టి శ్రీ స్వామి వారికి సమర్పించుకొన్నారు. ఆ ప్రకారం రంగమండపమునకు తూర్పుద్వారం గోడకు శాసనం వ్రాయించినారు.

క్రీశ.1422 శుభకృతినామ సంవత్సరం మార్గశిరమాసంలో దేవాలయం ఎదుట నందికి స్తంభాలు నిర్మించినపుడు వైష్ణవభక్తులైన గుడ్డల నరసయ్య, బాలన్న మొదలగు 66 మంది కలిసి, నంది మండపం నిర్మాణంలో పనిచేసే జంగాలకు సర్పవరం గ్రామములో తొమ్మిది పుట్ల భూమిని వృత్తిమాన్యముగా ఇచ్చి, ఆ ప్రకారం తూర్పుగోపురం ద్వారములోపల ఒక శాసనం వ్రాయించినారు.

క్రీశ. 1424 క్రోధినామ సంవత్సరం, కార్తీకమాసమందు వేమారెడ్డి సేవకుడైన భక్తుని కూనయనెనిం తమతల్లి మనుమసానికి పుణ్యముగాను తిరువళికంభము (దీపస్తంభము) నిర్మించి తిరువళికి చమురుకొరకు తొంభై గోవులను, స్వామివారికి పట్టువస్త్రాలను, కొంతభూమిని, నలభైఒక్క టంకాలను సమర్పణ చేసి ఆ విషయాన్ని దక్షిణ గోడకు శాసనము వ్రాయించాడు.

క్రీశ. 1457 ఈశ్వరినామ సంవత్సరం చైత్రమాసంలో భావనారాయణ పెరుమాళ్ల బృందావనానకై చందుమమ్మనం గారు తూర్పుటావలో (తూర్పుపల్లం భూమి) పుట్టెడు పొలం కొని, దానిని గన్నవరపు శింగన్న బాగుచేసుకొని బ్రతుకు గలందులకు అని స్వామివారిపేరిట దానంచేసినట్లు ప్రాకారము తూర్పుద్వారముకు ఉత్తరంవైపున గోడకు శిలాశాసనము వ్రాయించినారు.

క్రీశ. 1501 దుర్మతినామసంవత్సరం పాల్గుణమాసంలో మహామహిమగల పొన్నాడ వుడుమయ రాజపాత్రుని కుమారుడు కసవయ మహాపాత్రునికు మేనల్లుడైన కుర్మయ మహాపాత్రుడు తమ తండ్రి వుడుమయ్యంకు తమ తల్లి దుర్రమాంబ్బకు తమ తోడపుట్టిన భావయ మహాపాత్రునికి పుణ్యం లభించాలని సర్పవరపు శ్రీభావనారయణ దేవుని తిరుచుట్టుమాల (దేవాలయం చుట్టూ చిన్న దేవతల విగ్రహాల కోసం నిర్మించిన కట్టడం) నిర్మించి స్వామివారికి సమర్పణచేసి పశ్చిమ ప్రాకారం గోడకు శిలాశాసనం వేయించినారు.

అంతట ఆంద్ర, కళింగ దేశములు రెండూ గజపతి ప్రతాపరుద్రుని వారు ప్రభుత్వము చేస్తూ ఉండిరి. ఆంధ్రదేశమునందు కొండవీటి రెడ్లు దొరతనము చేసేటప్పుడు ఈ సర్పవర గ్రామము బహువిస్తారమైన పట్నముగా ఉండెడిది.

క్రీశ. 1515 యువనామ సంవత్సరంలో విజయనగర నరపతి సింహాసనస్థుడైన కృష్ణదేవరాయలవారు గజపతివారిని జయించడానికి కటకపురికి సైన్యముతో ఈ మార్గాన వెళ్ళేటపుడు శ్రీ భావనారాయణ పెరుమాళ్లుకు అనేక విధ కైంకర్యములు జరిగించిరి. అనేక ఆభరణములు ఇచ్చిరి. ఆ పిమ్మట కటకపురి సింహాసనస్థులైన ప్రతాపరుద్రగజపతి కొమారుడు వీరభద్రగజపతి కళింగదేశము, ఆంధ్రదేశమును ప్రభుత్వము చేసిరి.

రెడ్డిరాజుల ఏలుబడి తరువాత ఈ సర్పవరం గ్రామమును వంటిపల్లి వారు అనే కమ్మవారు కొన్ని దినములు ప్రభుత్వం చేసిరి. ఆ తరువాత చిట్నీడివారు అనే వెలమవారు కాకినాడ, శలపాక, ప్రోలునాడులను కౌలుకు తీసుకొని దొరతనం చేస్తుండగా, తురకాణ్యం ప్రబలమైనది.

(ఆ వివరాలు చామర్లకోట కైఫియ్యతులో కలవు)

# జల్లూరు కైఫియ్యతు[1]

*(జల్లూరు  కైఫియ్యతు పరగణా ప్రోలునాడు తాలూకా పిఠాపురం)*

ఆంధ్రదేశమున ద్రాక్షారామ పుణ్యక్షేత్రమునకు ఈశాన్యభాగమందు ఒకపరిమిత స్థలమున ప్రోలునాటి సీమకు చెందిన ఊరు జల్లూరు.

పూర్వకాలమందు బిలహుడు అనే జయిన రాజు పాలించేటపుడు ఒక పట్టణమును నిర్మాణముచేసి జైనులకు అగ్రహారముగా ఇచ్చి అక్కడ జైన దైవములను విగ్రహములుగా చేయించినాడు. ఆ తరువాత ఆ పట్టణమును చూడటానికి ఆ ప్రభువు వచ్చినపుడు వీధిలో రాజు తన చతురంగబలములతో వెల్తుండగా, అప్సరసలు అంతా ప్రభువుపై శేషలు (పూలు) జల్లిరి.  అప్పటినుంచి ఆ పట్టణానికి జల్లూరు అని పేరు వచ్చెను. ఆ తరువాత చాలాకాలము ఆ పట్టనమందు జైనులు సుఖజీవనం సాగించారు.

చంద్రవంశపు రాజైన విజయాదిత్యుడు[2] అత్యంత పరాక్రమశాలి. ఇతను శత్రురాజులను ఆక్రమించుకొని తన రాజ్యాన్ని విస్తరించుకొంటూ వస్తున్న క్రమంలో త్రిలోచనపల్లవ[3] మహారాజు అనే రాజుపై చేసిన యుద్ధంలో మరణించాడు. విజయాదిత్యుని భార్య మహాదేవి అప్పటికి ఆరునెలల గర్భిణి. ఈమె ముడిలేము అనే అగ్రహారమునకు పోయి అక్కడి వాస్తవ్యుడు అయిన విష్ణుభట్ట సోమయాజి అనే ముని సంరక్షణలో విష్ణువర్ధనుడు అనే కుమారుడిని కన్నది.  ఆ కుమారుడు

---

1. బొమ్మూరు తెలుగు విశ్వవిద్యాలయం సంపుటి నం.247, 251లలో 24వ పేజీ
2. చాళుక్యుల మూలపురుషులలో విజయాదిత్యుడు, విష్ణువర్ధనుడు బిరుదులున్న చాలా మంది రాజులు రాజ్యం చేసారు. త్రిలోచనపల్లవుడు విజయాదిత్యుల యుద్ధం గురించి అనేక తామ్రశాసనాలలో చెప్పబడింది. దీనిని ధృవీకరించే ఇతర సాక్ష్యాలు లేవు. (వేంగీ తూర్పు చాళుక్యులు– డా. ఎన్. వేంకటరమణయ్య)
3. త్రిలోచనపల్లవుడు/ముక్కంటి గురించి  పుస్తకం చివరలో విపులమైన వ్యాసం కలదు.

తల్లినుండి తన కథను తెలుసుకొన్నాడు. చాళుక్యగిరి యందు కొలువున్న నందా భగవతి గౌరి మహాదేవి కరుణతో తన తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించు కొన్నాడు. ఇతని కుమారుడి పేరు విజయాదిత్యవిష్ణువర్ధనుడు.

విజయాదిత్య విష్ణువర్ధనుడి కుమారుడు కులకేశి[4]. ఇతను సమస్త ధర్మములు జరిగిస్తూ ప్రజాపాలన చేసెను. ఆయనకుమారుడు కీర్తివర్మ[5] తండ్రిలాగే ధర్మని రతితో పాలనసాగించాడు. ఈయనకు సత్యాశ్రయ వల్లభేంద్రుడు[6], కుబ్జవిష్ణువర్ధన మహారాజు అనే ఇద్దరు కుమారులు కలిగిరి. సత్యాశ్రయ వల్లభేంద్రుడు కుంతలి దేశమునకు రాజు అయ్యాడు. ఇతని తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధన మహారాజు అశ్వమేధయాగము చేసాడు. తపస్సుచేత పవిత్రమైన దేహము కలవాడై వేంగీ దేశమునకు రాజై పద్దెనిమిది సంవత్సరములు పాలించాడు. ఈయనకు జయసింహమహారాజు, ఇందరాజు అనే ఇద్దరు కుమారులు కలిగినారు. జయసింహమహారాజు వేంగిదేశమునకు అధిపతి అయి ముప్పై మూడు సంవత్సరములు పాలించాడు. అటుపిమ్మట ఈయనకు తమ్ముడైన ఇందరాజు కొంతకాలము పరిపాలించిన తరువాత ఇతని కుమారుడు విష్ణువర్ధన మహారాజు సింహాసనమును అధిష్టించి తొమ్మిది సంవత్సరములు రాజ్యం ఏలాడు. ఈయన కుమారునిపేరు యువరాజు. ఇతను వేంగీ రాజ్యసింహాసనమును అధివసించి

---

4. ఇతనిని మొదటి పులకేశి (క్రీ.శ. 540–567) అంటారు. ఇతను చాళుక్య వంశంలో మొదటి స్వతంత్ర్య పాలకుడు. ఇతను మహరాష్ట్ర, కర్ణాటక, దక్కను ప్రాంతాలను పాలించాడు. ఐహోలు శాసనం ప్రకారం బాదామి చాళుక్యవంశం జయసింహ వల్లభుని (క్రీ.శ. 500–520) తో మొదలౌతుంది. ఇతని కొడుకు రణరాగుడు (520–540). ఇతని కొడుకు మొదటి పులకేశి.
5. ఇతను మొదటి కీర్తివర్మ (క్రీ.శ. 567–592) ఇతను రాజ్యాన్ని విస్తరింపచేసాడు. ఇతని తరువాత ఇతని తమ్ముడు మంగలేశుడు కొంతకాలం పాలన చేసాడు.
6. ఇతనిని రెండవ పులకేశి (క్రీ.శ. 610–642) అంటారు. ఇతను మంగళేశుడిని సంహరించి రాజ్యాన్ని దక్కించుకొన్నాడు. రాజ్యాన్ని దక్షిణాది వరకూ విస్తరించాడు. ఉత్తరాదిన హర్షవర్ధనుడిని నిలువరించాడు. పర్షియారాజుతో సత్సంబంధాలు నెరిపాడు. చైనా యాత్రికుడు హువాన్‌త్సాంగ్ ఇతనిని ఇతని పాలనను కీర్తించాడు. దక్షిణభారత దేశంలో బంగారు నాణాలను తొలిసారిగా ప్రవేశపెట్టాడు. దానిపై వరాహ ముద్ర ఉండుట చేత వరహాలు అనే పదం పుట్టింది. ఇతను వేంగిని జయించి పిఠాపురాన్ని రాజధానిగా చేసి తన తమ్ముడు కుబ్జ విష్ణువర్ధనుడిని నిలిపి తనకు సామంతుగా ఉంటూ పాలించుకొమ్మని అప్పగించాడు. (ఆంధ్రుల చరిత్రము– చిలకూరి వీరభద్రయ్య)

మహాధర్మముగా ఇరవై అయిదేండ్లు పాలించాడు. యువరాజు కుమారుడైన జయశింహవల్లభూడు వేంగిదేశమును పదమూడు సంవత్సరములు ప్రభుత్వం చేశాడు. తరువాత విష్ణువర్ధనమహారాజు ముప్పై ఆరుసంవత్సరములు, ఆయన కుమారుడు విజయాదిత్య మహారాజు ఎనిమిది సంవత్సరములు, ఆయన కుమారుడు విష్ణువర్ధన మహారాజు ముప్పైఆరుసంవత్సరములు, ఆయనకుమారుడు నరేంద్రుడు నలభైసంవత్సరముల పాటు వేంగిరాజ్యమును పరిపాలించాడు.

తదనంతరమునందు ఈవంశానికి చెందిన రాజనరేంద్రమహారాజు తన పాలనలో వేంగిదేశములో అనేక గ్రామాలలో శైవ, వైష్ణవాలయాలను కట్టించాడు. ఇతను నరేంద్రపురమనే పట్నముయందు కోటలు కట్టించి అక్కడ సింహాసనస్థుడై రాజ్యము చేసెను. ఈయనకు రత్నాంగి, చిత్రాంగి అని ఇద్దరు భార్యలు కలరు. రాజమహేంద్రవరంలో నివాసం ఉండేవాడు. ఈయనను రాజరాజనరేంద్రుడని ప్రజలు పిలుచుకొంటారు.

వేంగిదేశమును పాలించిన విజయాదిత్య మహారాజు కుమారుడైన మల్లపదేవ చక్రవర్తి[7] క్రీశ.1198 కాళయుక్తనామ సంవత్సరం జేష్టమాసంలో పట్టాభిషేక సందర్భంగా ఈ జల్లూరు గ్రామానికి దగ్గరలో ఉన్న గుడివాజ గ్రామాన్ని పిఠాపురం శ్రీకుంతీ మాధవస్వామికి భోగరాగాదులకొరకు సర్వ మాన్యంగా ఇచ్చారు.

ఆ తరువాత అన్నిలదేవు అనేరాజు తూర్పుకోనసీమ నుండి అఖండ గోదావరి తీరం వరకూ రాజ్యము ఏలుచున్న సమయములో కోరుకొండకు ఉత్తర భాగమునందు, పూర్వం రాజరాజనరేంద్రుడు కట్టించిన కోటసిద్దేశ్వరం అగ్రహారం వద్ద విస్తారమైన కోటనొకదాన్ని కట్టించుకొని అక్కడ నివాసముంటూ ప్రభుత్వము చేస్తూఉన్నారు. ఈయన ఏలుబడిలో భూమి కొలతకు "గడ" ప్రమాణము చేసిరి.

ఆ తరువాత ఈ ప్రాంతము కాకతీయులపాలనలోకి పోయినది. కాకతీయులకు సామంతులుగా పెదమల్లి దేవరాజు, చినమల్లి దేవరాజులు

---

7. మూడవ మల్లపదేవుడు ఈదానం చేసినట్లు కుంతీమాధవ ఆలయంలో క్రీశ.1202 జూన్,16న వ్రాయించిన ఒక శాసనంద్వారా తెలుస్తున్నది. (Epigraphica Indica vol IV 455 of 1893)

బెండపూడి అనే గ్రామము వద్ద కొండ పక్క పెద్దకోటను నిర్మించుకొని అక్కడ నివాసముంటూ, కోనసీమ నుండి రాజమహేంద్రవరం వరకూ ప్రభుత్వము చేసారు.

కొండవీటి రెడ్లపాలనలో కూనమనాయకుడు వారిప్రతినిధిగా కోరుకొండ పట్నములో నివాసముంటూ పరిపాలన సాగించాడు. ఇతను జల్లూరు గ్రామానికి పశ్చిమంవైపున రాజరాజనరేంద్రుడు ప్రతిష్ఠచేసిన ఈశ్వరాలయము ఒకటి శిథిలమై ఉండగా, ఆ దేవాలయమునకు జీర్ణోద్ధరణ చేసి, కొంతభూమిని మాన్యముగా ఏర్పాటుచేసాడు.

కూనమనాయకుని తరువాత ముమ్మడినాయకుడు ఈప్రాంతానికి అధిపతి అయి పాలనసాగించాడు.

రెడ్లపాలన తరువాత వారి సంబంధీకులు వేమారెడ్డి రాజ్యం చేసాడు. వేమారెడ్డి ఏలుబడిలో ప్రోలునాడు, కాకినాడు, శలపాకనాడులు[8] మట్టుపిల్లివారు అనే కమ్మవారికి జమిందారీ చేసినందున వారికింద చెల్లుతూ ఉండేవి.

మట్టుపిల్లివారికి వారిలో వారికి విరోధములు వచ్చి ఏడుగురు అన్నదమ్ములు కత్తులతో ఒకరినొకరు నరుకులాడుకొన్నారు. చావకుండా మిగిలి ఉన్న వారు జమిందారీ సక్రమంగా నిర్వహించటంలేదన్న కారణంచూపి చిట్నీడి ధర్మారాయినిం అనే వెలమవారు ఈ మూడు నాడుల జమిందారీ సంపాదించుకొన్నారు.

ఆ క్రమంలో ధర్మారాయినింగారి తరువాత వెంగన్న, వారితమ్ములు సూరయ్య, తరువాత వెంగన్నగారి కుమారులు తిమ్మన్న, ఆయనకుమారుడు రామరాయనింగారు దొరతనం చేస్తూ వచ్చారు. ఈ రామరాయనింగారికి పుత్ర సంతతి లేని కారణంగా అల్లుడు అయిన రావు తెనుగురాయినింగారిని దగ్గర ఉంచుకొని వ్యవహారం నడిపిస్తూండేవారు.

ఈ రావు తెనుగురాయనింగారికి మాధవరావు, వెంకటపతిరావు, చిన్నారావు, చంద్రారావు, జగ్గారావు, వెంకటకృష్ణారావు, రంగశాయిరావు అని ఏడుగురు కొడుకులు కలరు. (వీరి విశేషాలు చామర్లకోట కైఫియ్యతు లో కలవు)

---

8. ప్రోలునాడు – పిఠాపురం తుని పెద్దాపురం ప్రాంతాలు: కాకినాడు – కాకినాడ ప్రాంతం: శలపాకనాడు – కాజులూరు చుట్టుపక్కల ప్రాంతాలు.

జల్లూరు గ్రామంలోని పురాతన ఈశ్వరాలయాన్ని విప్పించి ఆ రాళ్లను, యుద్ధం కాలంలో పెద్దాపురం, పిఠాపురం, చామర్లకోట గోడలను బలపరచుకోవటానికి తోలించుకుపోయారు. దేవుని మాన్యం పనికిమాలినది అయింది. జల్లూరు శివారులో జైన ప్రతిమలు[9], ఒక శిలావిగ్రహం ఒకటి కొంత శిధిలమై ఉన్నవి. పాతవూరి వద్దనుండి దండుతోవను (సైన్యం వెళ్ళేదారి/హైవే) తప్పించి మిగిలిన ఊరును నలభైసంవత్సరముల క్రితం (సుమారు 1775 ప్రాంతంలో) తిరిగి కట్టుకున్నారు.

జల్లూరు గ్రామంలో రాగులు,పెసలు,మినుములు,అనుములు, ఆముదాలు, అలచందలు పండుతున్నాయి.



---

9. పిఠాపురంసమీపంలో ఉండే జల్లూరులో నేటికీ జైన విగ్రహాలు ఉన్నాయి. జెల్లూరులో లభించిన కొన్ని జైన విగ్రహాలకు స్థానికులు గుడి నిర్మించి దీపారాధనలు చేస్తున్నారు. అక్కడ ప్రస్తుతం తపస్సు చేసుకొంటున్న ముని రూపంలో ఉన్న మూడు రాతివిగ్రహాలు కలవు. ఈ మూడింటిలో ఒక విగ్రహపీఠంమీద శ్రీ శాంతినాథ్ అనే పేరు వ్రాసి ఉన్నది. ఆ విగ్రహంలో ఉన్నది జైన గురువు కావొచ్చు. మెడలో దండలు, ఇరువైపులా వింజామరలు వీస్తున్న ఇద్దరు స్త్రీల ఆకారములు కూడా చెక్కబడి ఉన్నాయి. మిగిలిన రెండు విగ్రహాలు కూడా తపస్సు చేసుకొంటున్న భంగిమలో సామాన్యంగ ఉన్నాయి.

అదే విధంగా పిఠాపురంలో సన్యాసిరాళ్ళు/దేవుళ్ళు పేరుతో జైన విగ్రహాలు ఈరోజుకూ ఆరాధనలు పొందుతున్నాయి.

# కోరుకొండ[2] కైఫియ్యతు[1]

పూర్వకాలమందు రాజమహేంద్రవరం సమీపంలో ఒక అడవిలో ఒక మహాయోగి తపస్సుచేసుకొంటూ, తనశిష్యులతో కూడి నివసిస్తూ తపస్సు చేసుకొంటూ ఉండేవారు. వారు ప్రతిదినం మట్టితో ఒక శివలింగము చేసి దానికి శాస్త్రోక్తముగా పూజాపునస్కారము గావించి ఆ సమీపమునందుగల ఒక సరోవరంలో విడిచేవారు. అవి సరస్సునీటిలో శిథిలము కాక, శిలారూపమును పొంది దినదిన ప్రవర్ధమానమవుతుండేవి.

కొన్నినాళ్ళు జరిగినతరువాత, రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్ర పట్టణమున రత్నసింహాసనాన్ని అధిరోహించి పాలనచేయుచున్న కాలములో, ఆయన ఒకనాడు వేటకు వెళ్లినపుడు పైనచెప్పిన మహాయోగి సంచరించిన ఋష్యాశ్రమానికి వచ్చి ఆ ప్రదేశంలో కొద్దిసేపు అలసట తీర్చుకొనేందుకు ఆగాడు. మహరాజుతో పాటు వచ్చిన సహచరులు దప్పిక తీర్చుకోవటానికి సరోవరములోని వెళ్ళి నీళ్ళు తాగుతున్నప్పుడు సరోవరమధ్యమందు నీటిలో

1. కైఫియ్యతు నంబరు 42 – 375 – 59 పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.
2. పల్లవరాజైన ముక్కంటి తనతో పాటు మాంచి, కొండ అనే ఇద్దరు సేనానులను తెచ్చుకొన్నాడు. మంచికొండ అనే పట్టణం వారి పేరుమీదనే వచ్చింది. వారి వంశంలో ప్రముఖుడు కూనయనాయకుడు. ఇతని కొడుకులు ముమ్మడినాయక, సింగయనాయక, గన్నయనాయకలు. వీరిలో ముమ్మడినాయకుడు శక్తివంతుడు. ఇతడు గోదావరీ పరీవాహక ప్రాంతాలను అనేకం జయించి కోరుకొండను రాజధానిగా చేసుకొని పాలించాడు. ఇతను కాపయనాయకుని మేనగోడలిని పెండ్లిచేసుకొని తన ప్రాబల్యాన్ని మరింతపెంచుకొన్నాడు. ఇతనికి 'ఆంధ్రసురత్రాణ' అనే బిరుదు కలదు. ముమ్మడి నాయకుడు తన సోదరులైన సింగయనాయకుడిని కోటిపురికి (కోటిపల్లి), తాటిపాక (రాజోలు వద్ద) కు సామంతులను చేసాడు. సింగయనాయకుడు ముమ్మిడివీడును రాజధానిగా చేసుకొని (నేటి ముమ్మిడివరం) కోనసీమను పాలించాడు. రి. ఆంధ్రుల చరిత్ర–సంస్కృతి, ఖంఢవల్లి లక్ష్మీరంజనం పే. 289 History of The Reddi Kingdoms by Sarma, M. Somasekhara P.no 34.

అనేకమైన లింగములు పానపట్టములతో కూడి ఉండటం చూసి ఒక లింగమును వెలుపలకి తీసాడు. ఈ వృత్తాంతమును మహారాజుకు తెలియచేయగా, ఆ మహారాజు విశ్వసించి ఆ సరోవరములో ఉన్న మరికొన్ని లింగములను కూడా బయటకుతీయించి వాటికి ఆలయములు కట్టించి ప్రతిష్ఠలు చేయించాడు.

ఆ సమయమునందు నూటఒక్క శివాలయములు కట్టించినట్లు ప్రజలు చెప్పుకొంటున్నప్పటికీ నేడు అన్ని దేవాలయముల గుర్తులు కనిపించవు. కొన్ని ఆలయముల పునాదులు మాత్రము ఉన్నవి. అక్కడ శివాలయములు ప్రతిష్ఠ చేయించిన కాలమునందు ఆ సరోవరమున కోటిలింగములు ఉన్నవి అని ప్రసిద్ధి కెక్కడము చేత అక్కడ ఒక గ్రామము నిర్మాణం చేయించారు. ఆ గ్రామమునకు కోటి అనే వాడిక అయినది. ఆ గ్రామస్థులందరూ కలిసి ఆ శివాలయములో నైవేద్య, సంధ్యాదీపములు నిర్వహిస్తూ ఉండేవారు.

ఇది జరిగిన కొన్నాళ్లకు అన్నాలదేవు అనే ప్రభువు అఖండగౌతమి మొదలుకొని తూర్పుకోనసీమ పర్యంతం ప్రభుత్వం చేసే కాలమందు పైన చెప్పిన కోటి గ్రామమువద్ద విశాలమైన ఒక కోట కట్టించాడు. ఒక శిధిలమైన శిద్దేశ్వరుని శివాలయమును బాగుచేయించాడు. దాని ధూపదీపనైవేద్యములకొరకు కొంత భూమిని ఏర్పాటుచేసినాడు. ఆ చుట్టుపక్కల అడవిని సాగుభూములుగా మార్చి, రైతులు పంటలో సంగోరుభాగం (సగభాగం) ఉంచుకొనేలా ధర్మకవుళ్ళు జమీను చేసి ఆ గ్రామమును వృద్ధిచేసారు.

ఈ కోటి గ్రామం ఈశాన్యంవైపున రెండు క్రోసుల దూరంలో కోరుకొండ అని ఒక కొండ ఉన్నది. దీనికి సమీపములో మరిఒక చిన్నకొండకలదు. దీనిలో రెండు గుహలు ఉన్నాయి. ఇవి ఐదు అరలుగా ఉండి ఒక్కొక్క అరలో అయిదుగురు ఆరుగురు వ్యక్తులు తలదాచుకొనే విధంగా ఉన్నవి. ఈ గుహలకు ఇరవై బారల దూరంలో మరిఒక పెద్దగుహ ఉన్నది. దీనిలో ఏడుగురు మనుషులు ఉండటానికి సదుపాయంగా ఉంటుంది. ద్వాపరయుగములో పాండవులు అరణ్యవాసమునకు వచ్చినపుడు ఈ గుహల[3]లో నివసించేవారని జనులు చెప్పుకొంటూఉన్నారు.

---

3. ఈ గుహలు బౌద్ధసన్యాసులుండిన మఠం అని, కోరుకొండ ఆలయం ఉన్న ప్రాంతం పూర్వం బౌద్ధ ఆరామం కావొచ్చునని, 11,12 శతాబ్దాలలో బౌద్ధంపై జరిగిన దాడులలో అవి ప్రాభవాన్ని కోల్పోయి ఉంటుందనే అభిప్రాయం ఒకటి ఉంది రి. Journal of Andhra Historical Research Society July 1928 p.no 85

కోరుకొండ అనే పర్వతమునకు ఉత్తరభాగమున అతి పురాతనమైన ఒక సరోవరం కలదు. పూర్వకాలమున పారాశర్యుడు అనే మహారుషి కోరుకొండ పర్వతముపై ఆ సరోవరతీరమందు తపస్సుచేసుకొంటూ నివాసము ఉండేవాడు. అందువలన కోరుకొండ అనే పర్వతమునకు పారాశరశైలము అనే పేరుకూడా కలదు. కొన్నినాళ్ళతరువాత కోరుకొండ పర్వతముపై ఒక గ్రామము కట్టి దానిని కోరుకొండగా పిలుచుకొంటున్నారు.

ప్రతాపరుద్రదేవ మహారాజు తన హయాంలో ఈ ప్రాంతములో బలమైన దుర్గం నిర్మాణం చేయాలని సంకల్పించాడు. వారి ప్రతినిధులైన పెదమల్లరాజు, చినమల్లరాజులు కోరుకొండకు నాలుగు ఆమడల దూరంలో రాజపూడి గ్రామం సమీపములో ఉన్న కొండలను ఆసరాగా చేసుకొని గృహములు కట్టించుకొని అక్కడనుండి పాలన చేసారు. వీరిద్దరి పాలనలో ప్రజలు అనేక కష్టాలు పడ్డారు. రైతులు పండించిన పంటలో సగభాగం శిస్తులక్రింద తీసుకోవటమే కాక మిగిలిన సగభాగాన్ని కూడా బలవంతంగా గుంజుకొనేవారు. బ్రాహ్మణులకు ఇచ్చిన మాన్యాలకు కూడా శిస్తులు వసూలు చేసేవారు. (వీటికి శిస్తుమినహాయింపు లేదా స్వల్పశిస్తులు ఉంటాయి). పన్నులు కట్టని రైతుల నుండి వ్యవసాయపనులు జరిగేకాలములో దుక్కిటెద్దులను బలవంతంగా తోలుకుపోవటం, రైతులు పండించుకొనే కూరగాయలు, పండ్లను సైతం లాక్కోవటం, అడవులలో సేకరించిన వస్తువులను గ్రామాలలోకి తెచ్చి అమ్ముకొనే గిరిజనులనుండి నగరిసుంకము పేరిట వారిని పీడించటం లాంటి పనులవల్ల ప్రజలు తిరుగుబాటు చేసి వ్యవసాయం చేయటం మానేసారు. చాలామంది ఊరువిడిచి వెళ్లిపోయారు.

ఈ విషయాలను తెలుసుకొన్న ప్రతాపరుద్రదేవ మహారాజు పూర్వము అన్నిలదేవు రాజు ఏవిధమైన పరిపాలనా అమరికలు చేసారో వాటిని పునరుద్ధరించాడు. ఆ వివరాలను కోటి సిద్దేశ్వరుని ఆలయం యొక్క స్తంభానికి శిలాశాసనం వ్రాయించాడు. ఆ స్తంభాన్ని ఆ తరువాత తీసుకొని వచ్చి కోరుకొండ నరశింహస్వామి కల్యాణమండప స్తంభంగా నిలిపారు.

ఆ శాసన సారాంసం ఇలా ఉంది. "క్రీశ. 1322, దుందుభి నామ సంవత్సరం పుష్యమాసంలో కాకతియ ప్రతాపరుద్రమహారాజులు– పన్నువసూలు చేసే సామంతరాజు రాచపాలు (ప్రభుత్వవాటా) తీసుకొనగా మిగిలినది రైతులు ఉంచుకొనేటట్లు; బ్రాహ్మణ మాన్యములకు నాలుగవభాగము మాత్రమే శిస్తు

చెల్లించేటట్లు; ఆడమనిషి సుంకము తొలగించేటట్లు; దుక్కిటెడ్లను స్వాధీనం చేసుకోకుండా ఉండేటట్లు; దొమ్మరవాండ్లకు తలకు ఆరు వీసాల (ఒక వీసము రూపాయిలో పదహారో వంతు) చొప్పున ఇచ్చేటట్లు; కరణం రాతినాగయకు శిస్తులో దక్కాల్సిన వాటా ఊరికట్టుబాటు ప్రకారం నడిపించేటట్లు– ఏర్పరచినారు. దీనికి ప్రజలు అంగీకరించి మల్లరాజు వార్కి ప్రజాపణం (లోబడి ఉండుట) చేస్తూ ఉండిరి".



కోరుకొండకు తూర్పున నాలుగు ఆమడల దూరంలో బెండపూడి అనే చిన్న పల్లె కలదు. ఆ పల్లె చుట్టూ పెద్దపెద్ద కొండలు ఉన్నాయి. ఒక కొండపై పటిష్టమైన ప్రాకారముతో, విశాలమైన కోటను కట్టించినారు. ఆ కొండకు ఉత్తరం వైపున ఒక చెరువు తవ్వించి, ఆ నీటిని కోటలోకి వచ్చేలా ఒక సొరంగము ద్వారా తీసుకువచ్చి కోటలో ఉన్న ఒక నూతిలో పడేలా ఏర్పాటు చేసారు. ఆ కోటను నిర్మించేటపుడు వేలకొలది పనివాళ్లు పనిచేసేవారికోసం, ఒక చతురస్రా కారములో ఉండే ఒక పెద్ద రాతి తొట్టిలో మజ్జిగ కలిపిన అంబలి నింపేవారు. ఆ అంబలిని కూలిజనం అంతా ముంతలతో ముంచుకొని తీసుకొని తాగి పనిచేసే వారు.

ఈ దుర్గములో పెదమల్లరాజు, చినమల్లరాజులు నివసిస్తూ కాకతిరుద్రుని వాని తరపున ఈ ప్రాంతమును ఏలుతూ ఉండేవారు. పెదమల్లరాజు బావమరిది వెన్నెలరాయుడు ఈ దుర్గానికి కొంతదూరములో ఒకచిన్న గుట్టపై ఒక మేడ కట్టుకొని దానిలో నివసిస్తూఉండేవాడు. ఇతను అతి సుకుమారుడు. వెన్నెలలో కొంతదూరము నడిచినంతనే వడదెబ్బతగిలినట్టు ఆయాసము వచ్చేదట. అందువల్ల ఇతనిని వెన్నెల రాయుడు అని ప్రజలు పిలుచుకొనేవారు. ఇతను నివసిస్తున్న గుట్టను వెన్నెలరాయునిగుట్ట అని వాడిక పడింది.

ఈ ప్రకారము నడుస్తూ ఉండగా, కటకపురి సింహాసనస్థులైన గజపతి రాజుల యొక్క బంధువు గోవిందరాజు అనే ఆయన తన కుమారుని వివాహం కొరకు కటకపురినుండి కొండవీడు వెళ్ళి అక్కడ వివాహంకావించి తిరిగి స్వగృహానికి వెళ్లుతూ బెండపూడి వద్ద వేలాదిమంది అనుచరులతో మజిలీచేసాడు.

పెండ్లికుమార్తె అపురూప సౌందర్యవతి అని ఆనోటా, ఈనోటా తెలుసుకొన్న పెదమల్లరాజు తమ అతిధిసత్కారములను స్వీకరించవలసినది అని గోవిందరాజును

తమ దివాణమునకు ఆహ్వానించాడు.  గోవిందరాజు కొత్తపెళ్ళికొడుకు, పెళ్ళి కూతురు ఇతర బంధుమిత్రగణంతో బెండపూడి దుర్గము వచ్చాడు.  వారికి పెదమల్లరాజు తగిన కట్నకానుకలు, నూతన వస్త్రములు, పాత్రలు బహూకరించి మర్యాదలు చేసాడు. వారందరి పల్లకీలను కోటదాటనిచ్చి పెండ్లి కుమార్తె సవారీని కోటదాటనివ్వకుండా కోటతలుపులు మూయించాడు. కోటబురుజులపై ఫిరంగులు[4] బిగించి, కోటలోని సిబ్బందికి మందుగుండు సామాన్లు ఇచ్చి యుద్ధానికి సిద్ధమయ్యాడు పెదమల్లరాజు.  గోవిందరాజు అతని బృందం కొద్దిసేపు యుద్ధం చేసి కోట దుర్భేధ్యంగా ఉండుటచే తిరిగి తమ గుడారాలలోకి వెళ్ళి పోయారు.

ఆ తరువాత జరిగిన విషయాన్ని చెప్పమని గోవిందరాజు కొంతమంది మనుష్యులను కటకమునకు పంపాడు. కటకము నుండి వచ్చిన సైనికుల సహాయముతో గోవిందరాజులు బెండపూడి దుర్గమును వశపరచుకోవటానికి శక్తియుక్తులా ప్రయత్నించాడు. ఎన్నిరోజులు పోరాడినా  దుర్గమును సాధించలేక పోయారు. ఇంటి స్త్రీ ని పరులకు అప్పగించి స్వస్థలానికి పోవటం అవమానమని తలచిన గోవిందరాజు బెండపూడిలోనే ఒక గుడారము వేసుకొని ఉంటూ ఎప్పటికైనా కోటను వశపరచుకొని తన కోడలిని తీసుకువెళ్ళాలనే పంతం పట్టుకొని అవకాసం కొరకు ఎదురుచూసేవాడు. ఇలా కొంతకాలము గడచినది. పెద మల్లరాజు కోటలో బంధించిన చిన్నది గర్భవతి ఐనది.

గోవిందరాజు ఒకనాడు దుర్గము చుట్టుఉన్న అడవిలో మేకలు మేపు కొంటున్న ఒక గొల్ల స్త్రీని ఈ దుర్గములోకి వెళ్ళే రహస్యమార్గము గురించి తెలుపమని అడిగాడు.  అపుడామె అలా చెపితే మా ప్రాణాలు నిలుస్తాయా అని భయపడగా, ఆమెకు ధనము, భూములు ఇస్తానని అభయం ఇచ్చి, బెండపూడి

---

4. బెండపూడి కోటపై ఫిరంగులు, గన్ పౌడర్ ప్రసక్తి ఆసక్తికరం. ఇండియాకు గన్ పౌడన్‌ను బాబర్ క్రీశ. 1526లో ప్రవేశపెట్టినట్లు చరిత్ర చెపుతుంది. కానీ ఇండియాలో అప్పటికే గన్ పౌడర్ వాడకం ఉన్నట్లు కొన్ని ఆధారాలు కనిపిస్తున్నాయి.

1.క్రీశ. 1221లో మంగోల్స్ ద్వారా ఇండియాకు గన్‌పౌడర్ వచ్చింది 2. చైనా నుంచి నార్త్ ఈస్ట్ రాష్ట్రాల ప్రజలు క్రీశ. 1300 నాటికే గన్ పౌడర్‌ను తెచ్చుకొని వాడటం, తయారుచేయటం చేసారు. 3.విజయనగర పాలకులు క్రీశ. 1366లో Top o Tufak పేరుతో గన్ పౌడర్‌ను వాడేవారు.

దుర్గంలో ఉన్న సైన్యం వివరాలను, వారి ఆహారనిల్వలు, నీటి సదుపాయం వంటి రహస్యాలను తెలుసుకొన్నాడు.

దుర్గములో ఉన్న వ్యక్తులకు తాగునీరు ఉత్తరభాగములో ఉన్న చెరువు లోంచి ఒక తూము ద్వారా దేవిడిలోకి పారుతుంది. గోవిందరాజులు ఆ నీటి మార్గమును కనిపెట్టి ఆ తూమును గడ్డిగాదముతో మూయించి దుర్గములోకి నీరు వెళ్లకుండా చేసాడు. కొద్దిరోజులు గడిచాకా కోటలోని సిబ్బంది నీటిఎద్దడి తట్టుకోలేక ఒక్కొక్కరూ కోటవిడిచి వెళ్లిపోవటం మొదలెట్టారు. ఇదే అదునుగా భావించిన గోవిందరాజులు తన మనుషులను కూడదీసుకొని కోటను ముట్టడించి స్వాధీనం చేసుకొన్నాడు. పెదమల్లరాజు, చినమల్లరాజులను ఇంకా కోటలోని శిశు,బాల వృద్ధులను పట్టుకొని తలలు తీయించాడు. కోటను పాడుపడ కొట్టించాడు. కోటబురుజులు, గోడలు జీర్ణమై శిథిలమైనాయి. ఆ తరువాత క్రమంగా దుర్గం వెలుపల విస్తారమైన గ్రామము పాడుపడినది. నేడు కోటకు చెందిన తూర్పు దర్వాజా తలుపులు లేకుండా పడిఉన్నది. కోట చుట్టూ ఉండిన కందకము పూడుకొని పోయి పల్లముగా ఆనవాలు తెలుస్తున్నది. కోటగోడ శిధిలాలు ఇంకా ఉన్నవి.



ప్రతాప రుద్రగజపతి మహారాజు అనంతరం కూనారెడ్డి అనే చతుర్ధాన్వయుడు (శూద్రుడు) కోరుకొండ గ్రామమును విస్తారమైన పట్నముగా అభివృద్ధి చేసి అక్కడ ఒక కోట నిర్మించి దానిలో నివాసముంటూ గోదావరి తీరము మొదలు కోనసీమ పర్యంతమూ మహా వైభవముతో ప్రభుత్వము చేస్తూ ఉండిరి.

ఈ కూనారెడ్డి కుమారుడు ముమ్మడిరెడ్డి అనే ఆయన శత్రుభయంకరుడు, మహా పరాక్రమవంతుడుగా పేరు తెచ్చుకొని ప్రజారంజక పాలన సాగించాడు. కాటమరెడ్డి సోదరి కుమార్తెను వివాహమాడి ఈ ప్రాంతానికి రాజప్రతినిధిగానే కాక స్వతంత్ర్యంగా కూడా తన ప్రాబల్యాన్ని మరింత పెంచుకొన్నాడు. ఆపన్నులకు అభయదాతగా, దీనులకు రక్షకునిగా, పెద్దలయడల గౌరవప్రపత్తులు కలిగిన వాడిగా ఈ ముమ్మడిరెడ్డి భూపాలుడు మిక్కిలి వినుతికెక్కాడు. అనేక దుర్గములను జయించాడు. విశేషమైన గజ, తురంగ బలగములతో గొప్ప సైన్యము కలిగి ఉండేవాడు. ముమ్మిడిరెడ్డి భూపాలుడు కోరుకొండను రాజధాని చేసుకొని పరిపాలన సాగించాడు.

ఈ ముమ్మడిరెడ్డి తమ్ముళ్లయిన శింగారెడ్డి కోనసీమను, కన్నారెడ్డి అనే ఆయన తాటిపాక నగరమును, కొమానపల్లి అనే గ్రామమును రాజధానిగా చేసుకొని నివసిస్తూ ప్రభుత్వము చేస్తూఉండేవారు. ముమ్మడిరెడ్డి భూపాలుడు దానధర్మములవల్ల, ఆశీర్వచనములవల్ల గొప్ప యశస్సును గడించాడు.

ఈయనకు కూనారెడ్డి, కాటమరెడ్డి, రామారెడ్డి మొదలైన అయిదుగురు కుమారులు కలరు.

ఒకనాడు భట్టరి[5] అనే ఒక ఆళ్వారు ముమ్మడిరెడ్డిని కలుసుకొని తాను విష్ణుమూర్తి అవతారము అని, త్వరలో ఈ మనుష్యదేహమును చాలించి శ్రీ లక్ష్మీ నృశింహమూర్తిగా కోరుకొండ పర్వతముపై ఆవిర్భవించబోతున్నాను అని, ఆ సమయమందున ప్రజలకు నక్షత్రదర్శనము కాగలదని చెప్పాడు. ఆ మహత్కార్యం కొరకు ముమ్మడిరెడ్డి ఎదురుచూస్తూ ఉన్నాడు

ఇంతలో కోరుకొండలో నివసిస్తున్న ఒక గొప్ప వైష్ణవభక్తురాలు అయిన దాశీలక్ష్మి అనే స్త్రీకి స్వప్నములో భట్టరి ఆళ్వారు దర్శనమిచ్చి తాను దేహాన్ని చాలించి పారాశరశైలమందు (కోరుకొండ) శ్రీలక్ష్మినృశింహమూర్తిగా వేంచేసి ఉన్నానని తెలియపరచాడు. అంతట ఆ దాశీలక్ష్మి తన స్వప్న వృత్తాంతమంతా ముమ్మడిరెడ్డికి తెలిపింది. ముమ్మడిరెడ్డికి కూడా పూర్వము భట్టరి ఆళ్వారు చెప్పిన విషయం గుర్తుకువచ్చింది. దాశీలక్ష్మి ముమ్మడిరెడ్డి అనుమతి తీసుకొని కోరు కొండపై వెతుకగా మూడుజానలు పొడవు ఉన్న లక్ష్మీసమేతుడైన నృశింహ స్వామి స్వయంభు విగ్రహము ఒకటి కనిపించింది. దానిని కోరుకొండయందు శాస్త్రోక్తముగా ప్రతిష్ఠ చేయించి ఆలయనిర్మాణము కావిస్తానని అని ఆమె కోరగా ముమ్మడిరెడ్డి

---

5. భట్టరులు శ్రీరంగానికి చెందిన ఆళ్వారులు. ఈ వంశానికి చెందిన మూలపురుషుడు శ్రీ రామానుజుని వద్ద శిష్యరికం చేసాడు. ఈ వంశంలోని ఏడవఆళ్వారైన పరాశర భట్టు ఆంధ్రదేశానికి వచ్చి కోరుకొండలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. ఇతను ముమ్మడినాయకునికి ఆధ్యాత్మికగురువు. ఇతనికి ముమ్మడినాయకుడు కొట్టాలపర్రు అనే గ్రామాన్ని మాన్యంగా ఇచ్చాడు. పరాశరభట్టు కోరుకొండలోనే చనిపోయాడు. అతని తల్లి అప్పటికి బ్రతికి ఉన్నది. అతనికి ఇచ్చిన కొట్టాలపర్రు గ్రామాన్ని ఆమె అనుభవించకుండా కొంతమంది బంధువులు ఆటంకపరచటంతో, ఆమె ఆ గ్రామాన్ని శ్రీరంగనాథునికి దానం ఇచ్చినట్లు శ్రీరంగనాథుని ఆలయంలో లభిస్తున్న ఒక తామ్రపత్రం ద్వారా తెలుస్తున్నది. రి. History of The Reddi Kingdoms by Sarma, M. Somasekhara P.no 314

అనుజ్ఞ ఇచ్చాడు. దాశీలక్ష్మి కోరుకొండ కొండపై నృశింహస్వామి ఆలయమును నిర్మించి ఆలయగోడలపై రామరావణ యుద్ధము, భారతములోని కొన్ని ఘట్టములను, దశావతార, అష్టదిక్పాలకుల రూపములనును మొదలైన అనేక శిల్పములను చెక్కించినది[6]. ముమ్మడిరెడ్డి ఆ ఆలయమునకు పువ్వులుపాడు, పెంటపల్లె అనే గ్రామములను స్వామివారి నిత్యపూజలకొరకు సమర్పించి ఆ గ్రామములనుండి వచ్చు ఆదాయమును దేవాలయమునకు చెల్లించేలా ఏర్పాటు చేసాడు. ఆ విధముగా ఏర్పాటుచేసిన వసతులవల్ల నిత్యోత్సవాది సమస్తభోగములు, ప్రతి సంవత్సరము పాల్గుణమాసములో శ్రీస్వామివారికి కల్యాణ మహోత్సవములు జరుగుతున్నవి.

ప్రతిష్ఠ సమయమునందు దాశీలక్ష్మి కోవెలలోని దివ్యసుందర ఉత్సవ విగ్రహమునకు ఆభరణములు, మకరతోరణములు, శఠగోపము, ఆరాధనా సామాగ్రి చేయించి సమర్పించినది. దిగువనుండి కొండమీదకు వెళ్లటానికి మెట్లనిర్మాణము గావించినది. శ్రీ స్వామివారి కొండకు ఉత్తరభాగమునందున ఉన్న సరోవరం పూడుకుపోయినందున ముమ్మడినాయకుడు ఆ సరస్సు పూడిక తీయించి పెద్దచెరువు తవ్వించినారు. ఆ చెరువునీరును పారించి అనేక భూములు సాగులోకి తెచ్చారు.

కొండ దిగువన దాశీలక్ష్మి దిగువతిరుపతి నరశింహస్వామి దేవాలయమును కట్టించి ప్రతిష్ట చేయించినది. ముమ్మడి రెడ్డి కుమారుడు కూనారెడ్డి స్వామికొండకు దక్షిణ భాగముమందు దిగువన రంగనాయకుల దేవాలయము కట్టించి ప్రతిష్ట చేయించినాడు. ఆలయప్రాంగణములోనే వైభవరాయుని ఆలయం, కేశవస్వామికి ఒక ఆలయం కట్టించాడు. వాటి నిత్యపూజల కొరకు భూములు మాన్యం చేసినాడు. అలాగ అన్ని దేవాలయములలోను ఉత్సవములు అంగ రంగ వైభవముగా జరుగుతూండేవి.

ముమ్మడిరెడ్డి తరువాత ఆయన కుమారుడు కూనారెడ్డి కోరుకొండను పట్టణముగా చేసికొని పాలించినాడు. కూనారెడ్డి తరువాత ఆయన తమ్ముడు

---

6. కోరుకొండ ఆలయం విజయనామ సంవత్సరం, క్రీశ. 1353 లో నిర్మించబడిందని శాసనముల ద్వారా తెలుస్తున్నది. గర్భగుడి ద్వారానికి ఇరువైపుల దాశీలక్ష్మి, ముమ్మడినాయకుని శిల్పాకృతులు ఉన్నవి. రి. Portrait Sculpture in South India, By T. G. Aravamuthan pn 42.

కోరుకొండ ఆలయప్రాంగణంలోని ఒకస్తంభంపై ఉన్న సంస్కృతశాసనము ద్వారా, పైన చెప్పిన భట్టరి ఉదంతం, ఆలయ నిర్మాణ వివరాలు, ముమ్మడినాయకుని వంశావళి తెలుస్తున్నవి. రి. South Indian Inscriptions - No. 554

అన్నారెడ్డి (అనవేమారెడ్డి), ఈయన తరువాత ఆయన తమ్ముడు కాటమరెడ్డి రాజ్యపాలన చేసారు. అలా ముమ్మడిరెడ్డి కుమారులు నలభై సంవత్సరములు పరిపాలించారు. ఆ తరువాత కూనారెడ్డి కొమారుడు ముమ్మడి నాయకుడు రాజుగా ఉన్నప్పుడు ఆయనవద్ద సహాయకులుగా బిడుపన శింహాద్రిశెట్టి, వొబిలిశెట్టి అనే ఇద్దరు కార్యకర్తలు ఉండేవారు.

క్రీశ. 1393 శ్రీముఖనామ సంవత్సరంలో కోరుకొండ పట్టణమునందున్న శ్రీరంగనాయకులఆలయం శిధిలమైపోగా, ముమ్మడినాయకుడు జీర్ణోద్ధరణ గావించాడు. మండప,గోపురాదులను నిర్మించాడు. వైభవరాయుని, శ్రీనృశింహ స్వామి, కేశవ పెరుమాళ్లు ఆలయములకు వృత్తులు ఏర్పరచి భూములను మాన్యముగా ఏర్పాటుచేసి నిత్యఉత్సవములు జరిగేలా చూసాడు.

క్రీశ. 1393 శ్రీముఖనామ సంవత్సరం మార్గశిరమాసములో బిడుపన బిల్లిశెట్టి కుమారుడు సింహాద్రిశెట్టి, అన్నిశెట్టి కుమారుడు వొబిలిశెట్టిలు తమ తల్లిదండ్రులకు పుణ్యం కలగాలని భూములను, తోటలను స్వామివారికి సమర్పించి ఆ ప్రకారము ఒక శిలాశాసనమును వ్రాయించినారు. ఇది రంగనాయకుల కోవెల ఎదుట పాతి ఉన్నది.

ఆ తరువాత కాటమరెడ్డి కుమారుడు మారారెడ్డి, ఆయన కుమారుడు వేమారెడ్డి  కొండవీడు మొదలుకొని తూర్పు కోనసీమ పర్యంతం ప్రభుత్వం చేస్తూ ఉండిరి. వీరు కోరుకొండలో నివాసము చేసుకొనలేదు. వేమారెడ్డి తాలూకు కొంతసిబ్బంది కోరుకొండ పర్వతమునకు దక్షిణమున ఉన్న కోటలో ఠాణా ఉండేవారు. కోరుకొండ ఆలయములకు యధావిధిగా వీరు వసతులు నడిపించే వారు. వేమారెడ్డి కోరుకొండ పట్నమునకు నైరుతుభాగమునందున ఉన్న తొర్రేడు అనే గ్రామమునకు చెందిన మజరాపల్లె, మధురపూడి అనే పల్లెలకు  కొమరగిరిపురమని పేరు పెట్టి, తమ స్వామి కొమరగిరిరెడ్డి[7] గారికి శుభం కలగాలని ఆ గ్రామమును శ్రీ వేదాద్రి నారశింహదేవరకు భోగముగా సమర్పణ చేసినట్లు  క్రీశ. 1394 సంవత్సరములో ఒక శాసనము వ్రాయించినారు.

---

7. కాటయవేమారెడ్డి కొమరగిరి రాజుకు సామంతరాజుని అని చెప్పుకొంటున్నాడు ఇక్కడ. అంటే వేమారెడ్డి కాలమునాటికే కోరుకొండ రాజ్యం తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి కొమరగిరి రెడ్డి రాజుల రాజ్యంలో కలసిపోయింది. ఆ తరువాత కోరుకొండ రాజ్యం కొండవీటి రెడ్లరాజ్యంలో కలిసిపోయింది. రి. History of The Reddi Kingdoms by Sarma, M. Somasekhara P.no 35

ఆ తరువాత వేమారెడ్డి తన వద్ద ముఖ్యాశ్రితుడయిన చివుకుల మాధవభట్టు అనే ఆయన అగ్రహారము యాచించగా, తొర్రేడు అనేగ్రామమును అతనికి సర్వభాధా పరిహారముగా క్రీశ.1405 పార్థివనామసంవత్సరం పాల్గుణమాసంలో జానెడు పొడవు ఉన్న తామ్రఫలకముపై దానపత్రం ఇచ్చాడు. ఆ గ్రామము నేటికీ పిఠాపురంలో నివసిస్తున్న మాధవభట్టు వంశీయులైన చివుకుల వీరయ్య స్వాధీన భుక్తముగా నున్నది.

ఆ తరువాత కటకపుర రాజధానిగా చేసుకొని కపిలేశ్వర గజపతి, ఆయన కుమారుడు పురుషోత్తమ గజపతి తదనంతరం ఆయనకుమారుడు ప్రతాపరుద్ర గజపతి ఈ ప్రాంతమును పాలించారు. క్రీశ.1515 యువనామ సంవత్సరంలో విద్యానగర నరపతి (విజయనగర రాజు) శ్రీ కృష్ణదేవరాయలు ఈ ప్రాంతమును జయించి ప్రతాపరుద్ర గజపతి కొమార్తెను వివాహం చేసుకొని పొట్టునూరు వద్ద శిలాశాసనములు నిలిపి తిరిగి విద్యానగరమునకు తరలిపోయెను.

ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రగజపతి[8] ఏలుబడిలో అఖండ గౌతమీ తీరమంతా చాలాకాలం నడిచింది. తరువాత గోల్కొండ తానీషా వారి

---

8. కపిలేంద్ర గజపతి గంగనుండి కావేరి వరకూ గజపతి రాజ్యాన్ని స్థాపించి 1434-66 వరకూ కటక్‌ను రాజధానిగా చేసుకొని పాలించాడు. ఇతని కుమారుడు పురుషోత్తమ గజపతి క్రీశ.1466-97 వరకు రాజ్యం ఏలాడు. ఇతని తరువాత ప్రతాపరుద్రగజపతి క్రీశ.1497-1540 వరకూ పాలించాడు. ప్రతాపరుద్రుని కొడుకు వీరభద్ర గజపతి కొండవీడును రాజధానిగా చేసుకొని క్రీశ.1497-1515 వరకూ 18 సంవత్సరాలు పరిపాలించాడు.

కృష్ణదేవరాయలు క్రీశ.1516 లో కొండవీడుని జయించినపుడు కొండవీడు కోటలో ఉంటున్న ప్రతాపరుద్రుని రాణిని, వీరభద్రగజపతిని ఇంకా మరికొంతమందిని బంధీలుగా తీసుకుపోయాడు. వీరిలో వీరభద్ర గజపతి ధైర్యసాహసాలను కృష్ణ దేవరాయలు గుర్తించి ఒకనాడు - వీరభద్రగజపతిని కత్తి విన్యాసాలను ప్రదర్శించమని కోరినట్లు, అతనికి ప్రత్యర్థిగా తక్కువ స్థాయి వ్యక్తిని చూపినందుకు అవమానంగా భావించిన వీరభద్రగజపతి కత్తితో పొడుచుకొని చనిపోయాడని Nuniz వర్ణించాడు. (ఈ కథనాన్ని రాయవాచకానికి ముందుమాట వ్రాసిన జయంతిరామయ్య పంతులు విభేదించారు).కొడుకు మరణించటం, భార్య బంధీగా ఉండటంతో ప్రతాపరుద్ర గజపతి కృష్ణదేవరాయలులో ఏడేళ్ల పాటు సాగించిన యుద్ధాన్ని విరమించి సంధి కుదుర్చుకొని, తన కూతురుని ఇచ్చి వివాహంచేసి భార్యను, ఇతర బంధీలను విడిపించుకొని ఒరిస్సా వెళ్ళిపోయాడు. ఈ ఒప్పందం ద్వారా గజపతులరాజ్యానికి, విజయనగర రాజ్యానికి కృష్ణానదిని సరిహద్దుగా నిర్ణయించుకొన్నారు.

తరపున అల్లూకొల్లీ ఖానుడు అనే సుబేదారు వచ్చి రాజమహేంద్రవరంలో నివాసం ఉంటూ కోరుకొండను కూడా పాలించాడు.

ఆ తరువాత వచ్చిన తురకాణ్యములో వడ్డాది శరభన్న అనే బ్రాహ్మణుడు కోరుకొండ పరగణా అధికారములను పొందాడు. ఇతను, కాపవరం, గుములూరు, గాడాల, బూరుగపూడి, గండెపల్లి, మురావి, మల్లెపల్లి, కలపచర్ల, శ్రీరంగపట్నం, ములగాడ, కూణువరం, కోట, కేసవరం, రహితాపురం, శీతానగరం, ముగ్గుళ్ళ, రాపాక, మునికొడవలి లాంటి గ్రామాలను కౌలుకు తీసుకొని వ్యవహారాలను నడిపిస్తూండేవాడు. కొంతమంది పన్ను వసూలు అధికారులు అయిదువేల వరహాలు బాకీపడినప్పుడు, వారిని తొలగించి అంగర చినపంతులు అనే ఆయనకు బాధ్యతలను అప్పగించి, అధికారం తనవద్దే ఉంచు కొన్నాడు వడ్డాది శరభన్న. ఇటికాయపల్లి గ్రామస్తుడయిన వడ్డాది శరభన్న దస్తుకు (డబ్బు వసూలుకు) వెళ్ళినపుడు ఇతని శత్రువులు కొందరు పొడిచి హత్యచేసారు. ఆ పిమ్మట ఇతని అనుచరునిగా పనిచేసిన అంగర చినపంతులు కోరుకొండ పరగణాకు జమీనుదారుడయి ప్రభుత్వము వారికి కౌలు చెల్లించు కొంటూ నాలుగు సంవత్సరములు వ్యవహారం చేసారు.

ఆ తరువాత విన్నమండ జమిందారులయిన మందపాటి తిరుపతి రాజు, రఘునాథరాజు అనే ఇద్దరు అన్నదమ్ములు కోరుకొండ పరగణా కౌలును గోలుకొండ ప్రభువునుండి పొందారు. వీరు ఈ పరగణా తాలూకు డబ్బులు సర్కారు వారికి బాకీపడగా, సల్లస్కరుడు (ముస్లిం సైన్యాధికారి) వారిని పిలిపించి నపుడు జరిగిన గొడవలలో తిరుపతిరాజు చనిపోయాడు. రఘునాథరాజు కోరుకొండవిడిచి పారిపోయాడు. ఆరునెలల తరువాత ఇతను రహితా పురమన పూర్వము వేమారెడ్డి కట్టించిన ఒక చిన్న కోటలో సర్కారువారితో సంప్రదింపులు జరిపి వారి సలహాతో మరలా కోరుకొండ పరగణాను సంపాదించు కొన్నాడు. కొంతకాలానికి రఘునాథరాజు మరణించగా ఆయన కుమారుడైన తిరుపతిరాజుకు హసనవల్లిఖానుడు జమిందారీ ఇప్పించాడు. ఈ తిరుపతిరాజు నలభై సంవత్సరములు దొరతనం చేసి కాత్రేవుకోనలో చని పోయాడు. ఇతని హయాంలో రహితాపురం కోటను విస్తరించి పెద్దగా కట్టించాడు. తిరుపతి రాజు కుమారుడు రఘునాథరాజు

జమిందారీ దక్కించుకొని మూడు సంవత్సరములు పాలించి మరణించాడు. ఈయనకు సంతానం లేదు కనుక పరగణా మొత్తమును కంపనీ వారు స్వాధీనము చేసుకొని ప్రభుత్వం చేస్తూ ఉన్నారు.

కోరుకొండ గ్రామములో వేంచేసిన శ్రీనరశింహస్వామివారికి వేమారెడ్డి మొదలుకొని ధూపదీపనైవేద్యములు నడుస్తూ ఉండేవి. ఆలయనిర్వహణను శ్రీవైష్ణవ వ్యక్తికి ఇచ్చినప్పటినుండి వారు దీనిని శ్రీవైష్ణవ అగ్రహారం చేసి ఈ స్థలమునందు యాజమాన్యం అట్టిపెట్టుకొన్నారు. అప్పటినుంచి ఆ సహభట్టరి వంశీకులే స్వామి వారి కైంకర్యాదులు గావించేవారు. మందపాటివారి జమీందారీ వచ్చినప్పటి నుండి వారి శక్తికొలది స్వామివారి ఉత్సవములు జరిపించారు. కంపనీ వారి ఆధీనములో అదే ప్రకారం యుక్తంగా జరుగుతూ ఉండేది.

అటుపిమ్మట కొచ్చర్లకోట వెంకట్రాజుగారి ప్రొప్రైటరి వచ్చిన నుండి అగ్రహారం వృత్తులు గ్రామంవారి మనసుకు వచ్చినట్టు నిఘాచేసుకొని వారికి అనుకూలం అయి తోచినట్టు శ్రీస్వామివారికి ఉత్సవములు జరిపిస్తూఉన్నారు.

కోరుకొండ గ్రామానికి పడమటను కాపవరం అనే గ్రామం ఉన్నది. గోల్కొండ నుండి వచ్చిన ఆజహుశేను అనే సల్లస్కరు కోరుకొండ కోటను పడదోయించినాడు. ఆ తదనంతరం కాలక్రమేణా అది శిథిలమైపోయింది. ప్రస్తుతం ఒట్టి కోటదిబ్బమాత్రమే గురుతుగా కనపడుతున్నది. కోటగోడలు మొండిగా జీర్ణమై ఉన్నవి. కోరుకొండ గ్రామం ఆదిలోనే శ్రీ స్వామివారికి ఇవ్వబడింది కనుక స్వామి పూజ చేసే శ్రీవైష్ణవులే క్రమముగా గ్రామానికి కరణీకం, మిరాసి పని చేస్తూ ఉన్నారు. లోగడ ముమ్మడి రెడ్డి ప్రభుత్వములో నిర్మించిన చెరువుకు గండిపడి డబ్బై సంవత్సరములు అయినప్పటికీ ఎవరూ దానిని పునర్నిర్మాణము చేయించనందున అది పూర్తిగా పూడుకుపోయినది.

కోరుకొండ పరగణా గ్రామములలో మామిడితోటలు అనేకం కలవు. మెట్టపొలాల్లో పైర్లు ఫలిస్తున్నవి.



# చామర్లకోట కైఫియ్యతు[1]

చామర్లకోట, భీమవరం తాలూకా, పిఠాపురం మౌంజే, మజుకూరు కులకర్ణి వద్దిపర్తి నీలాచలం వగయిరా వారు వ్రాయించినది...

జంబూద్వీప దక్షణమున త్రిలింగ మధ్యస్తమైవుండే ఆంధ్రదేశంలో ను వేంగీమండలమునందు అఖండగౌతమికి పూర్వభాగమందు పూర్వమున ఈశ్వరపుత్రుడైన కుమారస్వామి తపస్సుచేసే ఒక వనం కలదు. అది కుమార వనంగా ప్రసిద్ధిచెందింది. ఈ వనానికి దగ్గరలో ఉన్న నదిని కుమారనది అని, సరస్సును కుమారసరస్సు అని పిలిచేవారు. కొందరు మునులు ఈ ప్రాంతములో సంచరిస్తూండేవారు కనుక దీనిని మునులతీర్థమని వాసికెక్కినది. ఇచట కొలువున్న మండ నారాయణస్వామి బహుపురాతనమని వాడుక. ఈశ్వరుడు త్రిపురపురాలను బూడిదచేసిన సమయంలో త్రిపురాసురులు ప్రతిష్టించిన ప్రాణలింగము చెక్కుచెదర లేదట. దానిని అయిదు ఖంఢాలుగా చేసి అమరారామ, క్షీరారామ, ద్రాక్షారామ, కుమారారామ, సోమారామా ఆలయాలలో ప్రతిష్టించినట్లు కాశీఖండములో చెప్పబడుచున్నది.

తరువాత చాళుక్యభీమ[2] మహారాజు కుమారారామ భీమేశ్వరునికి భక్తి శ్రద్ధలతో సమస్తభోగములు నడిపించాడు. ఇక్కడా మరియు ద్రాక్షారామ భీమేశ్వరాలయమునందు అయిదువందల స్థంభములుకల మండపములు కట్టించాడు. కుమారరామ భీమేశ్వరాలయం వద్ద అనేక మహళ్ళుతో కట్టించిన నగరానికి చాళుక్యభీమవరం అనే పేరు కలదు. (నేటి సామర్లకోటభీమవరం). దీనికి తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణం వైపుల నాలుగు వాకిళ్ళు ఉండేవి.

---

1. కైఫియ్యతు నంబరు 42-375, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
2. ఇతను మొదటి చాళుక్య భీముడు (క్రీ.శ. 892-921). ఇతను కుమారారామ భీమేశ్వర ఆలయాన్ని నిర్మించాడు. ఈ ఆలయం చుట్టూ ఉన్న ఊరిని చాళుక్యభీమేశ్వర పురం అని పిలిచేవారు. చాళుక్య భీముడు ఇక్కడే నివసించేవాడు. Epigraphica Indica Vol 4 p.no. 227

తరువాత కీర్తిపురమనే పట్నానికి రాజైన ఇంద్రసేనుడు శూద్రరాజు. ఇతనికి కీర్తివర్మ అనే కొడుకు పుట్టెను. ఇతని వంశమందు మల్లవర్మ, ఆయనకు కీర్తివర్మ పుట్టారు. ఈయన పాలనలో, చాణుక్యభీమ నగరానికిగల నాలుగు వాకిళ్ళకు పశ్చిమపు వైపున మారడు, దక్షిణపు వైపున పోతడు, ఉత్తరం వైపున పోతడు అనే నాయకులు ఉండేవారు. కళింగ దేశాన్ని గంగురాజు ఏలేటప్పుడు వేములవాడ భీమకవి అనే కవీశ్వరుడు పశ్చిమ ద్వారంగుండా చాళుక్య భీమవరంలో ప్రవేసించబోతే అక్కడ కాపలా కాసే మండడు అనే బంటు అతనిని పట్టణములోకి వెళ్లకుండా అడ్డగించాడట. అప్పుడు భీమకవికి కోపము వచ్చి ఇలా తిట్టాడట

*కొండిక భీమవరమట*
*గుడాగొయ్యలును గూడి కూహకముల చే*
*బండాయ భీమనగరము*
*మండడు రాకుండగట్టే మడిశెం గిడిచెన్*

భీమకవి దేవి ఉపాసకుడు కనుక ఆ మండడు అనే బంటు తక్షణమే మరణించాడు. కొన్నాళ్లకు చాళుక్య భీమవరం పట్నం కూడా పాడు పడినది.



తరువాత కీర్తివర్మ అనేరాజుకు మల్లవర్మ అనే కుమారుడు కలిగి, అతను అంగ, కళింగ, వంగ, మధుర, ఆంధ్ర, పుళింద, కుంతల, కేరళ, గౌడ, పాండ్య, మరాఠ, లాట, కటక రాజులను జయించి ధ్వనధపురమనే పట్టణానికి రాజైనాడు. ఈయనకు బరియవర్మ అనే కుమారుడు కలిగెను. అతనికి మల్లమహీపతి, అతనికి కుడియవర్మ[3] అనే కుమారుడు పుట్టెను.

చాళుక్య వంశ భూషణుడైనటువంటి విమలాదిత్యదేవమహారాజుకు ఈ కుడియవర్మ అనే రాజు అనేక యుద్ధములలో సహాయపడినందుకు ఇతనికి వేంగీదేశ పాలనను అప్పగించాడు.

3. ఈ వివరాలన్నీ పిఠాపురం కుంతీ మాధవ ఆలయంలో కల ఒక స్తంభంపై కలవు. కుడియవర్మకు విమలాదిత్యుడు 'గుద్రవర ద్వయ" రాజ్యాన్ని ఇచ్చినట్లు ఉన్నది. శాసనాలలో గోదావరి "గుద్రవర" పేరుతో వ్యవహరించబడింది గుద్రవర ద్వయ అంటే గోదావరి రెండు వైపులు అని అర్థం చేసుకోవాలి. అదే శాసనంలో పిఠాపురం పేరు శ్రీపిఠ అని ఉన్నది. Epigraphica Indica Vol IV p.no 39

విమలాదిత్యమహారాజు కొడుకు రాజరాజు, అతని కొడుకు కుళోత్తుంగ చోళరాజు. ఈ కుళోత్తుంగ చోళరాజు (రాజరాజు) నేరుగా వేంగీదేశ పరిపాలన చేపట్టాడు. అయినప్పటికీ పైన చెప్పిన కుడియవర్మను ఆశ్రితరాజుగా కొనసాగించాడు. కుడియవర్మ కుమారుడు యర్రభూపాలుడు. ఇతని కుమారుడు అన్నిరాజు. అన్నిరాజుకు అయిదుగురు కుమారులు. వారు వెదురురాజు, గండరాజు, గొంకరాజు, మల్లరాజు, పండరాజు. వీరిలో గొంకరాజు, కుళోత్తుంగ చోళరాజు కుమారుడైన వీరచోళమహారాజుకి అనుంగుబంటుగా ఉండి ఈ ప్రాంత పాలనా పర్యవేక్షిస్తుండేవాడు. ఈ గొంకరాజు అన్న వెదురురాజు చోళరాజ్య విస్తరణలో సహాయపడినందుకు వీరచోళ మహారాజు పాండ్యదేశానికి అర్ధరాజ్యమిచ్చి గౌరవించాడు.

గొంకరాజుకు చోళరాజు అనే కుమారుడు కలిగెను. ఇతనుకూడా తన పెదనాన్న అయిన వెదురురాజును అనుసరించి వీరచోళమహారాజు సైన్యాధిపతిగా పనిచేసేవాడు. ఇతని వీరత్వాన్ని మెచ్చిన వీరచోళమహారాజు చోళరాజుకు పదహారు వేల వేంగిదేశాలు బహుమతిగా ఇచ్చాడు.

ఈ చోళరాజు భార్యపేరు గుండాంబిక. వీరికి గొంకరాజు అనేకుమారుడు కలిగినాడు. ఈ గొంకరాజు భార్యపేరు సబ్బాంబిక. వీరికి వీరరాజేంద్రచోళుడు అనే కుమారుడు కలిగెను. ఈ వీరరాజేంద్రచోళుడు భీమవరం, ద్రాక్షారామ ఆలయాలయందు కనకమకరతోరణములు, సువర్ణమయమైన శిలాధ్వజ స్తంభాలను చేయించాడు. ఈ దంపతులకు గొంకభూపాలుడు అనే కొడుకు పుట్టెను. గొంకభూపాలునికి పృధ్వీశ్వర మహారాజు కలిగెను. ఇతని తల్లి అయిన జాయాంబిక పితాపురం శ్రీ కుంతీమాధవదేవరకు శ్రీలక్ష్మిదేవి అమ్మవారికి గోపురములు, ప్రాకారములు కట్టించెను. ఈ ఆలయ నృత్యగీత్య భోగాదుల నిమిత్తం పోలునాటిలోని నవకంధవాడ అనే వూరును దానము ఇచ్చినట్లు అదే ఆలయములో శిలాశాసనము[4] వ్రాయించినారు .

4. క్రీశ. 1187లో వేయించిన ఈ శాసనము కుంతీమాధవ ఆలయము తూర్పు ద్వారము ఎదురుగా ఉన్న స్తంభంపై కలదు. నవకంధవాడ నేటి కాంద్రకోట/కొండెవరం కావొచ్చు. ఈ గ్రామానికి సరిహద్దులుగా – తూర్పువైపున పెరవ, నైరుతి వైపున ఇదురవాము, దక్షిణము వైపున సూరెగుండ, పడమరవైపున కొమ్మినాయకుని చెరువు, ఉత్తరము వైపున పుట్టలత్రోవ ఉన్నవని స్పష్టంగా వివరాలు ఉన్నాయి. కానీ ఈ గ్రామనామాలు నేడు వాడుకలో లేవు. శాసనము దిగువన చెక్కిన వ్యక్తి పేరు అయ్య పిల్లార్య, కంఠాచారి శ్రీపితాపురం అని ఉంది. వెలనాడు రాజుల, తూర్పుచాళుక్యుల వంశావళిని నిర్మించటానికి ఈ శాసనము చరిత్ర కారులకు ఎంతో సహాయపడింది.

అంతకు మునుపే, కుమారారామ చాళుక్యభీమేశ్వరుని వాహనములు మోసే బోయీలకు బోయినపూడి అనే గ్రామము దానమీయబడినది. ఆ దేవాలయముపై వాలి అపవిత్రం చేస్తున్న గద్దలు, రాబందులను మట్టిఉండలతో కొట్టి చెదరగొట్టే పనివాళ్లకు "వుండూరు" అనే గ్రామమును దానంగా ఇచ్చారు. దేవాలయ ద్వారము వద్ద కాపలా ఉండేమనుషులకొరకు "కాపవరం" అనే గ్రామం ఉన్నది. దేవుని సమక్షంలో జంగాలు పూరించే జంగాల కొరకు "జంగాలుదొడ్డి" పేరుగల గ్రామం కలదు.



తరువాత గజపతిరాజులు కటకపురిని రాజధానిగా చేసుకొని ఈ ప్రాంతాన్ని పాలించారు. ఆ కాలములో కుమారారామ చాళుక్యభీమేశ్వరునికి సమస్తభోగములు జరిపించేవారు. అంతట కొండవీటిరెడ్లు కాటమరెడ్డి అనే కాపులు ప్రభువులై వేంగీదేశమంతా దొరతనము చేసిరి. అతనికుమారుడు మారారెడ్డి, ఆయనకుమారుడు కాటమరెడ్డి, ఆయనకుమారుడు వేమారెడ్డి[5] అని తెలిపే ఒక శాసనము ఆ ఆలయములో కలదు. అది

నప్తా కాటయశౌరేః పౌత్రోమారస్య
కాటవిభునః జయతి వేమా భూపాలః

ఈ వేమారెడ్డి క్రీశ. 1404 తారణనామ సంవత్సరంలో ఈ చాళుక్యభీమ నగరమునకు పశ్చిమంగా ఉన్న మధురపూడి అనే గ్రామమును కొమరగిరిరెడ్డి పురమనే పేరుగా మార్చి- శ్రీ వేదాద్రి నరసింహులుకు (కోరుకొండ నరసింహ స్వామికి) ధూపదీపనైవేద్యములు నిర్వహించటం కొరకు సమర్పించుకొన్నారు. ఇందుకు శిలాశాసనము మధురపూడి గ్రామం దక్షిణం చెరువులో గట్టున పాతి ఉన్నది.

క్రీశ. 1414 జయనామ సంవత్సర మాఘమాసంలో కొమ్మునాను మరియు అతని తమ్ముడు ప్రోలు కలిసి తమ తల్లిదండ్రులకు ఉత్తమగతులు సిద్ధించాలని, కుమారరామభీమేశ్వర మహాదేవరకు నందిని, గంటను, తోరణస్తంభములను ఏర్పాటుచేసినట్లు ఆలయ ఉత్తరద్వారం ఎదుటగల స్తంభంపై ఉన్నది.

5. ఈ వేమారెడ్డి తన తండ్రి కాటమరెడ్డి, తల్లి దొడ్డసాని అమ్మకు శుభం జరగాలని పిఠాపురం కుంతీమాధవ ఆలయంలో 1391లో ఒక మండపము కట్టించినట్లు ఆలయ స్తంభంపై శాసనము కలదు.

ఈ కాటమవేమారెడ్డికి కొమరగిరిరెడ్డి అనే కుమారుడు కలడు. ఈయన వేంగిదేశ ప్రభుత్వము చేస్తూఉండగా వారి ఆజ్ఞాపాలకుడైన కడియము మాచి నాయుడు తన ప్రభువుకు శుభములు కలగాలని, కుమారారామచాళుక్య భీమేశ్వరాలయంలో స్వామివారికి కల్యాణమంటపము కట్టించినాడు.

క్రీ.శ. 1422 శుభకృతు నామ సంవత్సరం పుష్యమాసం నాడు మంత్రిప్రగడ సూరన్న చాళుక్యభీమేశ్వరాదేవర ఆలయ తూర్పు కిందివాకిటలో శిలాస్తంభముతో మండపము కట్టించినాడు.

క్రీ.శ. 1424 క్రోధినామ సంవత్సరం చతుర్ధాన్వయుడైన దేవరయ కొమారుడు పోలశింగం, కుమారారామ చాళుక్యభీమేశ్వరుని ఆలయములో కల్యాణచంద్రశేఖరమూర్తిని ప్రతిష్ఠ చేయించి, ఆచంద్రతారార్కము ధర్మము నడవగలందులకు, బంగారు పూత పూసిన గంట, కంచుదీపస్తంభం, దీపారాధన నిమిత్తం గోవులను, పట్టుచీర, పళ్ళెము ఇచ్చినాడు. ఈ విషయం గర్భగుడికి ఆగ్నేయభాగం స్తంభంపై శాసనం వ్రాయించినాడు.

క్రీ.శ. 1424 క్రోధినామసంవత్సరం కార్తీకమాసంలో మంత్రిప్రగడ సూరన్న గారు కుమారారామాచాళుక్యభీమేశ్వరుల తూర్పువాకిటను పై యంతస్తున ఎనిమిది శిలాస్తంభముల మండపము కట్టించి, స్వామివారికి ఉయ్యాలను సమర్పించినాడు. ఇదే సంవత్సరం మార్గశిరమాసమందు చిత్రపుభీమన్న, మల్లన్న ఇద్దరు కలిసి స్వామివారి ఉపహారమునకు కాలోచిత మూల్యం, బియ్యం, చెరువుకొరకు కొంతభూమి, కంచుపళ్ళెం, దీపహారతికొరకు చమురు, పాలుపెరుగుల కొరకు పాడి ఆవును సమర్పించి, స్వామినగరి వలయం వద్దవున్న స్తంభానికి శాసనం వ్రాయించాడు.

క్రీ.శ. 1426 పరాభవనామ సంవత్సరం మాఖమాసం మంత్రిప్రగడ సూరన్న అమలనీలశిలతో గౌరీవిగ్రహం చేయించి ప్రతిష్టచేసి ఆలయం ఎదుటనే ఉన్న రాతిస్తంభానికి శాసనము వ్రాయించినారు.

క్రీ.శ. 1428 కీలకనామసంవత్సర ఆశ్వయుజమాసములో భీమేశ్వరస్వామికి పూజచేసే విశ్వేశ్వర గురువులు తమకు అక్షయసుకృతమవునట్లు ఆలయ ప్రాకారములోని సిద్ధేశ్వరునికి బంగారు ఆభరణమును, పాత్రోపకరణాలు, కొంత ధనమును సమర్పించుకొని ఆలయ అగ్నేయభాగమందున్న అటుకుల మండపము యొక్క స్తంభానికి శాసనము వ్రాయించినారు.

కాటమరెడ్డి వేమారెడ్డి, కొమరగిరిరెడ్డిలు ఆంధ్రదేశంలో అనేకచోట్ల కొండలపై దుర్గములు,నేలకోటలు కట్టించారు. చాళుక్యభీమవరానికి ఉత్తర భాగ మందున కోటకట్టించే నిమిత్తం పునాదిమట్టి తవ్వించగా పూర్వమందు చాళుక్య భీమనగరము బాగా యున్నప్పుడు ఈ స్తలమందున పట్నవాసులు ప్రతిష్ఠచేసిన మహిషాసురమర్దని అనే శక్తివిగ్రహం దొరికినది. అప్పటికి చాళుక్యభీమవర గ్రామం పాడుపడినది. ఆ విగ్రహము దొరికిన స్తలమందు కోటకట్టించి, ఆ కోటకు దక్షిణభాగమున చెరువు తవ్వించి ఆ మహిషాసురమర్దని విగ్రహమునునకు శ్యామలాదేవి (ఈ విగ్రహాన్ని కుమారభీమేశ్వరాలయంలో నేటికీ చూడవచ్చును) అనే పేరుపెట్టి ఆ చెరువు సమీపమున ఆలయ నిర్మాణము గావించి అక్కడ ప్రతిష్ఠచేయించినారు. ఆ కోటకు దక్షిణభాగమందు ఒక గ్రామాన్ని నిర్మించి దానికి శ్యామలకోట (నేటి చామర్లకోట/సామర్లకోట) అని నామకరణం చేసారు. దీనికి దక్షిణభాగములో ఉన్న మునులతీర్థం అనే స్తలంలో చెరువు తవ్వించారు.

క్రీశ. 1434 ఆనందనామసంవత్సరం పుష్యమాసం లో అల్లాడు భూపాలుని కొమారుడు వేమారెడ్డి గారి దేవులు, జయమల్లసానమ్మగారు తమకు శుభం జరగాలని– కుమారనది పశ్చిమాన వివిధ పూలు, పండ్లు ఇచ్చే తోటను కొని ఒక తోట బంటుని జీతానికి ఏర్పరచి, కుమారారామస్వామికి సమర్పణచేసి రంగమంటప స్తంభంపై శాసనం వ్రాయించినారు

క్రీశ. 1444 రక్తాక్షినామసంవత్సరం పాల్గుణమాసంలో మంత్రిప్రగడ సూరయ్యా కుమారారామ చాళుక్యభీమేశ్వర ఆలయ ఉత్తరంవైపున తాండవ మహేశ్వరుని శిలామూర్తిని ప్రతిష్టచేయించినారు.

క్రీశ. 1448 విభవనామసంవత్సరం కార్తీకమాసంలో ఈ భీమవరానికి దగ్గరలో ఉండే జల్లూరి గ్రామంలోని శ్రీసోమేశ్వరుని ఆలయముఖమండపానికి, ఆ వూరి యల్లుడు తమతండ్రి భీమగౌడు, తల్లి యర్రమ్మ పేరిట ఒక శిలాస్తంభం వేయించినాడు. కొన్నినాళ్లకు ఆ ఆలయం శిథిలస్థితికి చేరుకొన్నది. ఆ తరువాత భీమేశ్వరుని నందిమండపం శిథిలమైవుండగా జల్లూరు నుంచి ఈ స్తంభం తెప్పించి కట్టించి పడిపోకుండా నిలుపుచేసినారు.

క్రీశ. 1450 ప్రమోదూతనామసంవత్సరం శ్రావణమాసంలో శ్రీకుమారా రామ భీమేశ్వర ఆలయంలో దక్షిణపు దిక్కున ఒక భక్తుడు తన తల్లి అన్నయసాని, తండ్రి భీమాభక్తుని పేరిట ఒక గుడి కట్టించి అనభీమలింగమును ప్రతిష్ట చేసాడు. స్వామివారి పూజలకొరకు కొంత పొలమును, పూజాసామాగ్రి, ఒక గోవును దానం చేసాడు.

క్రీ.శ. 1450 ప్రమోదూత సంవత్సర మాఘమాసమందు శివరాత్రి సూర్య గ్రహణ పుణ్యకాలమందు కొటికలపూడి గంగయ్య, కానిపాప కామయ్యలు తాము సూరాజోస్యుల చేతా, సదాశివునిచే క్రయలబ్దమైన బిక్కవోలులోని ఒక అగ్రహారమును చాళుక్యభీమదేవరకు సమర్పించుకొని, దక్షిణద్వారం వెలుపల మండపస్తంభానికి శాసనము వ్రాయించినారు.

క్రీ.శ. 1468 బహుధాన్యనామ సంవత్సరం, శివరాత్రి సూర్యగ్రహణ పుణ్యకాలమందు శ్రీకుమారారామ చాళుక్యభీమలింగేశ్వరునకు, కళింగపు మాచిరాజు కొడుకు వీరన్న- బిక్కవోలులోని ఒక అగ్రహారం, పినవెంద్రలో తమ స్వార్జితమైన కొంతపొలము, ఇల్లు స్వామివారి నిత్యనైవేద్యాలకు సమర్పణ చేసి, లోన ప్రాకారానికి దక్షిణ ద్వారం బయటకల శిలాస్తంభానికి శాసనం వ్రాయించారు.

క్రీ.శ. 1458 బహుధాన్యసంవత్సరం మాఘమాసంలో, గజపతిరాయల మహారాజుకు శుభం కలిగేటట్లు వారి సేవకుడు లంఖిణి భైరవయ్య, గజపతివారి ప్రాపకంలో ఉన్న గంగసాని అనేపేరుకల భోగంది ఇరువురు కలిసి పుట్టెడు చేను (రెండు ఎకరములు) శ్రీమత్కుమారారమచాళుక్య భీమేశ్వరలింగస్వామికి సర్వమాన్యంగా ఇచ్చారు.

క్రీ.శ. 1494 ఆనంద నామసంవత్సరం పుష్యమాసంలో పాలూరి వీరమ నాయుడి కుమారుడు యర్రమనాయుడు తన తల్లిదండ్రులకు శుభం కలగాలని ఏలేరునది నుండి గోనేడ పొలిమేరవరకు ఒకకాలువ తవ్వించి, ఈ ధర్మం కుమారా రామభీమేశ్వరునికి అర్పితం చేస్తూ, గర్భగుడి ద్వారమందటి స్తంభానికి శాసనం వ్రాయించాడు.



కపిలేశ్వరగజపతి కుమారుడైన పురుషోత్తమగజపతి ఆంధ్రకళింగదేశాలు పాలించాడు. ఈయన కుమారుడైన ప్రతాపరుద్రగజపతి కాలములో పశ్చిమ ఉదయగిరిదుర్గంలో గజపతివారి తరపున తిరుమల కోపరాయ మహాపాత్రుడిని ఉంచారు. కొండవీటి దుర్గములో ప్రతాపరుద్రగజపతి కుమారుడు వీరభద్రగజపతి, కొమారంహలవీరపాత్రుని కుమారుడు నరహరిదేవు, శ్రీనాధరాజ కుమారుడు లక్ష్మిపతిరాజు ఇంకా జన్యావంకనుమాపాత్రుడు, సుప్రపాల చంద్రమహాపాత్రుడు, పూసపాటి రాజిరాజు, రాచూరి యల్లయ్య, ఉద్దండఖానుడు వంటి మహామహులు తగిన సైన్యంతో ఉండేవారు. ప్రతాపరుద్రగజపతి కటకపురిలో సింహాసనస్థుడై

పాలించేవాడు. ఈయన త్రిలింగదేశమధ్యములో ఉండే ఆంధ్రదేశమందు కల పోలునాడు, కాకినాడు, శలపాక నాడుల జమిందారీలు చేయుచున్న వంటిపిల్లి వారు రుజువులో (సక్రమముగా) పోకపోయినందున, వారి జమీ తీసివేసి వెలమవారయిన చిట్నీడు వారికి ఇచ్చాడు.

విద్యానగరపట్టణమందు (హంపి) అధిపతులైన శ్రీ కృష్ణదేవరాయలు సైన్యముతో ఉదయగిరికోటను జయించి (నెల్లూరు జిల్లా) అక్కడ ఉండే తిరుమల రాయ మహాపాత్రుని బంధించి తన జైత్రయాత్రను కొనసాగించాడు. వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, క్యాతవరం, కొండవీడు మొదలైన కోటలను వశపరచుకొన్నాడు. ఓడిపోయిన రాజులను సామంతులుగా చేసికొని, తన ప్రతినిధులుగా ఉండి పాలించుకొమ్మని వారి రాజ్యాలను వారికే దానం చేసాడు. కృష్ణదేవరాయలు క్రీశ.1515 యువనామ సంవత్సరంలో కళింగదేశాన్ని జయించటానికి కటకముపై దాడిచేసినపుడు, గజపతి కటకపురిని విడిచి పారిపోయాడు. ఆ తరువాత గజపతిరాజు తన కుమార్తెను కృష్ణదేవరాయలుకు ఇచ్చి వివాహంచేసి సంధికుదుర్చుకొన్నాడు. అంతట నరపతికృష్ణరాయలు తిరిగి విద్యానగరానికి వెళ్ళిపోయారు.

కాకినాడు, పోలునాడు (నేటి పిఠాపురం,గొల్లప్రోలు,ప్రత్తిపాడు మండలాలు), శలపాక (కాజులూరు తదితరప్రాంతాలు) ప్రాంతాలలో చిట్నీడివారి జమిందారీ నడుస్తూ ఉండినది. వీరిలో రావువారనే కొందరిని, పశ్చిమరాజ్యమందు బెజవాడ దగ్గర పూసపాటి మాధవవర్మ అనేరాజు సహించలేక వారితో యుద్ధముచేసి ఓడిపోయినవారిని గానుగు ఆడించి చంపించినాడు. వారియొక్క స్త్రీలు కొందరు గర్భిణిలుగా ఉండగా, వారి గర్భములు ఛేదించి వంశాంకురం లేకుండా చేసాడు. వారిలో ఒకరైన రావు సింగమనాయుడు[6] అనే ఆయన భార్య గర్భం ధరించి

6. చిట్నీడివారికి జమిందారీ ఇచ్చిన ప్రతాపరుద్రగజపతి కాలం క్రీశ.1497–1540. రాజకొండ రాజ్యాన్ని స్థాపించిన సింగమనాయుడు కీశ.1326–1361కు చెందిన వాడు. వీరిద్దరి కాలాలకు పొంతన కుదరదు. శత్రువులను గానుగతొక్కించటం, గర్భవతి అయిన రాణి తప్పించుకొని బ్రాహ్మణుని ఇంటఆశ్రయం పొందటం, ఆమె కొడుకు తండ్రి చావుకు పగతీర్చుకోవటం లాంటి నెరేటివ్స్ అనేక కైఫియ్యత్తులలో కనిపిస్తాయి. ఇక్కడ బహుశా రావు అనే వెలమవారు సింగమనాయుడి వంశస్థులని చెప్పటం ముఖ్యోద్దేశమని అర్థంచేసుకోవాలి. రేచర్ల వెలమ వంశస్థులలో సింగమ నాయుడు ఆద్యుడు.

ఉన్నది. ఈమెను ఒక బ్రాహ్మణుడు తన ఇంటిలో ఉంచుకోగా, మాధవవర్మ సైన్యం వచ్చి ప్రశ్నించినపుడు ఆమె కుమార్తె అని చెప్పి కాపాడినాడు. ఆమెకు ఒక కుమారుడు కలిగెను. ఆ చిన్నవానికి అనుపోతనాయుడు[7] అని పేరుపెట్టి వెలమవారి వారసుడు అనే విషయాన్ని ఆ బ్రాహ్మణుడు గోప్యంగా ఉంచి అతనికి యుక్త వయసు వరకూ కాపాడి పెండ్లిచేసాడు. తరువాత ఆ అనపోతనాయుడు చేసే వ్యవసాయానికి పాలెకాపుగా రేచడు అనే మాలవాడు ఉండేవాడు. ఈ అనపోతనాయుడికి సింగమనాయుడు, మాధవనాయుడు అనే ఇద్దరు కొమారులు కలిగిరి. ఒకరోజు అనపోతనాయుడి పొలము దున్నుతున్న రేచడికి, లంకెబిందెల గొలుసు నాగలికి తగులుకొన్నది. అనపోతనాయుడు దానిని తప్పించి దున్నమని నాడట. ఆ రాత్రి లక్ష్మిదేవి అతని స్వప్నమునందు కనిపించి "నిన్ను కరుణిద్దామని నేను కనిపిస్తే నీవెందుకు నన్ను స్వీకరించలేదు?. నీ పెద్దకుమారుడిని బలి ఇస్తే నేను నీకు దక్కుతాను" అని అన్నదట. ఆ రాత్రి అనుపోతనాయుడు, రేచడితో ఆ లంకెబిందెలను తవ్వించి అక్కడ వాడి శిరస్సు ఖండించి బలి ఇచ్చి ఆ ధనాన్ని సొంతం చేసుకొన్నాడు.

ఆ తరువాత అనుపోతనాయుడు కుటుంబసమేతంగా ఆ వూరు విడిచి, పశ్చిమదేశానకు వెళ్ళి కొంతసైన్యాన్ని సమకూర్చుకొని తిరిగివచ్చి పూసపాటి మాధవవర్మతో యుద్ధము చేసి మాధవవర్మను జయించాడు. మనిషి పుర్రెలో వండిన అన్నమును, రక్తముతోకలిపి రాత్రివేళ ఈ అనుపోతనాయుడు దిగంబరముగా సంచరిస్తూ యుద్ధభూమిలో భూత ప్రేత పిశాచములకు నైవేద్యంగా పెట్టేవాడట. రణరంగములో నిర్జీవకళేబరములు లేచి ఆ అన్నమును అందుకొని భక్షించేవట. అలా చేయటం వల్ల అనపోతనాయుడికి యుద్ధములో అపజయమే లేకుండా పోయెనట. కాని పాలెకాపైన రేచడిని చంపించినందుకు అపరాధనా భావన అతనిలో పెరిగిపోతూవచ్చింది. ఆ రేచడు అవేశముఖంగా (పూనకం ద్వారా) "తన పేరును అనపోతనాయుడు వంశానికి గోత్రనామముగా చేసుకొని, వీరి ఇండ్లలో పెళ్ళిల్లు జరిగేటపుడు తనకు ఇష్టమయ్యేవిధంగా జరిగిస్తే వీరికి ఈతిబాధలు తప్పుతాయని" చెప్పాడట. (అదే రేచర్ల గోత్రం కాబోలు).

---

7. సింగమనేని పుత్రుడు అనపోతనాయకుడు. ఇతడు రాచకొండ రాజ్యాన్ని స్థాపించాడు. తన తండ్రిమరణానికి కారణమైన జల్లిపల్లి రాజులను ఓడించాడు. రెడ్డిరాజులతో పోరాడి శ్రీశైలంవరకూ రాజ్యాన్ని విస్తరించాడు. బహుమని సుల్తానులతో స్నేహం చేసి క్రీశ. 1369లో ఓరుగల్లును ఆక్రమించాడు.

అనపోతనాయుడి కుమారుడైన సింగమనాయుడు[8] సమస్తవిద్యలందు ఆరితేరాడు. ఇతనికి సర్వజ్ఞసింగమ నాయుడు అనే పేరుకలదు. ఇతను మెతుకూ (మెదక్), కైలాసకోట, కొంత సీమ జాగీరు జమిందారీ చేస్తుండేవాడు. ఈయనవద్ద శ్రీనాధుడు అనే గొప్ప కవి ఉండేవాడు.

శ్రీకుమారారమ చాళుక్యభీమేశ్వరునికి శ్రీ గజపతిమహారాజు ఇచ్చిన చోడవరం, భీమవరం, బోయినపూడి, గొల్లమందల, వొల్లూరు, పల్నాటి, చామర్లకోట, కాపవరం వుండూరు, కొప్పవరం, పుల్లేరు, కళ్ళేపల్లి లాంటి గ్రామాల ద్వారా స్వామివారికి నిత్యనైవేద్యదీపారాధనలు జరిగేవి. యీ ప్రకారం తాటి ఆకులమీద వ్రాసిన పత్రము భీమేశ్వరస్వామి అర్చకుడు కొడమంచిలి పార్వతీశం దగ్గర వున్నది. అటుపిమ్మట అదే ప్రకారం అనవేమారెడ్డి కూడా జరిపించారు. ఆ తరువాత తురుష్కుల ప్రభుత్వములో పొలినాటి కౌలుదారుగా ప్రభుత్వం చేసిన దుర్యోధనం అప్పనపాత్రులు ఒక్క వుండూరు మాత్రమే భీమేశ్వరునికి కైంకర్యంగా నడిపించిరి.

ఈ సర్వజ్ఞసింగనాయని తమ్ముడు మాధవరావు. ఇతను మహా వైష్ణవభక్తిచే శ్రీరంగములో చాలారోజులు నివసించారు. కాంచీ పట్టణమందు వరదరాజస్వామి ఆలయము, జంబుకేశ్వరుడి ఆలయము ఒకదానికొకటి ఎదురుబొదురుగా ఉన్నవి. ఆయా దేవుళ్ల వాహనములు ఊరేగించేవేళ శివ భక్తులు, విష్ణుల భక్తుల మధ్య గొడవలు జరిగేవి. ఒకనాడు విష్ణుభక్తులు నిరాయుధులుగా ఉన్నప్పుడు శివభక్తులు దాడికి దిగగా మాధవరావు ఖడ్గధారియై అందరినీ చెల్లాచెదురుచేసిరి. అప్పటినుంచి ఈ ఉభయులు మాధవరావు మధ్యవర్తిత్వంతో ఎట్టికలహములు లేకుండా కలసిమెలసి ఉండాలని ఒప్పందం చేసుకొన్నారు.

సర్వజ్ఞసింగమనాయుడు వంశీకుడైన రావురంగారాయుడు మెతుకు, కైలాసకోటల జాగీరు నడిపించేకాలంలో, వాటిని ఢిల్లీపాలకులు ఆక్రమించుకొన్నారు. ఈ రంగారాయుడు తురుష్కులతో యుద్ధం చేసి తిరిగి మెతుకు, కైలాసకోటలను స్వాధీనపరుచుకొన్నాడు. ఆయన కుమారుడు ధర్మారావు, ఆయన

8. ఇతను కుమారసింగ భూపాలుడు (క్రీశ.1383-1399). ఇతనికి సర్వజ్ఞ బిరుదు కలదు. ఇతడు కవి, గొప్ప సాహిత్యపోషకుడు. చమర్కారచంద్రిక వ్రాసిన విశ్వేశ్వరకవి, అప్పయామాత్యుడు. శ్రీనాథుడు ఇతని ఆస్థానంలో ఆశ్రయం పొందారు.

కుమారుడు లత్సారావు. ఈ లత్సారావు హయాంలో తిరిగి మెతుకు, కైలాస కోటలను తురుష్కులు ఆక్రమించుకొన్నారు. ఈ లత్సారావుకు ధర్మారావు, మాధవరావు, వేమారావు అనే ముగ్గురుకుమారులు కలరు. వీరు గోల్కొండకు వెళ్ళి తురకవారి తరపున కొన్ని ప్రాంతాలకు జమిందారీ చేసారు. ఇందులో మాధవరావుకు (1611-1672)- గుర్వారావు, తెనుగురావు, నారసింహరావు, రంగశాయిరావు అనే నలుగురు కొడుకులు కలరు.

వీరిలో తెనుగురావు సుల్తాను అబ్దుల్ హుస్సేన్ ప్రతినిధిగా రాజమహేంద్ర వరం సర్కారుచేస్తూ రాజమహేంద్రవరములో ఉండేవారు. ఈయనకు అనపర్తి గ్రామం ఈనాంగా ఉండేది. ఈ గ్రామంలో కల శిలాశాసనం వివరం ఏమిటంటే - నేటినుంచి అనగా 1605, విశ్వావసు నామ సంవత్సరం నుండి అనపర్తి ప్రజలు పూర్వమందు దివాణమునకు ఇచ్చే పెండ్లి కట్నము అనే పన్ను అక్కరలేకుండా గ్రామస్తులకు సర్వమాన్యంచేసి ఇచ్చినారు.(పన్నురద్దు)

తెనుగురాయనింగారికి మాధవరావు, వెంకటపతిరావు, చిన్నారావు, చంద్రారావు, జగ్గారావు, వెంకట కృష్ణారావు, రంగశాయిరావు అనే ఏడుగురు కుమారులు కలిగిరి.

తెనుగురాయనింగారి తమ్ముడు నారసింహారావుకు చిన్నారావు, నీలాద్రిరావు, రామారావు అనే ముగ్గురు కొమారులు కలరు. తెనుగు రాయనిం గారు తమ కుమాళ్లను రాజమహేంద్రవరములోఉంచి, తాను తుర్కాణ్యం తరపున పనిచేసేవారు. వీరు శ్రీజగన్నాయకులస్వామి వారిని సేవించేందుకు శ్రీపురుషోత్తముకు (పూరి) వెళ్ళి అక్కడ స్వర్గస్థులు అయ్యారు.

ఇక్కడ కాకినాడు, శలపాక, పోలునాడు పరగణాలు చిట్నేడివారి జమిందారీ కింద ఉండేవి. కడియంను మెళ్లవారు అనే వెలమవారు జమీ చేస్తుండేవారు. బెండపూడి,ఇసుకపల్లి పరగణాలకు ప్రత్యేక జమిందారీలు ఉండేవి.

తెనుగురాయనింగారి పెద్దకుమారుడైన మాధవరాయనింగారికి, తెనుగురావు, జనార్ధనరావు అనే ఇద్దరు కుమాళ్లు కలిగిరి. చంద్రారాయనింగారికి మాధవరావు, నారసింహరావు అనే ఇద్దరుకుమారులు కలరు.

తెనుగురాయనింగారి ఆరుగురి కుమారులలో నలుగురు చిట్నేడివారి సంస్థానములో చేరిన చామర్లకోట గ్రామమున గోపాలస్వామి దేవాలయము వద్ద లోగిలి కట్టుకొని అక్కడ నివసించేవారు.



తెలుగురాయనింగారి ఆఖరికుమారుడు అయిన రంగశాయి రెండువేల మంది సైన్యముతో గోల్కొండవెళ్ళి సుల్తాను అబ్దుల్ హుస్సేన్ కుదువన్మలుకు వద్ద సేనాపతిగా చేరాడు (క్రీ.శ.1611–1672). ఎనలేని ధైర్యసాహసాలు ప్రదర్శించి సుల్తాను మన్ననలు పొందాడు.

ఈ రంగశాయి చదరంగంలో మేటైన ఆటగాడు. సుల్తాను కాలక్షేపము కొరకు ఈ రంగశాయి నాయుడిని అప్పుడప్పుడూ పిలిపించుకొని చదరంగము ఆడేవారట. అలా సుల్తానువద్ద రంగశాయినాయుడు గౌరవమర్యాదలు సంపాదించుకొన్నాడు. వీరిద్దరూ ఒకనాడు చదరంగం ఆడుతూన్నపుడు, రంగశాయినాయుడు ఎత్తు వేయటంలో ఆలస్యం చేస్తునందున, సుల్తాను "పరాచకములు ఆడక తొందరగా ఎత్తువెయ్యి" అన్నాడట. దానికి బాధపడ్డ రంగశాయి "మీరు ప్రభువులు, మేము సేవకులము మీతో పరాచకములు ఆడేందుకు మాకు శక్తి ఎక్కడ చాలుతుంది" అంటూ కత్తితీసుకొని పొడుచుకొని ఆత్మత్యాగం చేసుకొన్నాడు[9]. అంతట సుల్తాను మిక్కిలి బాధపడి రంగశాయి అన్నగార్లు అయిన చంద్రారావును, జగ్గారావును గోల్కొండకు పిలిపించుకొని– అంతకు కొంతకాలంగా కాకినాడు, శలపాక, పోల్నాడు పరగణాలకు చిట్నేడువారు కప్పం కట్టక బాకీపడి ఉండటంతో– వాటిని చంద్రారావు పేరిట జమిందారీ చేయించాడు. అంతేకాక శ్యామలకోట, గోవింద పాలెం, గొల్లమందలపాడు గ్రామాలను వారి సొంతఖర్చుల కొరకు మంజూరుచేసి, ఛోపుదారు (బిళ్లబంట్రోతు), ఢంకా, ఘడియారం లాంటి రాచమర్యాదలు ప్రభుత్వ ఖర్చుతో జరిపించుకొనేందుకు అనుమతులు ఇచ్చాడు.

చంద్రారావు, జగ్గారావులు వచ్చి పిఠాపురంలో కోటను స్థావరంగా చేసుకొని ఈ పరగణాల జమిందారీని అనుభవించటం మొదలుపెట్టారు. ఈ ప్రాంతంలోని పాతబాకీలను కూడా వసూలు చేసి సుల్తానుకు అప్పగించారు.

చంద్రారాయినింగారు సర్పవరంలో కొంతభూమిని భట్టరు జగన్నాధా చార్యులు అనే శ్రీవైష్ణవులకు అగ్రహారంగా ఇచ్చి, శ్రీ భావనారాయణస్వామి

---

9. జల్లూరు కైఫియ్యతులో ఈ ఉదంతం మరోలా ఉంది. ఆరోగ్యము బాగులేక మూడు నెలలు శలవు మీద వెళ్ళి రోగం తగ్గకపోయేసరికి, మరొక అయిదునెలలు గైర్హాజరు అయి తిరిగి ఉద్యోగంలో చేరటానికి వస్తే "ఆరోగ్యం ఎలా ఉంది" అని సుల్తాను ప్రశ్నించటం అవమానంగా భావించిన రంగశాయి కత్తితీసుకొని పొడుచుకొన్నట్లు చెప్పబడింది.

దేవాలయం ఎదుట శ్రీవైష్ణవ అగ్రహారం నిర్మించారు. ఈ భూములు వీరికిచ్చే సమయంలో నీటిసదుపాయం లేక బీడుపట్టి ఉన్నవి. అందుచేత ఏలేరు నదినుండి వచ్చే నీరును కాలువ ద్వారా కిమ్మూరుసీమకు ఆరురోజులును, పొల్నాడు పరగణాకు పదిరోజుల చొప్పున వంతులు వేసి పారించేందుకు సుల్తాను అబ్దుల్ హుస్సేన్ కుదువమ్ములు వద్ద నిర్ణయంచేసిరి. (క్రీశ. 1671–79).

చంద్రారాయినింగారి తరువాత జగ్గారాయినింగారు ప్రభుత్వం చేస్తున్నప్పుడు, పిఠాపురంను అధికారులుండు పట్టణముగా తీర్చిదిద్దారు. ఊరు దక్షిణభాగమందు మామిడిచెట్లు మొదలయిన తోటలు వేయించారు.

చంద్రారాయినింగారి చిన్నాన్న అయిన నారసింహారావు కొమారుడు నీలాద్రిరాయనింగారు తన పటాలంతో పెద్దాపురం వచ్చినపుడు అక్కడి జమిందారు వత్సవాయి తిమ్మరాజు మర్యాదలు చేయబోతే అవేమీ వద్దు పిఠాపురంలో నా కుమార్తె నివసించుచున్నది ఆమెకు పసుపుకుంకుమ కింద శాశ్వతాదాయం వచ్చే కానుక ఏదైనా ఇప్పించమని కోరాడు. ఆ కోర్కె మేరకు తిమ్మరాజు చాళుక్య భీమవరం గ్రామమును పిఠాపురవాసి, నీలాద్రిరాయనింగారి కుమార్తె అయిన రమణమ్మకు పసుపుకుంకుమగా ఇవ్వటంతో అంతవరకు పెద్దాపురసంస్థానంలో ఉండిన చాళుక్య భీమవర గ్రామము పిఠాపురం తాలూకాలో కలిసింది.

బెండపూడి, ఇసుకపల్లి పరగణాల శిస్తులు బాకీపడటంతో వాటిని పిఠాపురం జమిందారీలో దఖలుచేయబోతే, రెండున్నూ పాడులోఉన్నవి కనుక నష్టము వస్తుందని రావువారు అనటంతో సల్లస్కరుడు (రెవిన్యూఅధికారి) బెండపూడిని పిఠాపురంలోను, ఇసుకపల్లిని వత్సవాయి జమిందారీ (పెద్దాపురం) లోను కలిపాడు.

చంద్రరాయినింగారి తరువాత వారి కుమారుడు మాధవరాయినింగారు, ఆ తరువాత కొంతకాలం నారసింహరాయినింగారి కుమాళ్లు ప్రభుత్వం చేసి స్వర్గస్థులైనారు. అనంతరం వెంకటకృష్ణారాయినింగారు (క్రీశ. 1728–1759) పట్టాభిషిక్తులైరి. ఈయన హయాంలో చాలా అల్లర్లు జరిగాయి. (స్థానిక జమిందార్లను తొలగించి పన్నులు వసూలు చేసేందుకు ముస్లిం ఫౌజుదార్లను ఏర్పాటుచేసుకోవటానికి గోల్కొండ ప్రభుత్వము ప్రయత్నాలు చేసింది)



గోల్కొండ నుండి ఖాజిహుస్సేను[10] అనే సేనాపతి ఏలూరు, రాజమహేంద్రవరం, కళింగరాజ్యములకు వస్తూండగా, అతడిని ఏలూరు దాటి రానివ్వకూడదని మొగలతుర్తి సంస్థానధీశులైన కలిదిండి రామరాజు, నూజివీడు జమిందారు సుబ్బరాజు ఏలూరు వద్ద ఖాజి హుస్సేనుతో యుద్ధం చేసి నిలువలేక పోయిరి[11].

---

10. క్రీశ.1724 – 1748 మధ్య గోల్కొండను పాలించిన అసఫ్‌జా/నిజామ్ ఉల్‌హుక్ పాలనా సౌకర్యం కొరకు దక్కను రాజ్యాన్ని 22 పరగణాలుగా విభజించి ప్రతిచోట తన ప్రతినిధులను నిలిపాడు. అలా రాజమండ్రి, శ్రీకాకుళం పరగణాలకు నిజాం ప్రతినిధిగా క్రీశ.1732లో అన్వరుద్దిన్ నియమించబడ్డాడు.

ఈ అన్వరుద్దిన్ ఈ ప్రాంత పన్నులు వసూలుచేసే అధికారాన్ని రుస్తుంఖాన్‌గా పిలవబడిన ఖాజి హుస్సేను అనే టర్కిష్ అధికారికి కట్టపెట్టాడు. అప్పటికి ఈ ప్రాంతాలలో నెలకొనిఉన్న రాజకీయ అస్థిరతవల్ల అనేకమంది జమిందార్లు కప్పాలు కట్టటం మాని, తమ సంస్థానాల్ని తామే స్వయంగా పరిపాలించుకొనే యోచన చేస్తున్నారు.

ఖజానాకు నష్టంకలిగించే అలాంటి జమిందారుల తిరుగుబాట్లను అణచి వేయకపోతే ఈ ప్రాంతం తమ ఆధీనంలోంచి జారిపోతుందని ఖాజిహుస్సేను భావించాడు. ఇతను చాలాకఠినంగా వ్యవహరించి ఈ ప్రాంత జమిందార్లు తనకు విధేయులుగా ఉండేవిధంగా చేసుకొన్నాడు. తన అధికారంపై తిరగబడిన వారిని క్రూరంగా అణచివేసేవాడు. ఎదురుతిరిగిన వారిని దారుణంగా చంపి వారి తలలతో 'కుల్ల మీనార్' చేయించేవాడట. కుల్లమీనార్ అంటే ప్రభుత్వానికి ఎదురుతిరిగిన వారి తలలు నరికి పిరమిడ్ ఆకారంలో గుట్టలుగా పేర్పించటం. ఈ చర్యలకు భయపడి ఎవరూ ఎదురు చెప్పటానికి సాహసించేవారు కారు. అన్నిచోట్లా ఒక భయానక వాతావరణం ఏర్పడింది.

ఇదే ఖాజి హుస్సేను అంతవరకూ పీడిస్తున్న జమిందార్లనుంచి రైతులను కాపాడేవాడు. కప్పాలు సరిగ్గా కట్టని జమిందార్లను తొలగించి కొత్తవారిని నియమించాడు. కవులకు, పండితులకు ఈనాములు ఇచ్చేవాడట. ఏనుగు లక్ష్మణకవి బంధువైన అంతన్నకు బహుమతిగా ఈనాం భూములు ఇచ్చాడు.

11. క్రీశ.1734లో మొగల్తూరు జమిందారైన కలిదిండి రామరాజు, నూజివీడి జమిందారు రావుసుబ్బన్నలు ఏలూరువద్ద ఖాజి హుస్సేన్‌తో యుద్ధంచేసి, ఓడిపోయి పెద్దాపురం సంస్థానం నిర్వహిస్తున్న రాణిరాగమ్మ వద్దకు చేరుకున్నారు. ఈమె పేరు రాఘవమ్మ. ఈమె వత్సవాయి జగపతిరాజు వితంతువు. రాణిరాగమ్మ కూడా వీరితో చేతులు కలిపి తన ఇరవై ఏండ్ల కొడుకు తిమ్మరాజును, పిఠాపురం జమిందారు రావు వెంకట కృష్ణారాయణింగారిని ప్రేరేపించి ఖాజి హుస్సేన్‌ను అదుపుచేయటానికి ప్రయత్నించింది ఖాజి హుస్సేన్ ఎదురుతిరిగిన అందరినీ చంపి, పెద్దాపురం జమిందారీని స్వాధీనం చేసుకొన్నాడు. తిమ్మరాజు కొడుకు గజపతిరాజుకు అప్పుడు ఏడునెలల వయసు. ఓటమిని గ్రహించిన రాణిరాగమ్మ ఆ శిశువును విజయనగరంలోని విజయరామరాజు వద్దకు రహస్యంగా పంపించే ప్రయత్నం చేసింది. ఈ జగపతిరాజు పెదవిజయ రామరాజు భార్య మేనకోడలి కొడుకు.

జగ

వీరందరూ వెళ్ళి గోదావరి ఇతవల పెద్దాపుర సంస్థానం నిర్వహిస్తున్న వత్సవాయి రాగమ్మ మద్దతు కోరారు. అంతట రామరాజు, సుబ్బరాజు, పిఠాపురం జమిందారు వెంకటక్రిష్ణారాయినింగారు, రాగమ్మ కొడుకు తిమ్మరాజు అందరూ కలిసి కూటమి కట్టి ఖాజిహుస్సేను గోదావరి దాటకుండా నిలువరించటానికి ప్రయత్నించారు. ఖాజి హుస్సేను ధాటికి వీరు తట్టుకోలేక చెల్లాచెదురయ్యారు.

ఖాజి హుస్సేను పెద్దాపురానికి వచ్చి రాగమ్మకు "మీది పురాతనమైన సంస్థానం, మీ సంస్థానం మీరు ఏలుకోవచ్చు, మీ కుమారులను పంపిస్తే వారికి జమిందారీ స్థిరపరచి నేను వెళ్ళిపోతాను" అంటూ రాయభారం పంపాడు. ఖాజిహుస్సేను పన్నిన కుట్రను గ్రహించలేని రాగమ్మ తన కుమాళ్లయిన తిమ్మరాజు, బలభద్రరాజులను ఖాజిహుస్సేను వద్దకు పంపింది. వారిరువురినీ ఖాజిహుస్సేను నూనెకాపించి జొన్నవెన్నులతో వీపుమీద కొట్టి హింసించి చంపించినాడు. ఈ వార్త తెలిసిన పెద్దాపురం కోటలో చల్లాపెద్ది అనే సేవకుడు రాజుగారి స్త్రీలనందరినీ ఇండ్లలో ఉంచి నిప్పుపెట్టాడు. రాగమ్మ మొదలైన స్త్రీలందరూ చనిపోయారు. తిమ్మరాజు కొడుకు జగపతిరాజుకు ఏడాది వయసు. ఆ శిశువును ఒక బ్రాహ్మణ మనిషి[12] చేతికి ఇచ్చి విజయనగరంలో పూసపాటి విజయరామరాజు వద్దకు పంపించటానికి ప్రయత్నించగా ఖాజి హుస్సేను వారిని పట్టుకొని ఆ శిశువును తనవద్ద బందీగా ఉంచుకొన్నాడు.

రావువెంకటకృష్ణారాయినింగారు తమకు బంధువైన రావు బుచ్చన్నను, కొంతసైన్యాన్ని వెంటబెట్టుకొని, రామరాజు, సుబ్బరాజులతో కలసి ఖాజి హుస్సేనుపై అదునుచూసి తిరుగుబాటు చేయటానికి తోటపల్లి అడవులలోకి పారిపోయారు.

---

12. ఈమె పేరు కొంపెల్ల లక్ష్మిసోదెమ్మ. రాజపురోహితులలో ఒకరైన తన భర్త మరణించటంతో సోదెమ్మ అంతఃపురంలో మహరాణికి సేవకురాలిగా ఉండేది. రాగమ్మ ఆదేశాల మేరకు జగపతిరాజును రహస్యమార్గం ద్వారా కోటదాటించి విజయనగరం తీసుకొని వెళుతుండగా రుస్తుంఖాన్ సేనలకు దొరికిపోయింది. వారు ఎవరీబాలుడు అని ప్రశ్నించగా ఈమె ధైర్యంగా నా కుమారుడు అని చెప్పింది. వారు ఈమెను అనేక పరీక్షలు చేసి వదిలేశారు. కొంతదూరం వెళ్లాకా వీరిని మరలా మరొక సేనల బృందం అడ్డుకొని రుస్తుంఖాన్ వద్దకు తీసుకువెళ్ళారు. రుస్తుంఖాన్ వీరిద్దరిని ఖైదు చేయించాడు. బాలుడితో పాటు సోదెమ్మ కూడా ఖైదులో ఉంటూ, మొత్తం విషయాన్ని విజయరామరాజుకి రహస్యంగా చేరవేసి, బాలుని విడిపించటంలో కీలకపాత్ర పోషించింది. (రి. పెద్దాపుర సంస్థానచరిత్రము)

తోటపల్లిలో తలదాచుకొన్న వీరిలో చాలామంది క్రీశ.1734 ఆనంద నామసంవత్సరంలో మన్యం జ్వరాలకు బలయి అక్కడే చనిపోయారు. వెంకట కృష్ణారాయనింగారు కూడా అక్కడే తనువు చాలించాడు. రావు బుచ్చన్న మాత్రం మిగిలిన సైన్యాన్ని తీసుకొని ఖాజిహుస్సేనుపై తిరుగుబాటు చేయటానికి ప్రయత్నిస్తుండగా పిఠాపురంలో ఖాజిహుస్సేను బుచ్చన్నను పట్టుకొని తల నరికించాడు.

ఖాజిహుస్సేను కుమారుడైన నూరుద్దీన్ హుస్సేనుఖాను – తన మిత్రులైన పెద్దాపురం జమిందారులు తిమ్మరాజు, బలభద్రరాజులను కుట్రపూరితంగా పిలిపించి చంపించినాడనే కారణంతో తన తండ్రి ఖాజిహుస్సేనును బలవంతంగా మెడమీద దేరాకర్రలు వేసి కాళ్ళతో తొక్కించి చంపించినాడు[13]. ఈ విషయాన్ని గోల్కొండ రాజుకు తెలియచేయగా ఆయన, నూరుద్దీన్ హుస్సేన్ చేసిన కార్యం మంచిదేనని అతనికి రాజమహేంద్రవరం, కళింగ సర్కార్లకు అధికారంఇస్తూ ఒక పరవానా (రాజాజ్ఞ) ఇచ్చారు.

ఆ ప్రకారం నూరుద్దీన్ హుస్సేనుఖానుడు సైన్యంతో పెద్దాపురం సంస్థానాన్ని జప్తు చేసి ప్రభుత్వపరం చేసాడు. ఆ పిమ్మట కళింగపై దాడికి బయలుదేరాడు. విజయనగర జమిందారు పూసపాటి విజయరామరాజు ఇక్కడి విషయాలు తెలుసుకొని నలభైవేలమంది సైన్యంతో వచ్చి చేబ్రోలువద్ద నూరుద్దీన్ హుస్సేను ఖానును ఎదుర్కొన్నాడు. విజయరామరాజు తరపున అనకాపల్లి నుండి వచ్చిన రెండువేల మంది బోయీల సైన్యం, నూరుద్దిన్ హుస్సేనుఖాను అంబారీని చుట్టుముట్టి, అతన్ని కిందకు ఈడ్చి తలనరికి చంపేసారు. విజయరామరాజు

---

13. ఇది క్రీశ.1737లో జరిగింది. ఈ నూరుద్దిన్ హుస్సేనుఖాను చిన్నప్పుడు పెద్దాపురం కోటలో తిమ్మరాజు, బలభద్రరాజులతో కలిసిపెరిగాడు. వీరందరూ స్నేహితులుగా మెలిగారు. నిజానికి ఖాజి హుస్సేను తాను చేస్తున్న కుట్రవిషయం నూరుద్దిన్ హుస్సేన్‌కు చెప్పకుండా అతడినే రాయభారానికి పంపగా, రాగమ్మ కూడా తన కొడుకులాంటివాడు తీసుకొచ్చిన రాయభారము కదా అని నమ్మి తన సొంత కొడుకులను పంపింది. (Andhra Between the Empires page no 36). కాగా విజయరామరాజు, ఖాజిహుస్సేను కొడుకు కుమ్మక్కయి ఖాజిహుస్సేనును కుట్రచేసి చంపినట్లు అనకాపల్లి కైఫియ్యతులో ఉంది.

ఏడాది వయసున్న జగపతిరాజును ఖైదునుండి బయటకు తీసుకువచ్చి తనకూడా విజయనగరం తీసుకొనిపోయారు[14].

బుచ్చన్నగారిని చంపేసేకా ఆయన కుమారుడు పెదమహీపతిరావు బాలుడుకనుక, బుచ్చన్నగారి అన్నవరుస నరసన్నగారి కుమారుడు నీలాద్రి నాయినింగారు పిఠాపురం జమిందారిని నడిపించారు. వీరు పిఠాపురం కోటవిడిచి చామర్లకోటలో నివాసం చేసారు.



పూసపాటి ఆనందగజపతి సైన్యముతో వచ్చి చామర్లకోట మీద పోట్లాడగా, మహీపతిరాయనింగారు, నీలాద్రిరాయనింగారు కోటలోఉండి కాకినాడ జగన్నాధపురంలో మందుగుండు కొని తీవ్రమైన ప్రతిఘటన ఇచ్చారు. ఆనందగజపతికి కోటను వశపరచుకొనుట సాధ్యం కాలేదు. చాలా విలయము అయినది కనుక ఆనంద గజపతికి నీలాద్రిరాయనింగారికి మధ్య ఒప్పందము జరిగింది. దీనిప్రకారము – నీలాద్రిరాయనింగారు చామర్లకోట ఖాళీచేసి సైన్యసహాయం అందించిన ఇంగ్లీషువారికి చామర్లకోట కోటను ఇచ్చివేసి ఆతను పిఠాపురం కోటలో నివాసముండేటట్లు; జమిందారీ ఆదాయంలో నూటికి అయిదువరహాల వాటా ఇచ్చేటట్లు; వెలమలు, ఒంటర్లు ఎక్కడైనా వ్యవసాయం

14. క్రీశ. 1737/38 లో జరిగిన ఈ ఉదంతానికి సంబంధించిన మరిన్ని వివరాలు అనకాపల్లి కైఫియ్యతులో మరోవిధంగా ఇలా ఉన్నాయి. ఖాజిహుస్సేను జగపతిరాజుని ఇంట్లో ఉంచుకొన్నాడు. ఒకనాడు ఒకపండు, ఒకకత్తి వాడి ఎదుటపెట్టినపుడు, ఆ చిన్నవాడు కత్తిని పట్టుకొన్నాడట. దీనికి ఆశ్చర్యపోయిన ఖాజిహుస్సేను – ఈ కుర్ర వాడిని బ్రతకనిస్తే ఏదో ఒకరోజు నన్ను చంపగలడు అని భావించి ఆ కుర్రవాడిని తీసుకెళ్ళి తలనరకమని ఆజ్ఞాపించాడట. ఖాజి హుస్సేను భార్య ఉత్తమురాలు. ఆ శిశువు పట్ల జాలిపడి భర్తతో – ఇప్పటికే మనవయసు అరవై ఏండ్లు. ఈ పిల్లవాడు అన్ని చావుగండాలు దాటి కత్తిపట్టే వయసుకు వచ్చేసరికి మనం బ్రతుకుతామా ఏమిటి? అని చెప్పి ఆ కుర్రవాడి ప్రాణాలు కాపాడిందట. కొన్నాళ్లకు విజయరామరాజు దొంగలను పంపించి, ఖాజిహుస్సేన్ భార్యసహకారంతో, ఆ కుర్రవాడిని తనవద్దకు తెప్పించుకొని పెంచి పెద్ద చేసాడు. ఆ తరువాత 1749లో విజయరామరాజు తన పలుకుబడి ఉపయోగించి, పెద్దాపురం అమీను అయిన నియామత్అలీకి తొంభైవేల రూపాయిలు లంచంగా ఇచ్చి తిరిగి తిమ్మరాజు కొడుకు జగపతిరాజుకి పెద్దాపురం సంస్థానం దక్కేలాచేసాడు.

చేసుకొనేందుకు కావలసినన్ని భూములు ఇచ్చి పండినపంటలో సగభాగము ఇచ్చేలాగ; ఆనంద గజపతి వారి మనుషులు ఈ ప్రాంతములో అధికారము చెలాయించేటట్లు ఉభయులు అంగీకారానికి వచ్చారు.

ఆనందగజపతి, నీలాద్రిరాయనింగారు ఇలా ఒప్పందానికి రావటం నచ్చని ఇంగ్లీషువారు గజపతివారిపై అలిగి వెళ్ళిపోయారు. ఆనందగజపతి కంపనీవారిని జగ్గంపేటవద్ద కలిసి ఒప్పించి వారి జండాను చామర్లకోట కోటబురుజుపై ఎగరేయించాడు.

అటుపిమ్మట ఆనందగజపతి తనసైన్యముతో పెద్దాపురములోని నల్లచెరువు వద్ద బసచేసి, పెద్దాపురం జమిందారైన వత్సవాయి జగపతిరాజును రమ్మని వర్తమానం పంపాడు. తీరా జగపతిరాజు తన నమ్మినబంట్లను వెంటవేసుకొని వెళ్ళగా వారు నడిచేదారిలో ఆనందగజపతి వరుసగా ఫిరంగులు అమర్చి ఒక్కొక్కటీ పేల్చుటంతో, ఆ అవమానం భరించలేక, ఓటమి తప్పదని గ్రహించిన జగపతిరాజు పల్లకి విడిచి గుర్రమెక్కి యెకాఎకీ కోటకు వెళ్ళి, తుపాకిమందు నేలపై పరపించి స్త్రీలతో కలసి నిప్పు అంటించుకొని సామూహిక ఆత్మాహుతికి సిద్ధపడ్డాడు[15]. ఇది తెలుసుకొన్న ఆనందగజపతి కోటలోకి ప్రవేశించి –ఎవరూ చచ్చిపోనక్కరలేదు, జగపతిరాజు తన కుమారుడైన తిమ్మరాజుకి జమిందారీ అప్పగించి, ఊరువిడిచి ఎక్కడికైనా వెళ్ళిపోవచ్చని సలహాఇచ్చాడు. ఆ ప్రకారము జగపతిరాజు కొంతమంది బంధుగణమును వెంటతీసుకొని పరాభవ భారంతో ఊరువిడిచి వెళ్ళిపోయాడు. అటుపిమ్మట ఆనందగజపతి పెద్దాపురం జమిందారీని నిర్వహించటానికి తనతరపు మనుషులను నియమించి రాజమహేంద్రవరం బయలుదేరాడు.

---

15. ఈ జగపతిరాజు పెదవిజయరామరాజు భార్య మేనకోడలి కొడుకు. ఇతడు పెదవిజయరామరాజు వద్దే పెరిగాడు. ఆనందగజపతికి జగపతిరాజుకి పూర్వం నించే వైషమ్యాలు ఉన్నాయి. ఆనందగజపతికి పొగాకు పొగపడదు. ఎవరైనా తన ఎదుట పొగత్రాగితే కత్తితీసి పరిగెత్తించి కొట్టేవాడట. ఒకనాడు జగపతిరాజు ఆనందగజపతి ఎదుట పొగతాగినందుకు ఇద్దరిమధ్యా వాగ్వివాదం జరిగింది. దీన్ని దృష్టిలో పెట్టుకొని రమ్మని పిలిచి ఊహించని విధంగా ఫిరంగులు పేల్చి అవమానించి ఉంటాడు ఆనంద గజపతి. జగపతిరాజు అయిదువేలమంది సైనికులతో యుద్ధం చేసాడట. ఇతని భార్య సతీసహగమనం చేసింది.(అనకాపల్లి కైఫియ్యతు)

జగపతిరాజు 1759లో Fisher అనే బ్రిటిష్ సైనికుడి చేతిలో హతమైనట్లు Orme సంకలనపరచిన Catalogue of Manuscripts In European Languages ,vol.2 పే.నం.119లో కలదు.

అవమాన భారంతో కుంగిపోయిన పిఠాపురం జమిందారు నీలాద్రి రాయినింగారు, పెద్దాపురం జమిందారు జగపతిరాజులు ఎలాగైనా పగతీర్చు కోవాలని జట్టుకట్టారు. కాకినాడ జగన్నాధపురం రేవులో ఫ్రెంచివారి ఓడ ఒకటి వచ్చి ఆగింది. వీరిద్దరు ఒక డచ్చివ్యాపారిని మధ్యవర్తిగా పెట్టుకొని-చామర్లకోట కోటలో తిష్టవేసిన బ్రిటిష్‌వారిని తరిమికొట్టేందుకు ఫ్రెంచివారితో నాలుగులక్షలరూపాయిలకు ఒక ఒప్పందం చేసుకొని లక్షరూపాయిలు బయానాగా ఇచ్చారు. రెండువందలమంది ఫ్రెంచిసైన్యాన్ని ఓడదింపి, చామర్లకోటకు నావల మీద తీసుకొచ్చారు[16]. నీలాద్రిరాయనింగారు మొత్తం వ్యవహారంపై నమ్మకం కుదరక ఊగిసలాడుతుంటే జగపతిరాజు అతడిని ఉత్సాహపరచి, అయిదారు వందలమంది సైనికులతో వెంటవేసుకొని, ఆనందగజపతి సైన్యంపై యుద్ధం చేయనారంభించారు. ఆ యుద్ధంలో వత్సవాయి జగపతికి తుపాకిగుండు తగిలి చనిపోయాడు. రావునీలాద్రిరాయనింగారు పారిపోయి జూపల్లెవారి సంస్థానంలో తలదాచుకొన్నాడు. అంతట ఆనందగజపతి వుండూరువద్ద డేరాలు వేయించి నీలాద్రిరాయనింగారు చామర్లకోటకు వస్తాడని కాపుకాసాడు. నీలాద్రిరాయనిం గారు పరారీ అయినాడని గ్రహించి, ఆనందగజపతి చామర్లకోటవచ్చి కోటలో తొలగించబడిన ఇంగ్లీషువారి జండాను తిరిగి నిలబెట్టి, అక్కడ కాపలా కాస్తున్న ఫ్రెంచివారిని తరిమేసాడు. వారు తిరిగి కాకినాడ ఓడమీదకు పోయారు.

ఆనందగజపతి తనసైన్యంతో చామర్లకోటనుంచి రాజమహేంద్రవరం ప్రవేశించగా, అక్కడ అతనికి స్ఫోటకం సోకి 1760లో మరణించాడు.



ఆనందగజపతి మరణించాడన్న వార్త తెలుసుకొన్న నీలాద్రిరాయనింగారు, రావు మహీపతిరాయనింగారు చిన్న పడవలలో నాలుగువేలమంది సైన్యంతో పిఠాపురం కోటలోకి ప్రవేశించి కోల్పోయిన సంస్థానాన్ని చేజిక్కించుకొన్నారు.

అంతట గోల్కొండనుంచి నవాబు అమీరు నిజామల్లిఖాను బహదరు వారు రాజమహేంద్రవరం వచ్చినపుడు, పూసపాటి పెదవిజయరామరాజు భార్య

16. కోస్తాజిల్లాల నుంచి ఫ్రెంచివారి నిష్క్రమణపై పుస్తకంచివరలో విపులమైన వ్యాసం కలదు.

చంద్రయ్యగారు[17] తమ వకీళ్లను పంపి భేటీ ఏర్పాటుచేయమని కోరారు.  నిజామల్లి ఖాను చంద్రయ్యగారికి "మీ వంశస్థులను లేదా మీమనసుకు నచ్చినవారిని తీసుకు తెచ్చుకొన్నట్లయితే వారికి సంస్థానము ఖాయం చేస్తానని" వర్తమానం పంపాడు. ఆ ప్రకారముగా పూసపాటి చంద్రయ్యగారు తమకు జ్ఞాతి (అర్ధభాగ హక్కుదారుడు) అయిన పూసపాటి విజయరామరాజుకి సంస్థానాన్ని ఇవ్వమని కోరగా నిజామల్లిఖాను ఆ ప్రకారం నోబతులు (రాజపత్రం) జారీచేసాడు.  అంతేకాక పిఠాపురం తాలూకాను మహీపతిరాయనింగారికి, పెద్దాపురం తాలూకా వత్సవాయి జగపతిరాజు కుమారుడైన, వత్సవాయి తిమ్మరాజుకు ఖాయంచేసి వారిచ్చిన కానుకలు స్వీకరించి, అక్కడినుండి తిరిగి గోల్కొండ వెళ్ళిపోయాడు.



పెదమహీపతిరాయనింగారు పిఠాపురంలో రాజరికము చేస్తూండగా, నీలాద్రిరాయనింగారు పెత్తనం సాగిస్తూండేవారు.  (పెదమహీపతికి పెదనాన్న కొడుకు ఈ నీలాద్రి). ఈ వ్యవహారం పెదమహీపతి బావమరిది చింతపట్ల రామారాయినింకి నచ్చలేదు. ఈ నీలాద్రిరాయినింను దూరంపెట్టకపోతే ఎప్పటికైనా సంస్థానంలో వాటా ఇమ్మంటాడని పెదమహీపతిని హెచ్చరించేవాడు ఇతను. దానితో పెదమహీపతి నీలాద్రిరాయినింకు కల ఆదాయమార్గాలను నిలిపివేసాడు. తనను దూరంపెట్టటాన్ని గ్రహించిన నీలాద్రిరాయనింగారు ఒక రోజు పిఠాపురం సంస్థానంలో సగంవాటా తనకు ఇవ్వాల్సిందేనని కుండబద్దలు

17. బొబ్బిలి యుద్ధంలో తాండ్రపాపారాయుని చేతిలో మరణించిన పెదవిజయరామరాజు భార్య పేరు చంద్రయ్య. జమిందారీ తమకే ఇప్పించమని ఈమె నిజామల్లిఖానుడుని (నిజాముల్ ముల్క్) కోరినపుడు మీ సంస్థానం మూడు సంవత్సరాలుగా శిస్తు కట్టటం లేదు కనుక దాన్ని మీకు ఇవ్వటం కుదరదని తెగేసి చెప్పాడు.ఆనందరాజు హైదరాబాదు మీదకి వస్తాడని పుకారు లేపాడు కనుక సైన్యాన్ని తీసుకొని నేను ఇక్కడకు వచ్చాను. నాకు ఎంతోఖర్చు అవుతున్నది మీవల్ల. మీరిచ్చే బహుమానాలు నా ఒక్కరోజు ఖర్చుకు సరిపోవు అన్ని వీరిని వెళ్ళిపొమ్మన్నాడు.అప్పుడు పూసపాటివారి మంత్రి బుర్రా బుచ్చన్న గారి మంత్రాంగం వల్ల నిజామల్లిఖానుడు తన పట్టువీడి తక్షణం పాతబాకీలు తీర్చిస్తే సంస్థానం విజయరామరాజుకి ఇవ్వటానికి అంగీకరించాడు. ఆ డబ్బు అప్పటికప్పుడు ఒక షాహుకారు వద్ద అప్పుతీసుకొని కట్టటంతో, విజయరామరాజుకు జమిందారీ ఇచ్చి, తన ఒళ్ళో కూర్చొబెట్టుకొని నువ్వు చాలాకాలం ప్రభుత్వం చేస్తావని దీవించాడు నిజాముల్ ముల్క్ (కళింగము పూర్వోత్తరము-కైఫియ్యతు)

కొట్టారు. సంస్థానంలో ఉండే ప్రముఖులు ఇరు పక్షాలమధ్యా చీలిపోయారు. చిత్రాడ రావుపాపయ్య, సూరయ్యలు నీలాద్రిరాయనింగారి వైపు ఉండగా చాలామంది వంటర్లు, వెలమదొరలు పెదమహీపతి రాయనింగారి వైపు నిలిచారు.

ఒక ఆరునెలలు గడిచేసరికి నీలాద్రివర్గానికి రసదు లేక (ఆదాయం) ఇబ్బంది పడుతూండటంతో, రావు పాపయ్య, సూరయ్యలు నూటయాభైమంది అనుచరుల్ని వెంటపెట్టుకొని పిఠాపురతాలూకాలో కొన్ని గ్రామాలను దోచుకొని, భోజనసామాగ్రిని తెచ్చి దోమాడవద్ద దాచిపెట్టి అక్కడ కాపుచేసుకొని ఉన్నారు. ఈ పాపయ్య, సూరయ్యలను చంపిచేస్తే నీలాద్రిరాయనిం సమస్య తీరిపోతుందని చింతపట్ల రామాయినిం చెప్పినమాటలు నమ్మిన పెదమహీపతిరాయనిం, ఆరువందలమంది సైన్యాన్ని వెంటవేసుకొని దోమాడ[18] వద్ద చేసిన యుద్ధంలో పాపయ్య, సూరయ్యలకు తుపాకిగుండు తగిలి కిందపడిరి. అంతట ఆ ఇద్దరిని చింతపట్ల రామాయినిం గారు తలలు కోయించిరి. నీలాద్రిరాయనిం తన అనుచరులను వెంటబెట్టుకొని జూపిల్లి సంస్థానములోని రాఘవపురమునకు పారిపోయాడు.

ఆ తరువాత రెండేళ్ళు పాలించిన పెదమహీపతి రాయనిం క్రీశ.1765 పార్థివనామసంవత్సరంలో దేహం చాలించినారు. ఈయన ఇరవై సంవత్సరాలు దొరతనం చేసాడు. ఈయనకు సంతానం లేదు. తరువాత నీలాద్రిరాయనిం అజ్ఞాతంనుంచి బయటకువచ్చి, పెద్దాపురం జమిందారు వత్సవాయి జగ్గరాజు మద్దతుతో పిఠాపురం సంస్థానాన్ని తిరిగి కైవసం చేసుకొన్నాడు. ఈ నీలాద్రి రాయనింకి పెదవెంకట్రావు, యెర్రవెంకట్రావు, బుచ్చివెంకట్రావు, ముద్దువెంకట్రావు అని నలుగురు కుమారులు. నీలాద్రిరాయినిం తరువాత ఇతని పెద్దకొడుకు పెదవెంట్రాయినిం పిఠాపుర సంస్థానాధీశుడు అయ్యాడు.

పెదవెంకట్రాయినిం పిఠాపురం దొరతనం చేస్తున్నప్పుడు ఆయన తమ్ముడు ముద్దువెంకట్రావు తమకు దొరతనం కావలెనని కుట్రచేసి, అవసరాల మంగయ్య అనే ఒక వకీలును నియమించి బందరు కోర్టులో అప్పీలు చెయ్యమని

---

18. దోమాడవద్ద జరిగిన ఈ యుద్ధమును “దోమాడ యుద్ధము” పేరుతో 1921లో సోమరాజు రామానుజరావు ఒక చారిత్రిక నవలగా రచించారు. అందులో ఈ యుద్ధం 1763లో జరిగినట్లు పేర్కొన్నారు.

పురమాయించాడు. ఈ విషయం తెలుసుకొన్న పెదవెంకట్రావు తనమనుషులైన అవసరాల హనుమంతు, ఫత్తిఅల్లి జమిందారును పంపించి, ఆ మంగయ్యను దారి మధ్యలో ఏలూరువద్ద పట్టుకొని బంధించి సర్పవరం బావనారాయణస్వామి దేవాలయంలో పెట్టి ఘోరంగా అవమానం చేసాడు. పెదవెంకట్రాయినిగారు క్రీశ.1770 నుండి 1772 వరకూ దొరతనము చేసి మసూచివచ్చి మరణించాడు. ఈయన కుమారుడి పేరు బుచ్చి కుమారవెంకట్రాయినిం.

ఈ సమయములో శిస్తులు కట్టని కారణంగా కంపనీవారు సంస్థానమును జప్తు చేసుకొని నిర్వహణ నిమిత్తం పెద్దాపురం జమిందారు అయిన వత్సవాయి తిమ్మరాజుకు అప్పగించారు. బుచ్చి కుమారవెంట్రాయినింగారు జప్తు విడిపించుకొని క్రీశ.1775 లో పిఠాపుర సంస్థానాధిపతి అయ్యాడు. ఈయన పిఠాపురంలో కుంతీమాధవస్వామి దేవాలయముకు ముఖమంటప ప్రాకారము కట్టించి శ్రీస్వామికి ఆభరణములు చేయించి, నూతన చూడిగుదత్త అమ్మవారి విగ్రహాన్ని ప్రతిష్టింపచేసారు. శ్రీస్వామికి నిత్యపూజల ఖర్చు కొరకు పూర్వంనడచిన విధంగా నవఖండ్రగ్రామాన్ని  ఏర్పాటుచేసినాడు.

పిఠాపురంతాలూకా నుండి రావాల్సిన శిస్తు బాకీపడటంతో క్రీశ.1787లో కంపనీవారు కుమార వెంకట్రాయినింను బందరు రమ్మనమని సైన్యాన్ని పంపించారు.  కుంపణీవారి చిత్తవృత్తి ఎలాఉంటుందోనని సందేహించిన బుచ్చి కుమారవెంకట్రాయినిం, ఆయన దివాను ఆవంత్స వెంకట్రాయుడు, మేనమామ చింతపట్ల మాధవరాయినిం లు– కుంపనీ వారి సైన్యం కన్నుగప్పి రంప మార్గాన పాలవంచకు పారిపోయారు. కుమార వెంకట్రాయనిం, దివాను వెంకట్రాయుడున్ను అక్కడే దివంగతులయ్యారు. చింతపట్ల మాధవరాయనిం మాత్రం పిఠాపురం తిరిగి వచ్చాడు.

క్రీశ.1794 ఆనందసంవత్సరంలో బుచ్చి కుమారవెంకట్రాయనిం కుమారుడయిన వెంకటనీలాద్రిరాయనిం గారికి కంపనీ వారు తిరిగి జమిందారీ అప్పగించారు. వీరికి పుత్రసంతతి లేనందున చిత్రాడ రావువెంకయ్యగారి కుమారుణ్ణి దత్తుతీసుకొని బుచ్చివెంకట్రాయినిం అని నామకరణం చేసి పెంచుకొంటున్నారు.

అప్పటినుంచీ నేటివరకూ అనగా క్రీశ.1814, భావనామ సంవత్సరం ఆషాడ మాసం పదవతారీఖు వరకూ వారు పిఠాపురం కోటలో నివసిస్తూ ఉన్నారు. (ఇది కైఫియ్యతు వ్రాసిన తేదీ).



# కిమ్మూరు కైఫియ్యతు

*పెద్దాపురం తాలూకాలో కింమ్మూరు వగైరా కింమ్మూరు పరగణా గ్రామముల కైఫియ్యతు*

ఆంధ్రదేశమునందు వింధ్యపర్వతమునకు సమీపంలోఉన్న మహా దరణ్యము వ్యాఘ్రాది మృగములచేత నిండి ఉండగా, కలియుగమునందు కిమ్మీహరుడనే ఒక కిరాతరాజు నివసించేవాడు. ఇతని భార్యపేరు లింగమ్మ, కుమారుని పేరు సారంగుడు. లింగమ్మ అనే ఆయమ్మ తనపేరిట లింగంవత్తి అనే ఒకపల్లె కట్టించినది. ఆ కిరాతరాజు కొంతకాలమునకు కాలముచేసెను. ఆ తరువాత అతని కుమారుడు పెద్దవాడయి తన తండ్రిపేరిట కిమ్మూరు అనే గ్రామము నిర్మించి ఆ చుట్టుపక్కల ఉండే అరణ్యమును చదునుచేయించి గ్రామమును విస్తరింపచేసెను.

కిమ్మూరుకు ఉత్తరభాగమున ఎగువకొండలలో పుట్టి ప్రవహించే ఏలేరు అనే నది కలదు. ఈ నదికి తూర్పుభాగమున పూర్వకాలమందు యెలావతిదేవిచే ప్రతిష్ఠించబడిన యెలాంబిక అనే దేవీక్షేత్రము కలదు. ఈ క్షేత్రమందు పూర్వ కాలములో కిరాతులచే నిర్మించబడిన పల్లె ఒకటి యేలేశ్వరము పేరుతో వాడికె అయిఉండెను. ఈ క్షేత్రము చుట్టుపక్కల అనేక పల్లెలను ఈ సారంగుడు అనే కిరాతరాజు ఏలుతూ ఉండేవాడు. ఈ సారంగుని తరువాత అతని కుమారుడు మల్లినాథుడు రాజ్యమేలెను. ఇతను కిమ్మూరుకు కొంచెం దూరములో మల్లవరము అనే గ్రామమును నిలబెట్టెను.

కాలక్రమేణా పెద్దాపురమునకు ప్రాచీననామమైన తమిరె ఇంకా కట్టమూరు, కాట్రావులపల్లి, గుడవాడ గ్రామములు కిమ్మూరులో కలిసాయి. వీటన్నింటిని

---

1. కైఫియ్యతు నంబరు M 42-374-94 పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము. కిమ్మూరు తూర్పుగోదావరి జిల్లా, అడ్డతీగల మండలానికి చెందిన గ్రామము. ఇది పెద్దాపురం నుండి 33 కి.మీ దూరంలో కలదు.

కలిపి కిమ్మూరు సీమగా పిలుచుకొనేవారు. ఈ గ్రామములలోని పశువులను పులులు ఎత్తుకుపోవుచుండేవి. అపుడా కిరాతరాజు కొండలనడుమ రాళ్ళు, మట్టితో ఎత్తైన గోడలనునిర్మించి వాటిమధ్య ఆ పశువులను ఉంచి వాటిని వ్యాఘ్రాదుల నుండి రక్షణ కల్పించాడు. గోవులు రక్షింపబడిన చోటు కనుక అక్కడ ఏర్పడిన వూరికి గోరంట అనే పేరువచ్చినది.

ఏలేరు నదిఒడ్డున ఒక ప్రాంతములో పశుగ్రాసం విస్తారముగా ఉండేది. మన్యప్రాంతములో లభించే చింతపండు ఇతర ధాన్యాదుల నిమిత్తము దూర ప్రాంతములనుండి ఎద్దులబండ్లపై వచ్చిన వర్తకులు ఈ పశుగ్రాసం లభించే ప్రాంతంలో తమ ఎద్దులను మేపుకొని, వెళిపోయేటపుడు కావలసినంత గ్రాసము ఎత్తుకొని వెళుతూ ఉండేవారు. కాలక్రమేణా అక్కడ ఏర్పడిన గ్రామమునకు గోవాడ అన్న నామము వాడిక ఐనది.

ఈ గ్రామములన్నీ ఆరువందల ఇరవై సంవత్సరముల వెనుక పిఠాపురం శ్రీకుంతీమాధవ స్వామి సన్నిధిలో పట్టాభిషిక్తుడయిన శ్రీ వల్లభదేవచక్రవర్తి పరిపాలనలో ప్రోలునాడు సీమ పేరుతో చెల్లుతూ ఉండేవి. సదరు వల్లభదేవ చక్రవర్తి క్రీశ. 1202 దుంధుబి నామసంవత్సరం పైనచెప్పిన గుడవాడ గ్రామమును పిఠాపురంలోని కుంతీమాధవదేవర నిత్యపూజలకొరకు మాన్యంగ సమర్పించు కొన్నారు.

ఇటీవల సొలిమేశ్వరము, కాంద్రకోట, దిగువల్లి, వడ్లమూరు, జగపతిరాయ పురము, కిమ్మూరు, కిర్లంపూడి, ఏలేశ్వరం తదితర గ్రామములు వత్సవాయిగారికి (పెద్దాపురం జమిందారు) స్వాధీనమయ్యాక, వత్సవాయి పెదరాయ జగపతి రాయలు తమపేరిట జగ్గంపేట అనే గ్రామమును కట్టించినారు.

అటుపిమ్మట కాకతిప్రతాపరుద్రదేవ మహారాజు ఆంధ్రదేశాన్ని పాలించే టపుడు, వారి సామంతులైన పెదమల్లరాజు, చినమల్లరాజు అనే ఇరువురు ఈ ప్రాంతాల ప్రభుత్వము చేస్తూ, బెండపూడి అనే గ్రామమువద్దనుండే ఓకొండపై ఒక కోటకట్టించి అందులో నివసిస్తుండేవారు. వీరు యాభయి సంవత్సరములు పాలనచేసారు.

ఆ తరువాత కొండవీటిరెడ్లు తరపున కూనమనాయుడు అనే ఆయన ఆంధ్రదేశమును గోదావరి మొదలు కోనవరకూ (కోనసీమ) రాజ్యమునేలెను.

ఆయన కుమారుడు ముమ్మిడినాయకుడు కోరుకొండ పట్టణములో తనతండ్రి కూనమనాయుడు కట్టించిన కోటలో నివాసముండి ఈ ప్రాంతమున రాజరికము చేసాడు. ఈ ముమ్మిడినాయకుడు కోరుకొండ శ్రీరంగనాయకుని ఆలయములో క్రీశ. 1353 విజయనామసంవత్సర పాల్గుణమాసంలో వేయించిన ఒక శాసనం ఆలయమునకు ఎదుట నిలువున పాతిఉన్నది.

తరువాత కాటమరెడ్డిగారి కుమారుడు మారారెడ్డి అతని మనుమడు వేమారెడ్డి ఆంధ్రదేశమును ఏలేకాలములో శ్రీమత్కుమారారామాచాళుక్యాది భీమేశ్వరుని ఆలయమునకు పూర్వభాగమందు మూడు క్రోసుల దూరంలో వేమవరము అనేగ్రామము నిర్మాణము చేయించినారు. వీరు చాళుక్యభీమవరపు భీమేశ్వరదేవరకు, ద్రాక్షారామ భీమేశ్వరదేవరకు, పిఠాపురం కుంతీమాధవదేవరకు, కోరుకొండ నృశింహస్వామివారికి మరియు ఇతర శివాలయములకు మండపప్రాకారాదులు కట్టించి భోగరాగాదులు జరిపించేవారు. ఇదికాక వేమారెడ్డి, రాజమహేంద్రవరమునకు ఆగ్నేయభాగములో ఆమడదూరములో (పది మైళ్ళు) పూర్వము చాళుక్యరాజులు కట్టించిన కొండమీద కోటకు సమీపములో ఒక గ్రామమును నిర్మించాడు. అది వేమగిరి అని పిలువబడుతున్నది.

వేమారెడ్డి తరువాత, రెడ్డి పెదవెంకప్ప అనే ఆయన కొవ్వాడ, గురుగుమిల్లి, కూటాల, కొత్తపల్లి, కిమ్మూరు, పోలునాడు ప్రాంతాలలో అధికారము చేస్తుండగా– అతనివద్ద నమ్మకముగా పనిచేసే ఇసికపిల్లి పెద్దాపాత్రుడు అనే అధికారికి కిమ్మూరు సీమను ఇచ్చి, దానిపై వచ్చే ఆదాయంలో ఆ పెద్దాపాత్రుడి వెంట ఉండే సిబ్బంది ఖర్చులు మినహాయించుకొని మిగిలిన పైకము తనకు జమచేసేలా ఒక అనుమతిని పత్రాన్ని ఇచ్చాడు.

అప్పుడు పెద్దాపాత్రుడు తమిరె అనే గ్రామానికి ఉత్తరభాగమందు ఉన్న రెండు చిన్నకొండలను చదునుచేయించి ఒక కోట కట్టించి, దానికి మట్టిగోడలు ప్రహరీగా ఏర్పరచి, కోటకు దక్షిణంవైపున ఒకగ్రామమును ఏర్పరచి దానికి పెద్దాపురమని పేరు పెట్టినాడు.

ఆంధ్రకళింగదేశములు గజపతి ప్రతాపరుద్రగజపతి మహారాజు ఏలుబడిలో ఉన్నప్పుడు, శ్రీకృష్ణదేవరాయలు తన చతురంగబలసమేతుడై పెద్దాపురము మీదుగా కటకమునకు (ఒరిస్సా, కటక్) వెళ్లినపుడు, ఆ సేనల హడావిడిచేత ఈ ప్రాంతము కొంత కళ తప్పినది. ఆ తరువాత మరలా గజపతివారు రాజరికం

చేసేటపుడు రెడ్డి వెంకటప్ప అజమాయిషీ క్రింద  కొవ్వాడ, గునుపిల్లి, కొత్తపల్లి, కిమ్మూరు, పోలునాడు ఉండేది.  రెడ్డివెంకటప్ప తరపున కిమ్మూరు సీమను, ఇసుకపల్లి పెరుమాళ్లు పాత్రుడు ఏలుచుండిరి.  రెడ్డివెంకటప్పగారు చనిపోయాక రెడ్డివారితాలూకు విస్సామ అనే ఆమె ప్రభుత్వం చేస్తూ ఉండేది.

రెడ్డిగారివద్ద వత్సవాయి తిమ్మరాజు అనే రాజకుమారుడు రెండువేలమంది సైన్యంతో రక్షణభారం వహించేవాడు. ఆ సైన్యనిర్వహణ ఖర్చులనిమిత్తం ముల్లేరు, చాగలనాడు, కిమ్మూరు పరగణాలు, తోటపల్లి, జెడ్డంగి గ్రామాలతోసహా తిమ్మరాజుకు రెడ్డిగారు తనఖావ్రాయించి ఇచ్చినారు.  ఆ విధంగా వత్సవాయి తిమ్మరాజు, లోగడ పెద్దాపాత్రుడు కట్టించిన పెద్దాపురం కోటలో ప్రవేశించి తన పరగణాలను స్వాధీనంలోకి తెచ్చుకొన్నాడు.  తిమ్మరాజుకి పినతల్లి కుమారుడైన గణపతినారాయణరాజు అనే ఆయన పయిన వ్రాసి ఉన్న గ్రామాలలో చిల్లంగి మరియు ఇంకా కొన్ని గ్రామములు వత్సవాయితిమ్మరాజు నుండి బహుమతిగా పొంది, చిల్లంగిలో మట్టికోట ఒకటి కట్టుకొని ఆ గ్రామముల ఆదాయమును అనుభవిస్తూండేవాడు.

వత్సవాయి తిమ్మరాజు కుమారుడు జగపతిరాజు. వీరి కుమారుడు కీర్తి తిమ్మరాజు. ఇతను గణపతినారాయణరాజుని చంపి చిల్లంగికోటను వశబరచు కొని, ఆ గ్రామములను కిమ్మూరు పరగణాలలో కలుపుకొన్నాడు.  కీర్తితిమ్మరాజు కొడుకు జగపతిరాజు.  ఇతనికి ఉద్దండరాయజగపతి అనే పేరుకలదు.

కిమ్మూరు గ్రామానికి పశ్చిమమున నాలుగుక్రోసుల దూరంలో రాజపూడి అనే గ్రామం కలదు.  ఈ గ్రామంలో అవసరాల పెద్దిరాజు పేరుగల గోలకొండ వ్యాపారి నివసిస్తుండేవాడు.  ఇతని వద్ద పాలేరుగా పనిచేసిన సీతడు కాలక్రమేణా గోల్కొండ ప్రభుత్వములో సైన్యాధ్యక్షునిగా ఎదిగి సితాఫిఖానుడు అనే బిరుదుతో మరలా రాజమహేంద్రవరం తాలూకాకి గోల్కొండ ప్రతినిధిగా వచ్చాడు.  తన పాతయజమాని అయిన అవసరాల పెద్దిరాజును తనవద్ద దివాన్‌గా పెట్టు కొన్నాడు.  వీరిద్దరూ యోచన చేసి సురక్షితమైన ప్రదేశముగా ఎంచి రాజపూడిలో ఒక రాతికోటను నిర్మించారు.  దీన్ని కేంద్రముగా చేసుకొని మన్యం మొత్తాన్ని అదుపులో ఉంచుకొన్నారు. మల్కినేబు ధాటికి తట్టుకోలేక సితాభిఖానుడు రాజ మహేంద్రవరం కోటను విడిచి రాజపూడి కోటలో తలదాచుకొన్నాడు. తురకసైన్యం

రాజపూడికోటపై దాడి చేసినపుడు ముప్పైరోజులపాటు లోపలనుంచి సితాఫి ఖానుడు ఎదురుదాడి చేసాడు. వారి ముందు తాళలేక కొత్తపిల్లి అడవిలోకి పారి పోగా, సైన్యం పట్టుకొని సితాఫిఖానుని తలనరికి చంపివేసింది. ఆనాటినుండి రాజపూడి కోట నిర్జనమైపోయింది.

రాజపూడికి ఈశాన్యభాగమందు రెండు ఆమడలదూరంలో పూర్వం సారంగుడిలొద్ది పేరిట ఉన్న ఒక పల్లపుప్రాంతంలో వత్సవాయి కీర్తితిమ్మరాజు ఇళ్ళు, గాదెలు కట్టించి నివాసయోగ్యంగా చేసాడు. అప్పటినుంచి అది లొద్ది గ్రామంగా పిలవబడుతూన్నది.

కీర్తితిమ్మరాజు కొడుకు జగపతిరాజుకు తిమ్మరాజు, బలభద్రరాజు అనే పేర్లుకల ఇద్దరు కుమారులు. కీర్తితిమ్మరాజు మరణించేసమయానికి వీరిద్దరూ చిన్నవారు కనుక, వీరితల్లి రాగమ్మ పెద్దాపురం కోటలో ఉంటూ సంస్థాన వ్యవ హారములు చూసుకొంటూ ఉండేది. (రాగమ్మను హాజీహుస్సేను మోసంచేయటం, పెద్దాపురం కోటలో ఆత్మాహుతి స్త్రీలందరూ ఆత్మాహుతి చేసుకోవటం మొదలైన ఉదంతాలు చామర్లకోట కైఫియ్యతులో కలవు)



# చెల్లూరు కైఫియ్యతు[1]

*రాజమహేంద్రవరము జిల్లా చెల్లూరు కైఫియ్యతును చెల్లూరు కరణము చెల్లూరు శీతన్న వ్రాయించినది.*

పూర్వకాలమందు ఈ ప్రాంతములో అగస్త్యమహాముని తపస్సు చేసుకుంటూ ఉండేవారు. అక్కడ విస్తరించి ఉన్న పుష్పవనంనుండి పుష్పాలను శిష్యులతో తెప్పించుకొని మాలలుగా గుచ్చి దేవతార్చన చేస్తూ, సమీపమునందు కల రుషిపల్లెలో దేవతార్చనకు పూలను పంపించేవారు. ఆ రుషిపల్లి సమీపంలో అగస్త్య గుండము అనే ఒక చెరువు తవ్వించినారు. పులులు, సింహాలు వంటి క్రూరమృగములు, లేళ్ళు, జింకలు వంటి సాధు జంతువులు ఆ చెరువునీరు తాగటానికి వచ్చి ఏ వైరమూ లేకుండా కలసిమెలసి సంచరించేవి.

ఇలా జరుగుతూ ఉండగా ఒకనాడు ఆ రుషిపల్లెకు సమీపములో దక్షిణ బాగమందు అగస్త్యులవారు ఒక ఈశ్వరలింగమును ప్రతిష్ఠచేసినారు. దీనికి అగస్త్యేశ్వరుడు అని పేరు వచ్చినది. ఆ సమీపమునందే విష్ణు విగ్రహమును కూడా ప్రతిష్ఠచేసారు. అగస్త్య మహాముని ఇక్కడ చాలాకాలము తపస్సు చేస్తూ ఉండి, తన శిష్యవర్గముచే పుష్పవనములలో పూలను సేకరించి వాటిని పూల చెండ్లగా గుచ్చి రుషిపల్లె లోని ఉత్తమ పురుషులైనవారి పూజకువేళకు అందిస్తుండే వారు గనుక ఈ గ్రామమునకు చెండ్లూరు అనే పేరు వచ్చింది. ఆ ఆశ్రమం ద్వాపరయుగాంతం వరకు ఉండినది. కాలక్రమేణా ఈ ఊరిపేరు చెల్లూరుగా మారినది.

చంద్రవంశపురాజైన విజయాదిత్యుడు (458-480) తన చతురంగ బలాలతో దిగ్విజయయాత్ర జరుపుతున్నప్పుడు, పశ్చిమదేశమందు త్రిలోచన పల్లవుడితో తలపడి విధివశాత్తు మరణించెను. ఆ సమయంలో విజయాదిత్యుని

1. కైఫియ్యతు నంబరు M 42-374-108 పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము,

భార్య ఆరునెలల గర్భవతి. ఈమె ముడిలేము అనే అగ్రహారమునకు పోయి అక్కడి వాస్తవ్యుడు అయిన విష్ణుభట్ట సోమయాజి అనే ముని సంరక్షణలో విష్ణువర్ధనుడు అనే కుమారుడిని కన్నది. ఆ కుమారుడు తల్లినుండి తన కథను తెలుసుకొన్నాడు. చాళుక్యగిరి యందు కొలువున్న నందాభగవతి గౌరి మహాదేవి కరుణతో తన తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించుకొన్నాడు. ఇతని కుమారుడి పేరు విజయాదిత్యవిష్ణువర్ధనుడు. ఇతని భార్య పల్లవ వంశపు చిన్నది.

వీరచోడమహారాజు రాజమహేంద్రవరమునకు ప్రాచీన నామమైన రాజానగరమందు సింహాసనాన్ని అధిరోహించాడు. ఇతనివద్ద, మద్గలగోత్రోద్భవుడైన పోతనార్యునికి, కన్నమాంబకు జన్మించిన మేడమార్యుడు[2] అనే బ్రాహ్మణోత్తముడు సేనాపతిగా ఉండేవాడు. ఇతడు వేదవేదాంగములు చదువుకొన్న ధనుర్విద్యాపారంగతుడు. భుజబలపరాక్రమసంపన్నుడు. మేడమార్యుడు వీరచోడునకు అనేక యుద్ధములలో జయము సమకూర్చెను. ఇతడు పిఠాపురము,ద్రాక్షా రామము లందు రెండు సత్రములు నిర్మించి బ్రాహ్మణులకు నిరతాన్నదానం జరిగేలా చూసాడు. చెల్లూరు గ్రామములో ఒక వైష్ణవాలయమును నిర్మించి ఒక కోనేరును తవ్వించాడు.

చెల్లూరు గ్రామమునకు ఆగ్నేయమున అరక్రోసెడు దూరంలో కల కాలేరు అనే ఒక గ్రామము పూర్వమున జైనుల పట్టణము అని చెపుతున్నారు. ముక్కంటీశ్వర మహారాజు కాలమందు జైన బ్రాహ్మణులు అంతరించిపోయిన తరువాత కాలేరు అనే గ్రామమును దేవబ్రాహ్మణులకు పోషణార్థము అగ్రహారముగా ఇచ్చారు. దీనికి సంబంధించిన శిలాశాసనము లేవీ ఆ గ్రామములో కనిపించవు. ఇక్కడ నివసించే బ్రాహ్మణుల సంఖ్య క్రమేపీ తగ్గిపోవటంతో కాలేరు కాలక్రమేణా పాడు పడిపోయింది.

వీరచోడ మహారాజు చెల్లూరు గ్రామమును దక్షారామంలో కల సత్రమునకు మాన్యంగా ఇచ్చిన సమయంలోనే ఈ కాలేరు గ్రామమును చెల్లూరు నివాసి అయిన విష్ణుభట్టారకుడు అనే బ్రాహ్మణునికి దానం చేసాడు. ఈ దానముకూడ లిఖతపూర్వకముగా ఒక రాగిరేకుపై కలదు.

2. మేడమార్యుడు వీరచోడుడు వద్ద క్రీశ. 1087-1093 మధ్య సేనాపతిగా ఉండేవాడు. ఆంధ్రుల చరిత్రము, చిలుకూరు వీరభద్రరావు

రాగిరేకులపై ఇచ్చిన శాసనములు కొద్దికాలములోనే పాడయి అక్షరములు కనిపించకుండా పోతాయి కనుక, చెల్లూరు పూర్వ గ్రామస్తులు ఆ వూరిలోని శివాలయము వెనుకవైపున ఇటుకలతో నేలపై కుండవలె కట్టి ఆ కుండలో ఆ గ్రామానికి చెందిన రాగిరేకు శాసనములను, త్రిభువనాంకుశ ముద్ర, (తూర్పు చాళుక్యుల రాజముద్ర) వరాహలాంచనములను (కాకతీయుల రాజముద్ర) ఉంచి మట్టి, తేమ తగులకుండా భద్రపరిచేవారు. కొన్నేళ్ళుగడిచాక ఆ ఇటుకలను కొంతమంది అరుగులు నిర్మించుకొనుటకొరకు తవ్వుకొని పోవటం గమనించిన చెల్లూరు వాసి రేమెల్ల సూర్యనారాయన శాస్త్రులు, ఆ ప్రదేశములో తవ్వకాలు చేసినపుడు అతనికి కొన్ని రాగిరేకు శాసనములు, రాగి పలకలు[3] కనిపించాయి. వీటిని ఆయన దాచివుంచినాడు. సూర్యనారాయణ శాస్త్రులు మరణించాక ఆయన కుమారుడు లక్ష్మినారాయణ ఆ శాసనములకు నకళ్ళు తీయించి, రాజముద్రలను ప్రభుత్వము వారికి ఇచ్చివేసాడు.

ఆ తరువాత వచ్చిన కాకతీయ ప్రతాపరుద్రుడు, రెడ్డిరాజులు జల్లూరులో పూర్వపాలకులు సాగించిన వ్యవహారములనే కొనసాగించారు.

కుమారగిరిరెడ్డి వేంగిదేశమును పాలించే సమయములో, చెల్లూరు గ్రామమునకు ఆమడదూరమున కొమరగిరి అనే అగ్రహారము కట్టించి బ్రాహ్మణులకు ఇచ్చాడు. ఆ బ్రాహ్మణుల వివరాలు ఇలా ఉన్నాయి. శొంటివారు, ఆదిరాజువారు, వెదూరు వారు, కుంభపాటివారు, హరిసోమాజివారు. ఈ అయిదు కుటుంబాల పోషణకు కొండెవరములో కొంతభూమిని దానంచేసి తామ్ర శాసనములు వ్రాయించినాడు. ఈ అయిదుకుటుంబాల వారు పారంపర్యముగా కొండెవరములో ఇచ్చిన భూమిని

---

3. అలా చెల్లూరులో లభించిన ఒక తామ్రశాసనం ద్వారా చాలా విలువైన చారిత్రిక విషయాలు తెలిసాయి ఈ తామ్రపత్రం ద్వారా వీరచోడుడు వేంగిరాజ్యాన్ని క్రీశ.1078 నుండి 1104 వరకు పాలించినట్లు, ఇతను క్రీశ 1100 లో ఈ చెల్లూరుకు సమీపంలో ఉన్న కాలేరు అనే గ్రామాన్ని గోపాలకృష్ణస్వామి ఆలయానికి ధూపదీప నైవేద్యములకు, జీర్ణోద్ధరణ కొరకు దానంగా ఇచ్చినట్లు తెలిసింది.

చెల్లూరులో పోతనామార్యుని కుమారుడైన మేడమార్య/గుణరథభాషణ నిర్మించిన వైష్ణవాలయం కుళోత్తుంగుని కాలంలో నిర్మించిన పురాతనమైన ఆలయంగా S.R. Bala subrahmanyam వ్రాసిన Later Chola Temples అనే పుస్తకంలో పే.నం 117 లో పేర్కొన్నారు.

అనుభవిస్తూ ఉండగా, నూరు సంవత్సరముల కిందట ఆ అగ్రహారము అగ్నికి తగలబడిపోయినది. కుమారగిరిరెడ్డి ఇచ్చిన తామ్రశాసనము కూడా కాలిపోయినది.

కొన్ని దినముల తరువాత మద్దాల అప్పలరాజు గారు అనే ఆయన కొమరగిరి అగ్రహారంలోని బ్రాహ్మలకు ఇండ్లుకట్టించి అగ్రహారము విస్తరింప చేసాడు. వీరు మరికొన్ని మాన్యములు బ్రాహ్మలకు ఇచ్చి, కొమరగిరి అగ్రహారమునకు ఉత్తరపువైపున చెరువు తవ్వించినారు.

ఈ కొమరగిరి గ్రామమునకు దక్షిణముగా ఉండే తమ్మవరం గ్రామములో చాన్నాళ్ళక్రితం తమ్మసాని కట్టించిన మేడ ఒకటి పాడుపడిఉన్నది. ఆ స్థలములో కోటగిరి మాదన్న అనే వెలమవారు ఒక విష్ణు ఆలయము కట్టించినాడు. కొమరగిరి గ్రామములో మాల్యాల వెంకట్రావు ఒక శివాలయము కట్టించాడు. వీరే విష్ణువుకు, శివుడికి అరవై పుట్ల పంటభూమి మాన్యముగా ఏర్పాటు చేసి, ఉత్సవములు, రాగభోగాదులు జరిగేటట్లు ఏర్పాటుచేసారు.

కొమరగిరిరెడ్డి సకల ధర్మములతో పద్నాలుగు సంవత్సరములు పాలించాడు.



ముకుందదేవు గజపతి వారు రాజమహేంద్రవరం ఏలూరు, కొండపల్లి పర్యంతం పాలించే సమయములో వారి మేనల్లుడు జోకాశిరిశ్చంద్రుడు రాజమహేంద్రవరం సర్కారుకు ప్రతినిధిగా ఉండేవారు. సితాఫిఖానుడి మరణం తరువాత ఈ ప్రాంతం తురక ప్రభుత్వములోకి వెళ్లిపోయినది. ఆ పిమ్మట ద్రాక్షారామ, పిఠాపుర ఆలయములలో సత్రముల ఖర్చులకొరకు చెల్లూరు గ్రామ ఆదాయాన్ని పూర్వపద్ధతిలో వెచ్చించటాన్ని నిలిపివేసారు. కాలేరు అగ్రహారాన్ని విష్ణుభట్లసోమయాజి వంశీకులనుండి తీసివేసుకొన్నారు.

చెల్లూరు, శీలు, బందనపూడి, కుంగ్యేరు, వుప్పుమిల్లి, పందలపాక, విలాస గంగవరం, దుగ్గదుర్రు, దంగేరు అనే తొమ్మిదిగ్రామాలను కలిపి చెల్లూరు పరగణాగా ఏర్పరచారు. కురుమెళ్ళవారు ఈ చెల్లూరు పరగణా, ఈతకోట పరగణాలను జమిందారీ కింద సంపాదించుకొన్నారు. వీరు యాభైసంవత్సరములు జమిందారీ చేసాకా ప్రభుత్వమువారికి శిస్తులు బాకీలు పడటంతో, తిమ్మరాజు అనే ఆయన ఈ చెల్లూరు పరగణాకు కొంతకాలము జమీను చేసాడు.

ఒకనాడు కురుమెళ్ల వెంకట్రాయినింగారు ఈతకోట పరగణాను చూడటం కొరకు వైనతేనదిపై పడవపై వెళ్ళాడు. ఇది తెలుసుకొన్న తిమ్మరాజు– కురిమెళ్ల వెంకట్రాయినింగారు ప్రయాణిస్తున్న పడవను నడిఏట్లో ముంచివేయమని పడవనడిపేవారికి చెప్పటంతో వారు ఏటిమధ్యకు రాగానే పడవను ముంచి ఆయనను చంపేసారు. ఆ సమయములోనే తాటిపాకసీమ పేరూరు పరగణాకు జమిందారులయిన కోటగిరి వారిని కూడా గోదావరిలోనే పడవముంచి అంత మొందించారు.

అటుపిమ్మట కలిదిండి రంగరాజు, వత్సవాయి తిమ్మరాజులు ఈతకోట తాటిపాక పరగణాలను, కలిదిండివారు పేరూరు పరగాణను పంచుకొనేటపుడు, “మాకు ఏమీ లేదా” అని వీరిమిత్రులైన పిఠాపురం జమిందారు రావు మాధవ రాయనిం అడుగగా ఆయనకు చెల్లూరు, చల్లపల్లి, వానపల్లి నేదునూరు, గూడాల, ఇమ్మడివరప్పాడు, సామంతమెర్ర గ్రామాలను వారివాటాగా ఇచ్చారు. అప్పటి నుంచి చెల్లూరు పిఠాపురం జమిందారీలో కలిసిపోయింది.

రావు మాధవరారాయని ప్రభుత్వం అయిన తరువాత వారి తమ్ములు నారశింహ్యానాయనింగారు ప్రభుత్వం చేసినారు. ఆయన తరువాత వారి కుమాళ్ళు కొద్ది దినములు ప్రభుత్వం చేసి స్వర్గస్తులు అయినారు.



ప్రస్తుతము నీలాద్రిరాయినింగారి ప్రభుత్వములో యీ చెల్లూరు గ్రామం జరుగుతూ ఉండినది. విష్ణుభట్ట వారి వంశీకులయిన అగ్రహారీకులకు నడుస్తూ ఉండే కాలేరు గ్రామం తురకాణ్యము వచ్చిన నాటినుంచి తురకాణ్య ప్రభుత్వములో కలిసి దివాణము కింద జరుగుతూ వున్నది.

ఈ చెల్లూరు గ్రామంలో పండేధాన్యాదులు వగయిరా

అక్కుళ్ళు, కందులు, పెసలు, మినుములు, వులవలు, శనగలు, బొబ్బర్లు, అలచందలు, అనుములు, నువ్వులు, నల్లవులవలు మొదలైన ధాన్యములు, పసుపు మామిడి అరటి మొదలైన తోటలు కలవు.

ఈ కైఫియ్యతు చివర్లో వెంకటశాస్త్రి వ్రాసినది అని ఉన్నది.



# సిద్ధాంతం కైఫియ్యతు[1]

*రాజమహేంద్రవరం జిల్లాలో ఉన్న సిద్ధాంతం గ్రామకరణము వొంగూరి వెంకయ్య వీర్రాజు వ్రాయించిన కైఫియ్యతు*

అఖండ గౌతమీ గోదావరి మహానది దక్షిణ భాగముగా కొంతదూరము వచ్చి ఏడుపాయలుగా చీలిపోతుంది. వాటిలో ఒకటైన వశిష్ఠ పాయ, రాజవరం పేరవరం అనే గ్రామముల సమీపమున ఏర్పడి అంతర్వేది వద్ద సముద్రములో కలుస్తుంది. ఈ వశిష్ఠ నదికి పశ్చిమముగా మహారణ్యము కలదు.

పూర్వకాలమందు ఈ ప్రాంతము వశిష్ఠ మహామునులు తపస్సు చేసినటువంటి మహాక్షేత్రము కనుక త్రేతాయుగములో శ్రీరామచంద్రుడు, సీతాలక్ష్మణ సమేతంగా వనవాసం చేస్తున్న సమయములో ఇక్కడ పర్ణశాల నిర్మించి నివాసం ఉన్నాడు. ఒకనాడు సీత ముచ్చట పడిన బంగారు కురంగమును (జింక) పట్టుకోవటానికి దానిని చాలా దూరము వెంటతరిమాడు. అది ప్రాణము విడిచిన ప్రాంతములో ఆ పిమ్మట ఒక గ్రామము ఏర్పడినది. దానిని "కోరంగి" అని ప్రజలు పిలుచుకొంటున్నారు. సీతాఅమ్మవారిని రావణుడు పర్ణశాల సన్యాసి వేషంలో వచ్చి అపహరించువేళ ఆమె రుషివాకిటిలో ఒక సైకతలింగమును ప్రతిష్టచేసెను. రుషులు ఆ సైకత లింగమునకు సీతేశ్వరలింగము అని పేరుపెట్టి, అక్కడ ఏర్పడిన రుషిపల్లెకు "సీతాంతము" అనే పేర్లు వాడుక చేసారు.

ఆ రుషిపల్లెకు క్షేత్రపాలకుడైన విష్ణుమూర్తి ఆలయము ఉండవలెనని నిశ్చయించి మాధవస్వామి అనే విష్ణుదేవరను ప్రతిష్టచేసారు. ఈ హరిహరాదులకు అక్కడి రుషులు నిత్యం భక్తితో పూజా పునస్కారములు జరిగిస్తూ ఉండేవారు.

---

1. AP Archives kaifiyats R No 1084. సిద్ధాంతం ఊరు నేడు పశ్చిమగోదావరి జిల్లాకు చెందినది అయినప్పటికీ అప్పట్లో ఇది రాజమహేంద్రవరం జిల్లాక్రింద ఉండేది. అంతేకాక సిద్ధాంతం కైఫియ్యతు పశ్చిమగోదావరి జిల్లా కైఫియ్యత్తుల సంపుటిలో లేదు కనుక ఇక్కడ పొందుపరచడమైనది.

ఆ తరువాత నందన చక్రవర్తి ఆంధ్రదేశమును ఏలుచున్న కాలములో ఆ రుషిపల్లె ఒక గ్రామముగా విస్తరించింది. సీతేశ్వరస్వామి వారి ప్రాశస్త్యము తెలుసుకొన్న మహారాజు ఆ గ్రామములో అన్నివృత్తుల[2] వారిని ఏర్పరచి బ్రాహ్మణులకు మాన్యములను దానం చేసాడు. వారు ఆ మాన్యములవల్ల వచ్చిన ఫలం అనుభవిస్తూ, శ్రీ సీతేశ్వరస్వామి, బిందు మాధవస్వామి ఊరికి దక్షిణ భాగమందు ప్రతిష్ఠింపబడిన శ్రీరామస్వామి ఆలయములలో నిత్యపూజాదికాలు, వేదపారాయణము జరిపించేవారు. కాలక్రమేణా శ్రీ సీతేశ్వరస్వామి ఆలయమును విస్తరించి కట్టి నిత్యోత్సవాది సమస్త వుత్సవములు జరిపించసాగారు.

ఆలయ ఉత్సవములలో నాట్యం చేసేందుకు, అంకసాని, అల్లసాని, సాని అనే ముగ్గురు దేవదాసీలను నియమించి వారి పోషణ నిమిత్తం గ్రామములో శ్రీరామస్వామివారి ఆలయమునకు సామీప్యమున కొంత భూమిని ఏర్పాటు చేసిరి. అల్లసానికి ఇచ్చిన మాన్యములో ఆమె ఒక పల్లె నిర్మించుకొని నివాస ముండేది. జనులు ఆ పల్లెను అల్లసాని పల్లెగా పిలుచుకొనేవారు. అలాగే అంకసాని నివాసమున్న పల్లెకు అంకసానిపల్లె అని, సాని కట్టుకొన్న పల్లెకు సానిపల్లె అని పేర్లు వచ్చినవి. కొన్నాళ్లకు ఆ ఆలయము భారీవానలకు కూలిపోయి క్రమేణా పాడుపడినది. ఆ పల్లెను ప్రజలు గుడిపాడు అనే పేరుతో వ్యవహరించుకొనేవారు. కాలక్రమేణా అంకసాని పల్లె పాడుపడి వుజాదు (నిర్జనం) అయిపోవటంతో దానిని అంకసానిపాడు అని అనేవారు. ఈ దేవదాసిలు, వారిసంతతి తమకీయ బడిన మాన్యముల ఫలసాయములను అనుభవిస్తూ, సీతేశ్వరస్వామి, బిందుమాధవ స్వామి ఆలయములలో సేవచేసుకొనేవారు.

ఆ తరువాత చాళుక్యవంశసంభవులయిన రాజులు రాజమహేంద్ర వరము, వేమగిరి దుర్గము నందు పట్టాభిషిక్తులై వేంగినాడు మొదలుగాగల ఆంధ్రదేశమును

2. గ్రామములో వంశపారంపర్య సేవకులు మొత్తం పన్నెండు మంది. వారు- నంబివాడు officiating priest in Vishnu temple, రెడ్డి head farmer, కరణము town clerk, పౌరోహితుడు village priest, తలారి the watchman, వడ్లవాడు, the carpenter, కమ్మరవాడు blacksmith, కుమ్మరవాడు the pot maker, చాకలవాడు, మంగలవాడు, మాలవాడు pariar, మాదిగవాడు. కొత్తగా ఏర్పడిన గ్రామాలకు రాజు ఈ వృత్తులవారిని కేటాయించేవాడు. వీరు గ్రామమును విడిచి వెళ్లకుండా వారికి వృత్తిమాన్యములు లేదా జీవనభృతిని గ్రామం చూపించి వీరి సేవలను పొందేది. ఇది ఒకనాటి మన గ్రామీణ ఆర్థికవ్యవస్థ.

పాలించినపుడు, ఈ సీతాంతము గ్రామములోని ఆలయములకు చక్కగా రాగ, భోగములను జరిపించేవారు. ఆ తరువాత క్రీశ.1101 లో వచ్చిన చోళరాజులు సీతాంతములోని దేవాలయములకు అన్ని ఉత్సవములను నడిపించారు. తరువాత వోరుగల్లు అనే నామధేయము కలిగిన ఏకశిలానగర సింహాసనాశీనులయిన కాకతియ ప్రతాపరుద్రదేవ మహారాజులు ఆంధ్రదేశాన్ని ప్రభుత్వము చేస్తూ ఉన్నప్పుడు ఈ గ్రామపు హరిహరాదులకు సర్వభోగములు నిర్వహించారు.



తరువాత కొండవీటి పాకనాటి రెడ్లు ఆంధ్రదేశమున అద్దంకి అమ్మనబోలు మొదలుకొని తూర్పున సింహాచలము పర్యంతమూ ప్రభుత్వం చేస్తూ ఉండిరి. వారిలో ప్రథమ పురుషుడు పోలయ వేమారెడ్డి పన్నెండు సంవత్సరములు పాలించాడు. తరువాత అనపోత వేమారెడ్డి ముప్పై సంవత్సరములు ఏలినారు. అటుపిమ్మట ధర్మ వేమారెడ్డి రాజ్యము ఏలుచుండగా అప్పుడొక బ్రాహ్మణ కుమారుడు కోరుకొండ అనే పట్టణమందున్న పాంచాలపురమనే గ్రామములో మధుకరము చేసుకొని ఒంటిపూట భోజనము చేస్తూ ఒక బ్రాహ్మణుని వద్ద విద్యనభ్యసిస్తూ ఉండేవాడు. ఒకరోజు ఆ యువకుడు కట్టెలు, విస్తరాకుల కొరకు అరణ్యమునకు వెళ్లినపుడు, పాంచాలపురం అనే గ్రామానికి ఉత్తర భాగమందున పారశరసరస్సు ఉన్న ప్రాంతమునకు వెళ్లాడు. చాలా దూరము ప్రయాణించటం వల్ల అలసిపోయిన ఆ యువకుడు ఆ సరోవరపు నీళ్ళుతాగి ఒక మామిడి చెట్టుక్రింద విశ్రాంతి తీసుకొనుచుండగా, ఒక భిల్ల యువతి అతనిని చూసి వ్యామోహపడింది. ఆమె ఆ యువకునికి ఆ విషయము చెప్పింది. ఆ యువకుడు ఆమెతో ఇది తగదు అని చెప్పాడు. ఆమె పట్టువిడువక అభ్యర్థించుటచే ఆ బ్రాహ్మణ యువకుడు భిల్లకన్యకను పొంది సాయింత్రమునకు తిరిగి పాంచాల పురానికు వచ్చేసాడు.

అది మొదలు రోజూ ఆ బ్రాహ్మణయువకుడు పారశసరస్సు వెళ్ళి భిల్ల యువతిని కూడి రావటం జరిగేది. కొన్నాళ్లకు ఆ భిల్లయువతి తల్లిదండ్రులకు ఈ విషయం చెప్పి, ఆ బ్రాహ్మణయువకునితో తనకు వివాహం చేయమని కోరింది. వారు ఆ బ్రాహ్మణయువకుని పెండ్లిచేసుకోమని కోరగా– “నేను పగలంతా విద్యాభ్యాసము చేసుకోవాలి, సాయింత్రము మాత్రమే మీ గూడానికి

వస్తాను అది మీకు సమ్మతమైతే పెళ్ళిచేసుకొంటాను" అన్నాడు. దీనికి అంగీకరించిన ఆ భిల్లయువతి తల్లిదండ్రులు వారిద్దరికి పెండ్లిచేసారు.

కొంతకాలం తరువాత ఒకనాడు ఆ బ్రాహ్మణుడు భిల్లకన్యకను ఈ అరణ్యములోని వింతలు చూపమని అడిగాడు. ఆమె అతనిని పరుసవేది గుండము వద్దకు తీసుకొనిపోయి, అందు ఉన్న ద్రవమును తాకవద్దని హెచ్చరించినది. ఆ మరునాడు ఆ బ్రాహ్మణుడు భిల్లయువతికి చెప్పకుండా ఆ గుండము వద్దకు పోయి, ఒక వెదురుగొట్టములోకి పరుసవేదిని గ్రహించి పాంచాలపురము చేరుకొన్నాడు. ఈ విషయము ఎవరికీ తెలియకూడదని, ఆ పరుసవేది కలిగిన వెదురుగొట్టమును ఒక కోమటివాని ఇంటి చూరుకు వేలాడదీసి, యథావిధిగా గురువుగారి వద్దకు వెళ్లాడు. ఆ ఇంటి కోమటివాండ్లు కొన్ని ఇనుపకమ్ములు కొని ఇంటిముందు గుట్టగా ఉంచారు. వెదురుగొట్టమునకు పగులు ఉండటంతో అందులోని పరుసవేది బొట్లు బొట్లుగా కారి ఆ ఇనుమును బంగారముగా మార్చివేసినది. అది చూసి ఆశ్చర్యపోయిన కోమటివాండ్లు, ఇనుము అంతా బంగారము కావటానికి వెదురుగొట్టములోని పరుసవేది కారణమని గ్రహించి, ఆ బంగారాన్ని పాతరవేసి, పరుసవేది గొట్టమును, ఇంటిలోని విలువైన సామాన్లను భద్రపరచుకొని ఇంటిని తగలబెట్టినారు. ఆ బ్రాహ్మణ యువకుడు వచ్చి, ఇంటిచూరుకు కొంతసామాను ఉంచాను అది ఏది అని అడగగా, "ఇల్లే తగలబడి పోతున్నప్పుడు, నీ వెదురుగొట్టము ఎవరు తీసి జాగ్రత్త చేస్తారు" అని సమాధానం ఇవ్వటంతో–పరుసవేది కొరకు ఆ యువకుడు కాలుతున్న ఇంటిలోకి వెళ్లి అగ్నికి ఆహుతై మరణించాడు. ఇంటిలోకి వెళ్ళేముందు తాను పరుసవేది తెచ్చినసంగతి, ఆ రహస్యం తెలుసుకొన్న ఈ కోమటివాండ్లు దాన్ని అపహరించిన సంగతి అందరకు చెప్పిపోయాడు.

ఆ తరువాత ఆ కోమటి వాండ్లు తమకు కావలసివచ్చినప్పుడు బంగారము అమ్ముకొంటూ తమ వ్యాపారాలను వృద్ధిచేసుకొని అనతికాలంలోనే మిక్కిలి ధనవంతులు అయ్యారు. ఈ విషయము ఆనోటా ఈనోటా రాజైన వేమారెడ్డికి తెలిసింది. ఆయన ఈ కోమటివాండ్లను పిలిపించి వారివద్ద నున్న బంగారము నంతా స్వాధీనము చేసుకొన్నాడు. ఆనాటి రాత్రి వేమారెడ్డి కలలోకి బ్రాహ్మణ యువకుడు పిశాచిరూపములో వచ్చి పీడించటంతో, ఆ ధనాన్ని మంచి పనులకు వినియోగించవలెనని భావించాడు. ఆ డబ్బుతో వేమారెడ్డి ద్రాక్షారామము,

కుమారారామభీమారామ క్షీరారామ, అమరారామ, సర్పవరం, కోరుకొండ ఆలయాలను జీర్ణోద్ధరణ చేసి, అనేక తటాకములు, అన్నసత్రములు నిర్మింప చేసాడు.

ఈ ధర్మవేమారెడ్డికి పుట్టిన కొడుకుకు పరుసవేది తెచ్చిన బ్రాహ్మణుని పేరు పెట్టాడని జనులు చెప్పుకొంటారు.

ఆ పిమ్మట కోమటి వేమారెడ్డి ఇరవైఏడు సంవత్సరములు, తరువాత రాచవేమారెడ్డి నాలుగు సంవత్సరములు ఈ ప్రాంతాన్ని పాలించారు. ఈయన సింహాచలము, శ్రీకూర్మము మొదలుకొని సమస్త దివ్యక్షేత్రములకు సువర్ణ, రజత పాత్రలు, కలశములు అనేకము దానం చేసాడు. ఈయన తరువాత కొమరగిరి రెడ్డిగారు పద్నాలుగేళ్లు పరిపాలించాడు.



ముప్పభూపాలుడు అనే రాజు రాజమహేంద్రవరము వద్ద వేమగిరిదుర్గంలో ఉండి వేంగిదేశమును పాలిస్తున్న కాలములో యెక్కడెక్కడ దేవబ్రాహ్మణ వృత్తులకు యేమి, నడిచే కట్టడములకుయేమి చాలా ఛద్మములు (మోసములు) తగిలినవి అని జనులు అనుకొనేవారు. ఆ పురుషుడి ప్రభుత్వములోనే ఈ సీతాంతము అనే గ్రామము ఇసుకలో కూరుకుపోయినది. అది మొదలు కాలక్రమేణా కొన్నాళ్లకు సీతేశ్వరస్వామి, బిందుమాధవస్వామి, రామస్వామి ఆలయములు శిథిలమై పోయాయని స్థానికులు చెపుతున్నారు. ముప్పభూపాలుని ఏలుబడికి సంబంధించిన శాసనములుకాని, తామ్రపత్రములు కానీ ఇంతవరకూ కనిపించలేదు.

ఆ తరువాత దేశము గజపతివారి ఆధీనములో ఉన్నప్పటి నుంచి సితాఫి ఖానుడి ఏలుబడి వరకూ ఎవరూ ఈ సీతాంత గ్రామ దేవాలయాల జీర్ణోద్ధరణ జరిపించలేదు. అందుచే ఈ శిథిలదేవాలయముల రాళ్ళను సీతాంతపు గ్రామస్థులు, చుట్టుపక్కల గ్రామస్థులు గాదెల క్రిందకు, గడపలకు, తూములకు, అరుగులు కట్టుకోవటానికి పట్టుకొని పోయారు.



క్రీశ.1572 అంగీరససంవత్సరంలో గోలకొండ యిభరామ్ పాదుషా తరపున మల్కినేబు వచ్చి రాజమహేంద్రవరం మొదలుకొని అన్ని ప్రాంతాలను వశబరచుకొని ప్రభుత్వము స్థాపించాడు. మల్కినేబుకు యెల్లోపంతులు,

ఆంతోతిమ్మరుసు, పెద్దిరాజులు ఆంతరంగికులుగా ఉండేవారు. వీరికి మిత్రుడైన భూపతిరాజు నాగరాజు తనకు ఏదైనా శాశ్వతమైన వసతి కల్పించవలసినదిగా మల్కినేబును కోరటంతో అతనికి అత్తిలి పరగణా దేశముఖి (కరణీకము) ఇప్పించినారు.

భూపతిరాజునాగరాజు అత్తిలి గ్రామ జమిందారీతో సంపన్నుడయి ఈ సీతాంతము గ్రామములో విజయగోపాలస్వామివారి ఆలయమును పెద్ద గోపురము, ప్రాకారముతో కట్టించాడు. ఈ ఆలయములో సమస్త ఉత్సవాలను నాగరాజు స్వహస్త ద్రవ్యము వ్యయముచేసి దగ్గరుండి జరిపించేవాడు.

కలిదిండి ముసిలినాగరాజు అనే వ్యక్తి గోలకొండ వెళ్లి మొగలితిర్తి పరగణాకు జమిందారీ తెచ్చుకొన్నాడు. భూపతిరాజునాగరాజు చనిపోయాక, అతని కొడుకు అయిన రంగరాజును ముసిలినాగరాజు కుట్రచేసి అత్తిలి జమిందారీని కూడా ఆక్రమించుకొన్నాడు.

ఆ తరువాత మరలా సీతాంతములోని విజయగోపాలస్వామి వారికి ఉత్సవములు జరగలేదు. అర్చకుడు మాత్రం ఆలయమును కనిపెట్టుకొని రోజూ నైవేద్యము జరిగిస్తూ ఉన్నాడు.

అటుతరువాత తురకాణ్యమువారి తరపు గోలకొండనుంచి నవాబు హాజిహుస్సేను ప్రభుత్వము వచ్చినపుడు అంతవరకూ సీతాంతము గ్రామము క్రింద జరుగుతున్న సానెపల్లెను ముమ్మిడివరం గ్రామశివారులోను, అలసానిపల్లె, గుడిపాడులను ఇలపర్తిలోను, అంకసానిపాడును రామాన్నపాలవేములోను కలిపివేసిరి.

ప్రస్తుతం ఈ గ్రామములో వీరేశ్వరస్వామి, నందీశ్వరస్వామి, విఘ్నేశ్వర స్వామి, కేదారేశ్వర స్వామి ఆలయములు ఉన్నవి. ఇక్కడి పొలాలలో వడ్లు, అనుములు, మినుములు, ఆముదములు, పొగాకు, జొన్నలు, అలచందలు, నువ్వులు పండిస్తున్నారు.

# మెకంజీ సేకరించిన శాసనాలు[1]

కాలిన్ మెకంజీ సేకరణలలో మొత్తం 8076 శాసనాలు ఉన్నట్లు వాటిని కేటలాగ్ చేసిన H H Wilson గుర్తించాడు. వీటిలో తూర్పుగోదావరికి సంబంధించిన వివిధ ఆలయశాసనాలే కాక ఇతరప్రాంతాలలో చెల్లాచెదురుగా పడి ఉన్న శాసనాల నకళ్ళు కూడా ఉన్నాయి. వీటి వివరాలు రాజమహేంద్రవరం, గౌతమీ గ్రంధాలయంలో శిధిలావస్థకు చేరుకొన్న ఒక వ్రాతప్రతిలో లభించాయి. ఇదే వ్రాతప్రతికి బొమ్మూరు తెలుగు విశ్వవిద్యాలయంలో మెకంజీ వ్రాతప్రతి వాల్యూమ్ II పార్ట్ I పేరుతో జిరాక్సు కాపీ కలదు. ఈ పుస్తకంలో తూర్పుగోదావరికి సంబంధించి ద్రాక్షారామ, సర్పవరం, కోటిపల్లి, బిక్కవోలు, పిఠాపురం, కాకినాడ ఆలయాలలోని వివిధ శాసనాల వివరాలు ఉన్నాయి.

తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించి కాలిన్ మెకంజీ అనుచరులు సుమారు 250 శాసనాలు సేకరించారు. వీటిలో 209 శాసనాలు ద్రాక్షారామ భీమేశ్వర ఆలయానికి చెందినవే. ద్రాక్షారామ ఆలయంలో మొత్తం 387 శాసనాలు ఉన్నట్లు శ్రీ జాస్తి దుర్గాప్రసాద్ రచించిన "శాసనాల్లో ద్రాక్షారామ శ్రీభీమేశ్వరాలయ చరిత్ర" అనే పుస్తకంలో చెప్పారు. ఈ రెండు సంఖ్యలకు వ్యత్యాసం కనిపిస్తుంది. మెకంజీ తన అనుచరులకు నిర్దేశించిన అనేక లక్ష్యాలలో శాసనాల సేకరణ ఒకటి. కనుక ప్రముఖంగా కనిపించే శాసనాల నకళ్ళను మాత్రమే సేకరించి ఉండొచ్చు లేదా కాలానుగుణంగా కొన్ని బయటపడి ఉండవచ్చు.

---

1. మెకంజి వ్రాతప్రతులు రెండు వాల్యూములుగా, బొమ్మూరు తెలుగు విశ్వవిద్యాలయం మరియు గౌతమి గ్రంధాలయం, రాజమండ్రి లలో కలవు. మెకంజీ సేకరించిన ఈ శాసనాలు కైఫియ్యతుల క్రిందకి రావు కానీ వీటి ద్వారా ఒకనాటి తూర్పుగోదావరిజిల్లా రాజకీయ, ఆర్థిక, సామాజిక స్థితిగతులను అర్థంచేసుకోవచ్చు. ఈ చాప్టరులో ఉటంకించిన శాసనాలు మెకంజీ సేకరణలే కాక స్థూల అవగహన కొరకు South Indian Inscriptions Vol. IV నుంచి కూడా గ్రహించటం జరిగింది.

## ద్రాక్షారామ శాసనాలు

మూడు శివాలయాలైన శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం మధ్యనున్న ప్రాంతం భౌగోళికంగా త్రిలింగదేశంగా పిలువబడింది. క్రీశ. 150 లో టొలెమీ గంగకు దిగువన ఉన్నప్రాంతాన్ని త్రిలింగ అని పేర్కొన్నాడు. టోలమీ తరువాత త్రిలింగ అనే మాట ఆ తరువాత ఏడోశతాబ్దం వరకూ కనిపించదు. క్రీశ.631లో ఇంద్రవర్మన్ అనే రాజు- త్రిలింగదేశ నివాసి అయిన భావదత్తశర్మకు చేసిన ఒక దానశాసనంలో మరలా త్రిలింగ అనే పదం కనిపిస్తుంది[2]. క్రీశ.రెండో శతాబ్ద టోలెమీ కాలంనుంచీ, ద్రాక్షారామ భీమేశ్వర ఆలయం ఉందా అంటే స్పష్టమైన ఆధారాలు కనిపించవు.



ద్రాక్షారామము సమీపంలోకల పెద్దాపురపాడు వద్దలభించిన ఒక శాసనం ద్వారా- జైన కొకండిపట్రులో (నేటి కాకినాడ) ఉన్న కొన్ని జైన ఆలయముల నిర్వహణ నిమిత్తం కనకనంది అనే జైనాచార్యునికి కొంతభూమిని రెండవ విష్ణువర్ధనుడు (క్రీశ.673-682) దానం ఇచ్చినట్లు తెలుస్తుంది. ఏడవ శతాబ్దంలో ఈ ప్రాంతములో "యాపనీయ సంఘం" (జైనులలో ఒక శాఖ) ఉన్నట్లు కూడా ఈ శాసనంలో ఉన్నది[3]. తొమ్మిదో శతాబ్దం వరకూ తూర్పుగోదావరి జిల్లాలో బౌద్ధ జైనాలు సర్వత్రా విలసిల్లాయి. ద్రాక్షారామంకు పాతిక కిలోమీటర్ల పరిధిలో ఆర్యావటం, గొర్రిపూడి, జగన్నాధగిరి, బోయినపూడి, బిక్కవోలు, జల్లూరు లాంటి ప్రాంతాలలో జైన అవశేషాలు నేటికీ గమనించవచ్చు.

పంచారామాలలో నెలకొని ఉన్న శివలింగం పొడవుగా స్తూపాకారంలో బౌద్ధచైత్యాలలో "ఆయకస్తంభాన్ని" పోలి ఉంటుంది అంతేకాక నేడు పంచా రామాలు ఉన్న స్థలాలు చరిత్రలో బౌద్ధం పరిఢవిల్లిన ప్రాంతాలు కనుక ఈ పంచారామాలు ఒకప్పటి బౌద్ధారామాలు కావొచ్చునని శ్రీ ఎన్. రమేశన్ ఇంకా ఇతర చరిత్రకారులు అభిప్రాయపడ్డారు[4]. శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు అమరారామం గురించి వ్రాస్తూ- "మూలవిరాట్టు మీదుగా పాలరాతి

---

2. R.Suba Rao, JAHRS,Vol.VI,p.79
3. Bharathi, October 1983 & May1985;Jawaharlal G. Jainism in Andhra, p.28
4. Religion in Andhra, BSL Hanumantha Rao p.130

మీద చెక్కిన పద్మం కానవస్తుంది. పరమ సుకుమారమైన ఆ శిల్పశైలి ప్రాచీన బౌద్ధానికి సంబంధించినదే. లింగం ఎత్తు సుమారు 15 అడుగులు. పూర్వం ఇది ఆయక స్తంభమనీ, తరువాత శివలింగంగా ప్రతిష్ఠితమై పూజింపబడుతోందని ఒక వదంతి వుంది" అంటారు[5].

బాపట్ల భావనారాయణ స్వామి ఆలయ పశ్చిమగోడపై క్రీశ 1149 నాటి ఒక శాసనంలో – "భీమాపురము(సామర్లకోట) డాకరేమి (ద్రాక్షారామం) వాల్కొలను (పాలకొల్లు) దచ్చారామపురి (భీమవరం) ఆంధ్రధరణి (అమరావతి) పంచా రామములలో ఈశ్వరునికి, బుద్ధదేవరకును అఖంఢదీపములు పెట్టబడ్డాయి" అని స్పష్టంగా ఉన్నది[6]. ఆ తరువాతి శాసనాలలో బుద్ధుని ప్రసక్తి లేదు. పై శాసనమును బట్టి పంచారామములలో బుద్ధదేవుడు ప్రాచీనదైవం అని అర్ధమౌతుంది[7]. నేటికి దక్షారామంలో భీమేశ్వరాలయం మీదిభాగాన భీమేశ్వర మందిరం చుట్టూ ప్రదక్షిణం చేసేచోట ఓ స్తంభానికి ఒక బుద్ధ విగ్రహం ఉంది. అర్చకులు దీనిని "ఆర్ష బుద్ధుడు" అంటారు.

ఏదిఏమైనప్పటికీ ద్రాక్షారామం ఒకప్పుడు బౌద్ధారామంగా ఉండేదా లేక జైనాలయమా అనేప్రశ్నకు స్పష్టమైన ఆధారాలు లభించవు. ద్రాక్షారామం ప్రసిద్ధశైవక్షేత్రంగా మారకముందే ఈ ప్రాంతం బౌద్ధజైనాలకు ఆలవాలంగా ఉండేదని సర్వత్రా ఆమోదించిన విషయం.



నేడు మనం చూస్తున్న ద్రాక్షారామ భీమేశ్వర ఆలయాన్ని తూర్పుచాళక్య భీముడు I (క్రీశ. 892-922) కట్టించాడని స్థలపురాణం చెపుతుంది. దీనికి తగిన శాసనాధారాలు లభించవు. సామర్లకోటలో ఉన్న కుమార భీమేశ్వరాలయాన్ని చాళుక్య భీముడు నిర్మించాడని పిఠాపురంలోని ఒక శాసనం ద్వారా తెలుస్తున్నది[8]. ఈ రెండు ఆలయాల నిర్మాణానికి ఉపయోగించిన రాయి ఒకేరకమైనదిగా, నిర్మాణశైలికూడా ఒకేలా ఉండటం గమనార్హం. చాళుక్యభీముడు ద్రాక్షారామ

5. తెలుగునాట దేవాలయాలు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
6. South Indian Inscriptions vol 6, No 133, P.no 68
7. ద్రాక్షారామ క్షేత్ర సాహిత్య చరిత్ర పరిశోధనా సిద్ధాంతము, యస్ వి. రాఘవేంద్రరావు, తెలుగు విశ్వవిద్యాలయము.
8. Epigraphica Indica vol XIX p 165

ఆలయాన్ని నిర్మించాడన్న విషయాన్ని నిర్ధారించటానికి చాళుక్య భీముని కాలానికి చెందినవి కాదుకదా అతని పాలన ముగిసిన యాభైఏండ్లవరకూ కూడా ఏరకమైన శాసనాలు ద్రాక్షారామ ఆలయములో లభించవు. అక్కడ లభించే అత్యంత ప్రాచీనమైన శాసనం క్రీశ. 1038 లో రాజరాజనరేంద్రుని పాలనాకాలంలో చేసిన దానాలను గురించి ఉన్న ఒక శాసనము[9]

పన్నెండో శతాబ్దం నాటికి ఈ ఆలయం ఉచ్ఛదశకు చేరుకొంది. ఆలయానికి చేర్చి భక్తులకొరకు అయిదు సత్రాలు నడిచేవి. అనేక దానాలు ఇవ్వబడినట్లు తెలుస్తుంది. ఆలయప్రాంగణంలో అనేక మండపాల నిర్మాణాలు జరిగాయి.

పదవశతాబ్దం నుండి పదహారోశతాబ్దం మధ్యలో వేంగిచాళుక్యులు, చోళులు, వెలనాటి చోళులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు వేయించిన శాసనాలు ద్రాక్షారామ ఆలయంలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ ప్రాంతానికి ముస్లిముల రాక పద్నాలుగో శతాబ్దం నాటికే మొదలైనా, ద్రాక్షారామ ఆలయం ముస్లిముల దాడులకు గురయినట్లు ఆధారాలు ఎక్కడా శాసనాలలో లిఖించబడలేదు. ద్రాక్షారామ గ్రామంలో ఉన్న పురాతన మసీదు మక్కామసీదుకు నమూనాగా నిర్మించబడిన మసీదు అంటారు[10].

ఆనాటి ఆంధ్రదేశం కమ్మనాడు (గుంటూరు, ప్రకాశం జిల్లాలలో విస్తరించిన ప్రాంతం), వెలనాడు (రేపల్లె, తెనాలి ప్రాంతాలు), పల్నాడు (గురజాల, మాచర్ల, కారంపూడి ప్రాంతాలు) ప్రోలునాడు (పిఠాపురం, తుని, పెద్దాపురం, కాకినాడ ప్రాంతాలు), వేంగినాడు (వైజాగు, తూర్పు, పశ్చిమగోదావరిలు, కృష్ణా, గుంటూలు జిల్లాలు) అంటూ వివిధ ప్రాంతాలుగా విభజించబడి ఉండటాన్ని ఈ శాసనాల ద్వారా గుర్తించవచ్చు.

శ్రీనాథుడు ఈ ప్రాంతంలో కొంతకాలం నివసించాడు. ఆ సమయంలో అతను వ్రాసిన భీమేశ్వరపురాణంలో ఈ ఆలయ నలుమూలలను గోగులమ్మ, మందాటకి, నూకాలమ్మ, గట్టాంబికలు సంరక్షిస్తున్నారని వ్రాసాడు. వీరు గ్రామ దేవతలు. గ్రామదేవతలు హైందవదేవాలయంలో కొలువుండటం ఒక్క ద్రాక్షారామ ఆలయంలోనే చూస్తాము. అదేవిధంగా భీమేశ్వర ఆలయంలో వేంచేసిన మాణిక్యాదేవి

9. SII Vol IV - 1014
10. Draksharamam Sasanaalu by YV Ramana

శాక్తేయ సంప్రదాయానికి చెందిన దేవతకావటం కూడా ఈ ఆలయపు మరో ప్రత్యేకత[11].

ఆలయశాసనాలలో క్రీశ 1083 నాటి ఒక శాసనంలో[12] మొదటి సారిగా ద్రాక్షారామం అన్న పేరు “దాకరెమి” అని కనిపిస్తుంది. ఇదే శాసనంలో గోదావరి పేరు “గుద్రవాది” గా పేర్కొనబడింది. పెదదాకరెమి, దక్షారామ, జననాథపురం, భీమానాథపురం, దక్షతపోవనం, దక్షిణకాశి అనే రకరకాల పేర్లతో వివిధ శాసనాలలో ద్రాక్షారామము పిలవబడింది. ఆలయశాసనాలు ఎక్కువభాగం లిఖించిన వ్యక్తి పేరు పెద్దనాచార్య. ఈ పేరుతో ఒకరికంటే ఎక్కువమంది ఉండి ఉండవచ్చు. కొద్ది సంఖ్యలో శాసనములు సూరాచార్య, బేతనాచార్య, మారపాచారి లిఖితం అని ఉన్నవి.

పన్నెండో శతాబ్దానికి చెందిన ప్రముఖ శైవకవి మల్లికార్జున పండితారాధ్యుడు భీమేశ్వరాలయ అర్చకుని కొడుకు. అలాగే వేములవాడ భీమకవి ద్రాక్షారామంకు చెందిన ఒక బ్రాహ్మణ వితంతువుకు పుట్టాడు. ఇతను తన తండ్రి భీమేశ్వరుడని చెప్పుకొన్నాడు.

ఒక శాసనములో[13] ఆలయములో వినియోగము కొరకు వడ్లు, పెసలు, మినుములు, అనుములు, జొన్నలు సమర్పించుకొన్నట్లు ఉంది. ఇవి శ్రీనాధుడు ఈ ప్రాంతంలో పండే పంటలు అంటూ వర్ణించిన వరి, పెసలు, మినుములు, నువ్వులు, పత్తి, జొన్నలతో సరిపోలుచున్నవి.

**ఆలయ పరిపాలన**

శాసనాలలో ఆలయ పరిపాలన నిర్వహణలకు సంబంధించిన వివరాలు పెద్దగా కనిపించవు. క్రీశ.1064కు చెందిన ఒక శాసనములో ఆలయస్థానాధిపతి అయిన రుద్రదేవర సుప్పనాయకుడు అఖండదీపారాదన నిమిత్తం భీమేశ్వరునికి ఒక లోహదివ్వె ఇచ్చినట్లు ఉన్నది[14].

---

11. The Bhimeswara Temple of Draksharama by Dr.M.Ramarao, Journal of Andhra Historical Society, JAHRS Vol. 24.
12. SII Vol IV - 1015
13. SII Vol IV - 1384
14. SII Vol IV -1013

మరొక శాసనములో రామేశ్వర రాశిపండిత అనే ఆలయస్థానాధిపతి అఖండదీపాన్ని స్వామివారికి పెట్టించినట్లు తెలుస్తుంది[15].

మరోచోట ఆలయ మహాస్థానాధిపతి అయిన మద్వశిష్టపండిత భీమేశ్వరునికి చందనమును సమర్పించుకొన్నట్లు ఉన్నది[16].

పై మూడు శాసనముల ద్వారా– ఆలయ పరిపాలనానిర్వహణ కొరకు మహాస్థానాధిపతి అతని క్రింద స్థానాధిపతులు ఉండేవారని అర్ధమౌతుంది. కాలముఖ శైవశాఖకు చెందిన శైవపండితులను మహాస్థానాధిపతులు అంటారని అలంపూర్ ఆలయశాసనాలు చెపుతున్నాయి. ఎంత పెద్దమహారాజైనా తాముతెచ్చిన బహుమతులను ఈ మహాస్థానాధిపతుల పాదాలవద్ద ఉంచి తమ శిరస్సును ఆ పాదాలకు తాకించి ఆశీర్వాదం పొందేవారు. కాకతి గణపతిదేవునికి శివదీక్ష ఇచ్చిన గురువు శివదేవయ్య గురించి “చిరకాలము రాజుల కిరీటములచే స్పృశింపబడిన పాదములు కలవాడు” అని మల్కాపుర శాసనములో ఉండటాన్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాలి.

మహాస్థానాధిపతులు, స్థానాధిపతులు తరువాత, వారిలో–ఆలయ భాండాగారాన్ని నిర్వహించే కోష్టాగారాధిపతి, ఆలయ ఆదాయవ్యయాలను చూసే కర్మికరణాలు, పూజలు నిర్వహించే పూజారులు, ఆలయరక్షణ గావించే పదిహారిలు అంటూ వివిధ ఆలయాధికారుల పేర్లు శాసనాలలో కనిపిస్తాయి. వీరందరూ కలిసి ద్రాక్షారామ ఆలయ పరిపాలనానిర్వహణను సాగించేవారు.

స్థానిక రాజుల లేదా నాయకుల సమక్షములో దానములు ఈయబడినవి అని మాత్రమే ఉంది తప్ప వారు ఆలయనిర్వహణ పర్యవేక్షించినట్లు శాసనాలలో కనిపించలేదు. బహుసా ఆలయంపై వారి పెత్తనం లేదని అది పూర్తిగా ధార్మిక వ్యక్తులచే నిర్వహించబడేదని భావించవచ్చు.

## శాసనాలలో కనిపించే ఆనాటి సమాజం

ఒకనాటి సమాజం చాతుర్వర్ణ నిర్మితం. ప్రతివర్ణానికి ఒక స్వధర్మం అనేది నిర్దేశించబడింది. ద్రాక్షారామ ఆలయశాసనాలలో అన్ని వర్ణాలకు సంబంధించిన వ్యక్తులు వారి నిర్వహించిన వృత్తులు చాలా స్పష్టంగా చెప్పబడ్డాయి. కొన్ని చోట్ల

15. SII Vol IV - 1229
16. SII Vol IV - 1256

తమ వర్ణానికి నిర్ధేశించిన ధర్మానికి అతీతంగా క్షత్రియధర్మాన్ని పోషించే బ్రాహ్మణులు, శూద్రులు అదే విధంగా బ్రాహ్మణ ధర్మాన్ని అనుసరించే శూద్రులు కనిపిస్తారు[17].

**బ్రాహ్మణులు**

బ్రాహ్మణులు జ్ఞానసంబంధ రంగంలోనే కాక పరిపాలనా విభాగంలో కూడా ముఖ్యపాత్ర వహించినట్లు అనేక శాసనాల ద్వారా తెలుస్తుంది. ఆనాటి సమాజంలో బ్రాహ్మణులు పోషించిన వివిధ పాత్రలు ఇలా ఉన్నాయి

క్రీశ. 1163లో నల్లయభట్లు కులోత్తుంగ రాజేంద్రచోడుని వద్ద ఆస్థాన జ్యోతిష్కుడిగా ఉన్నాడు. ఇతను భీమేశ్వరునికి దీపం, కర్పూరము దానమిస్తూ తాను వరాహమిహిర విభాగానికి చెందిన జ్యోతిష్కుడనని చెప్పుకొన్నాడు.

మరో శాసనములో "పరహిత పరతంత్ర" వైద్యవిభాగంలో నిష్ణాతుడైన ఒక బ్రాహ్మణుడు దాన మిచ్చినట్లు ఉన్నది[18]. ఆనాటి బ్రాహ్మణులు వైద్యవృత్తిలో ఉన్నట్లు, వైద్యవృత్తిలో కూడ వివిధ విభాగాలు ఉన్నట్లు ఈ శాసనము ద్వారా అర్ధమౌతుంది.

క్రీశ. 1437నాటి ఓ శాసనములో భీమ వల్లభపురంలోని ధర్మాసనమునకు చెందిన లింగంభొట్లు అనే బ్రాహ్మణుడు తన యావదాస్థిని భీమేశ్వరునికి సమర్పించుకొన్నట్లు ఉన్నది. ధర్మాసనం అనేది న్యాయస్థానం అనుకొంటే కొంత మంది బ్రాహ్మణులు న్యాయాధికారులుగా పనిచేసారని భావించవచ్చు.

ఆ కాలంలో చాలామంది బ్రాహ్మణులు రాజుకి సలహాలు ఇవ్వటానికి ప్రధానులుగా పనిచేసేవారు. క్రీశ. 1149 కు చెందిన ఒక శాసనములో ఆర్యపెగ్గడ అనే బ్రాహ్మణుడు త్రిభువనమల్లుని వద్ద మహాప్రధానిగా పనిచేసినట్లు తెలుస్తున్నది. క్రీశ. 1140నాటి మరో శాసనముద్వారా కశ్యపగోత్రానికి చెందిన వెన్నయ సోమయాజి, వెలనాటి రాజేంద్రచోడుని వద్ద ప్రధాని అని అర్ధమౌతుంది.

కొందరు బ్రాహ్మణులు దండనాయకులు, సేనాధిపతులుగా కూడా వ్యవహరించారని కొన్ని శాసనాలు తెలుపుతున్నాయి. క్రీశ. 1149 కు చెందిన ఒక శాసనములో భరద్వాజ గోత్రానికి చెందిన నాగదేవయ అనే వ్యక్తి దండనాయకుడని

17. The Inscriptions of Draksharama a Cultural Study, SV University, PhD thesis by N.V. Ramaiah Chowdhary
18. SII Vol IV - 1172 వ్యక్తిపేరు లేదు

చెప్పబడ్డాడు. వాసనపెగ్గడ అనే బ్రాహ్మణుడు, కులోత్తుంగచోడ రెండవ గొంకరాజు వద్ద సమస్తసేనాధిపతిగా పనిచేసినట్లు తెలుస్తున్నది[19].

ఆలయనిర్వహణా విధులను నెరపే స్థానాధిపతులుగా బ్రాహ్మణులు పనిచేసారు. ద్రాక్షారామ ఆలయశాసనాలలో వచ్చిన వివిధ బ్రాహ్మణుల గోత్రాలలో కశ్యప, భరద్వాజ గోత్రాలు పలుమార్లు వచ్చాయి. బాహ్మణుల పేర్లలో సంస్కృత మూలాలు ఎక్కువగా ఉండటం గమనార్హం

**క్షత్రియులు**

ద్రాక్షారామ ఆలయంలో క్షత్రియులకు సంబంధించిన శాసనాలు కనిపించవు.

**వైశ్యులు**

సుమారు ఇరవైకి పైగా శాసనాలలో వైశ్యుల ప్రస్తావన ఉన్నది. వీరు బచ్చు, వైశ్య, కోమటి, శెట్టి లాంటి పేర్లతో వ్యవహరింపబడ్డారు. వీరు పెనుగొండ (పశ్చిమగోదావరి జిల్లా), పేరూరు (కడప) లాంటి తెలుగు ప్రాంతాలనుండే కాక మధ్యప్రదేష్‌కు చెందిన బస్తర్ లాంటి సుదూర ప్రాంతాలనుంచి కూడా వచ్చి భీమేశ్వరుని దర్శించుకొని కానుకలు సమర్పించుకొన్నట్లు తెలుస్తుంది.

అప్పట్లో వైశ్యులు వ్యాపారాలే కాక రాజాశ్రయం పొంది వివిధ పదవులు కూడా నిర్వహించేవారు. క్రీశ1132 నాటి ఒక శాసనములో గొన్నిశెట్టి కుమారుడైన కళ్ళయసా అనే ఒక వైశ్యుడు లక్ష్మరాసదండనాయకుని వద్ద సాహిణి (horse-keeper) అని ఉన్నది[20]. అదే విధంగా క్రీశ 1168నాటి శాసనములో నాగిశెట్టి పేరుగల వైశ్యుడు కులోత్తుంగచోడుని వద్ద భాండాగారాధికారి (Treasurer) అని తెలుస్తుంది. వైశ్యుల పేర్లలో ద్రావిడ మూలాలు ఎక్కువగా ఉండటం గమనార్హం

**చతుర్థాన్వయులు**

మిగిలిన వర్ణాలతో పోల్చినపుడు సమాజంలో శూద్రులు సంఖ్యాపరంగా ఎక్కువగా ఉంటారు. వీరిలో చాలామంది మహాప్రధాని, సేనాధిపతి, దండనాయక స్థానాలను దక్కించుకొన్నారన్న సంగతి శాసనాలలో దొరుకుతుంది.

---

19. SII Vol IV - 1089

20. SII Vol IV - 1217

క్రీశ. 1236 నాటి ఒక శాసనములో కాకతీయ గణపతికి మల్లాల వేమాద్రి రెడ్డి మహాప్రధానిగా ఉండినట్లు తెలుస్తుంది. క్రీశ1149 లో కామినాయకుడు అనే పేరుగలిగిన చతుర్థాన్వయుడు దండనాయకుడి హెూదాలో భీమేశ్వరునికి అఖండవత్తి, లోహపాత్రలు సమర్పించుకొన్నాడు. మరో చోట ముప్పినాయకుడు అనే వ్యక్తి వెలనాటి రాజేంద్రచోడుని వద్ద పడవాలుగా (సేనాపతి) పనిచేసినట్లు తెలుస్తుంది. ఇదే రాజేంద్రచోడుని వద్ద ఎరియనాయకుడు అనే వ్యక్తి భాండాగారాధికారిగా, సూరపరెడ్డి అనే మరో వ్యక్తి ముదిసలిగా (రాజుగారి ఆహార తనిఖీ అధికారి) పనిచేసేవారు.

పై శాసనాధారాలను బట్టి చతుర్థాన్వయులు అప్పట్లో వారివర్ణధర్మాలనే కాక ఇతరపదవులు కూడా చేపట్టారని అర్థమౌతుంది.

క్రీశ 1263కి చెందిన ఒక శాసనములో తలారి ముప్ప్రమాణినాయకుని కుమారుడైన తలారి పల్లినాయకుడు తన తల్లిదండ్రుల దర్మార్థమై ఇనుపఎడ్లు దానం చేసినట్లు ఉన్నది. తలారి అంటే గ్రామకావలి. తండ్రిపేరులో కూడా తలారి ఉండటాన్ని బట్టి బహుశా ఆ ఉద్యోగం వంశపారంపర్యమైనది కావొచ్చును.

వీరేకాక అనేక ఇతర కులాలవారు కూడా వివిధసేవలలో పాల్గొన్నట్లు శాసనాలద్వారా తెలుస్తుంది. ఆలయమునకు దానముగా ఇచ్చే ఆవులు, గేదెల, గొర్రెలసంరక్షణ కోసం అనేకమంది బోయిలు ఉండేవారు. వీరు యాదవకులానికి చెందినవారు. దానంగా ఇవ్వబడిన పశువుల పోషణ గావించి, పాలు, నెయ్యి ఆలయానికి క్రమంతప్పకుండా అందించటం వీరిపని.

వీరేకాక శ్రీమంగలి, మాలకార, కమ్మరి, స్వర్ణకార, వడ్రంగి, కండమంగలి, చాకలి కులాలకు చెందిన వివిధ వృత్తుల వారు ఆలయాన్ని ఆశ్రయించుకొని ఉండేవారని ఒక శాసనములో[21] కలదు. ఆలయనిర్మాణము, శాసనములు వ్రాయటానికి ఆచారి లేదా ఓజు నామాంతాలతో శిల్పులు ఉండేవారు. ద్రాక్షారామ శాసనాలలో చాలామట్టుకు పెద్దనాచారి శిల్పకారునిచే లిఖించబడినవే. ద్రాక్షారామ ఆలయంలో రాప, నారాయణ అనే వడ్రంగులు సేవలందిస్తున్నందుకు పరాంతక చోళుడు కొంతభూమిని దానంగా ఇచ్చినట్లు ఒక శాసనం తెలుపుతుంది.

21. SII Vol IV - 1369

**స్త్రీలు**

సామాజిక కార్యక్రమాలలో స్త్రీల ప్రాతినిధ్యం ఆ సమాజపు చైతన్యాన్ని ప్రతిబింబిస్తుంది. ద్రాక్షారామ ఆలయానికి సంబంధించి మొత్తం 65 శాసనాలలో స్త్రీల ప్రస్తావన ఉన్నది. ఇవి చాలామేరకు రాజకుటుంబ స్త్రీలు ఇచ్చిన దానాలు, స్వల్ప సంఖ్యలో సామాన్య కులకాంతలకు సంబంధించినవి. మొత్తం శాసనాలతో పోల్చుకొన్నప్పుడు స్త్రీలను గురించి చెప్పే శాసనాలు సుమారు 16% ఉన్నాయి. ఇది సమకాలీన సమాజంతో పోల్చినపుడు తక్కువ అనిపించినా జమిందారీ యుగంతో పోల్చుకొన్నప్పుడు ఎక్కువేనని చెప్పుకోవాలి.

ఆలయముల చరిత్ర చెప్పేటప్పుడు చర్చకువచ్చే మరో అంశం ఆలయ నర్తకిలు. గుడిలో ఉంటూ నాట్యము, సంగీతము లాంటి కళలను ప్రదర్శించే స్త్రీలను సానులు, సాని సంప్రదాయమువారు, గుడిసానులు అని పిలిచేవారు. వంశపారంపర్యంగా నాట్యవృత్తిని కొనసాగిస్తున్న వారని సాని సంప్రదాయము వారు అంటారు. గుడిసానులు[22] వ్యభిచారులు కాదు. వీరు సంగీత నాట్య శాస్త్రాలను నేర్చుకొని దేవునిసేవకు, ఆలయంలో ఇతర కైంకర్య పనులకు భక్తితో అంకితమైనవారు. ఆలయములలో జరిగే అంగరంగభోగములను గుడిసానులే జరిపించేవారు. (అంగభోగము అంటే దేవతా విగ్రహములకు చేసే అలంకారాలు నివేదనలు. రంగభోగము అంటే గుడిని శుభ్రపరచి ముగ్గులతో అలంకరించటం)

కొన్ని శాసనాలలో కనిపించే జ్ఞానసాని, సూరసాని, దొడ్డసాని లాంటి పేర్లలో ఆయా వివాహితుల పేర్లకు చివర సాని అనే పదం స్వామిని (భార్య) అనే అర్థంలో వాడబడిందని అర్థం చేసుకోవాలి.

తెలుగునాట వివిధ గుడి సానులకు ఇచ్చిన దాన శాసనాలు మొత్తం 74 కలవు. ద్రాక్షారామానికి సంబంధించి అలాంటి శాసనం ఒకటికూడా లేకపోవటం ఆశ్చర్యం కలిగించకమానదు. అలాగని ద్రాక్షారామ ఆలయంలో గుడిసానులు లేరని చెప్పలేం.

****

22. గుడిసానిలపై పుస్తకంచివరలో విపులమైన వ్యాసం కలదు.

భార్యా భర్తలు చెరిసగం అనే ప్రాతిపదికన, భర్త చనిపోయిన స్త్రీలో భర్తయొక్క సగభాగం ఇంకా బ్రతికి ఉన్నట్లే కనుక ఆమెకూడా భర్త ఆస్తికి హక్కుదారు అవుతుందని అయిదో శతాబ్దానికి చెందిన యాజ్ఞవల్క్య స్మృతి చెప్పింది. అది ఆనాటి రాజ్యాంగం కనుక అప్పట్లో వితంతువులతో సహా స్త్రీలకు ఆస్తిలోహక్కు ఉండేదని అనుకోవచ్చు. రాజస్త్రీలు తమకు తాముగా భీమేశ్వరునికి అనేక దానములు ఇవ్వటాన్ని గమనిస్తే, ఆనాటి సాంఘికవ్యవస్థలో స్త్రీలు ఆర్థిక స్వాతంత్ర్యం కలిగిఉండేవారని అర్థమౌతుంది. ద్రాక్షారామ ఆలయానికి దానం ఇవ్వబడ్డ మొత్తం 53 మాన్యాలలో 8 మాన్యాలను స్త్రీలు ఇవ్వటం గమనార్హం.

కాకతి రుద్రదేవరాజు భార్య దన్నమదేవి క్రీశ.1169లో నిత్యదీపారాధన ఏర్పాట్లు చేయించారు[23]. క్రీశ.1135 లో ముమ్మడి కోనరాజు భార్య రాజదేవి భీమనాధునికి అఖండదీపాన్ని సమర్పించుకొన్నారు[24].

రెండవ గొంకరాజు వద్ద ప్రధాని, సమస్త సేనాధిపతిగా పనిచేసిన వాసనపెగ్గడ కూతురు గుండమ భీమేశ్వరునికి అఖండదీపం సమర్పించుకొన్నది[25].

దూరప్రాంతం నుంచి వచ్చిన భక్తులు స్థానికంగా కొన్ని భూములను కొని, స్వామికి సమర్పించుకొన్నట్లు కొన్ని శాసనాలలో కనిపిస్తుంది. కళింగ రాజ్యానికి చెందిన అనంతపాల దండనాయకుని భార్య మహాదేవి ఇరవై మాడలు పెట్టి ఆలయసమీపములో ఒక నందనవనమును కొని ఆలయసేవకులకు స్వామి పేరిట దానం చేసెను [26].

భక్తులు చేసే దానములు చాలామట్టుకు శివయోగినులకు, బ్రాహ్మణులకు, విద్యార్థులకు, పొరుగూరినించి వచ్చే భక్తులకు, ఆలయసేవకుల పోషణ కొరకు ఇచ్చినట్లు అనేక శాసనముల ద్వారా తెలుస్తుంది.

కొన్ని శాసనములలో ఎంతమందికి పోషణ జరపించాలి అనే వివరాలు ఉండటం విశేషం.

కులోత్తుంగ చోడదేవుని వద్ద పనిచేసే ఒక అధికారి కూతురు భీమేశ్వరునికి ముప్పై పుట్ల భూమిని దానం ఇచ్చి దానిపై వచ్చే ఆదాయంతో ఈ క్రిందివిధంగా జరిపించాలని శాసనం వ్రాయించింది.

23. SII Vol IV - 1095 24. SII Vol IV - 1041 25. SII Vol IV - 1089
26. SII Vol IV - 1211 `

ఇరవైమంది బ్రాహ్మణులకు యాభైకుంచముల ధాన్యం, మూడు కుంచముల పప్పు, నేతికి ఒకమాడ, నంజుడ్లకు (పచ్చళ్ళు) నాలుగు మాడలు, మిరియములు అరసోల, సక్కులకు (అట్లు) మూడు మాడలు, ఉప్పుకు ఒకమాడ, బెల్లంకు ముప్పై మాడలు ఇయ్యవలెను; వంట బ్రాహ్మణునికి మూడు మాడలు; కట్టెలు తెచ్చిన వానికి మూడు మాడలు; ఎంగిళ్ళు ఎత్తే, నీళ్ళు తెచ్చే ఇద్దరికి మూడు మాడలు చొప్పున ఇచ్చి – ఈ విధంగా ఆచంద్రతారార్కం జరిపించాలి[27].



మహాభారతమును ఆంధ్రీకరించిన నన్నయ భట్టారకుడు రాజమహేంద్ర వాసి. అప్పటికే గొప్ప శైవ క్షేత్రముగా ఎదుగుతున్న ద్రాక్షారామమును దర్శించే ఉంటాడు. కానీ నన్నయకు సంబంధించిన శాసనాధారాలు కానీ, ఇతర సాహిత్య విశేషాలు కానీ కనిపించవు.

నన్నయ మహాభారతాన్ని రచిస్తున్నపుడు తన సహాధ్యాయుడు, ధరామరవంశ విభూషణుండు, వాఙ్మయ ధురంధరుడు, ఎంతో ఇష్టుడు అయిన నారాయణభట్టు అనేమిత్రుడు తనకు సహాయపడినట్లు చెప్పుకొన్నాడు[28]. ఈ నారాయణభట్టు వ్రాసిన మహాభారత భాగాలేమిటో తెలియరావు కానీ, ఈ నారాయణభట్టు కూతురు కుపమ అఖండవత్తి, లోహపుదివియ, యాభై ఇనుప ఎడ్లు, భీమేశ్వరునికి సమర్పించుకొన్నట్లు క్రీశ1055 నాటి ఒక శాసనము ద్వారా తెలియుచున్నది.

కొన్ని శాసనాలలో రాజుగారి భోగస్త్రీ లేదా లంజియ పేరుతో దానాలు కనిపిస్తాయి. అలాంటి స్త్రీలకు బహుసా ఆకాలములో అధికారిక భార్యలతో సమానమైన సామాజిక హోదా లభించేదని భావించాలి.

**ఆనాటి జీతభత్యాలు**

ఆలయాన్ని నమ్ముకొని ఉపాధిపొందుతున్న సిబ్బందికి ఒక సాలుకు ఆలయ ఖజానా నుంచి ఇచ్చిన జీతభత్యాల వివరాలు సప్తమ విష్ణువర్ధనుడి కాలంలో (క్రీ.శ. 1070–1118) వేయించిన ఒక శాసనములో[29] కలవు

27. SII Vol IV - 1015
28. కవిజీవితములు, గురజాడ శ్రీరామమూర్తి పే. 54
29. SII Vol IV - 1288

| | | |
|---|---|---|
| 1. | వడ్లు దంచే ఒక స్త్రీకి: | ఒక మాడ, 13 పుట్ల ధాన్యం (పుట్టి 20 కుంచాలు) |
| 2. | వంటచెరకు తెచ్చే కూలీకి: | ఒక మాడ, 13 పుట్ల ధాన్యం |
| 3. | వంటమనిషికి | 5 చిన్నాలు[30], 1 పుట్టి ధాన్యం |
| 4. | విస్తర్లు కుట్టే వ్యక్తికి | 3 చిన్నాలు |
| 5. | కుమ్మరి | 5 చిన్నాలు, 6 పుట్ల ధాన్యం |

మొదటి రెండు పనులు చేసే వారికి ఇచ్చే కూలి మిగిలినవారి కూలి కంటే ఎక్కువగా ఉండటం గమనించవచ్చు. వడ్లు దంచటం, అడవిలో కఱ్ఱలు కొట్టి బండిపై తీసుకురావటం లాంటివి ఒకరికంటే ఎక్కువమంది చేయాల్సిన పనులు. కానీ శాసనపాఠంలో వడ్లు దంచ్చుదానికి, కఱ్ఱలు వెట్టువానికి అని ఏకవచన సంభోదన ఉన్నది. ఆనాటి సమాజంలో శారీరిక కష్టానికి ఎక్కువ ప్రతిఫలం దక్కేదా అనే సందేహం కలుగుతుంది.

అదే కాలానికే చెందిన మరో శాసనముద్వారా[31] – శ్రీమంగలి ఒక్కనికి 6 చిన్నాలు, మాలకారునికి 4 చిన్నాలు, కుమ్మరి సారె ఒక్కింటికి 8 చిన్నాలు, ఒడ్డరికి (మట్టిపనిచేసే వ్యక్తి) 8 చిన్నాలు, కమ్మరికి 8 చిన్నాలు, కంసాలికి 8 చిన్నాలు, కండమంగలికి 8, చాకలికి 8 చిన్నాలు, అఖండ దీపాన్ని సంరక్షించే వ్యక్తికి 3 చిన్నాల చొప్పున వివిధ వృత్తులు నెరపే ఆలయసిబ్బందికి అప్పట్లో జీతాలు ఇచ్చినట్లు తెలుస్తుంది.

**రాజులు చేసిన దానాలు**

ఈ ప్రాంతాన్ని పాలించిన తూర్పు చాళుక్యులు, చోళులు, కాకతీయులు, కల్యాణచాళుక్యులు, రెడ్డిరాజులు, గజపతులు, విజయనగర రాజులు, కోనరాజులు చోడులు, కోటరాజులు లాంటి పాలకులు ద్రాక్షారామ భీమేశ్వరాలయానికి అనేక దానాలు చేసి వివిధ శాసనాలను వేయించారు. ఇవి పదకొండవ శతాబ్దంలో మొదలై పదహారో శతాబ్దం వరకూ విస్తరించి ఉన్నాయి.

---

30. చిన్నము అంటే ఒక వరహాలో ఎనిమిదో వంతు విలువచేసే వెండినాణెము.
31. SII Vol IV - 1288

రాజరాజ నరేంద్రుని కాలంనాటికే ద్రాక్షారామం గొప్ప శైవక్షేత్రంగా రూపు దిద్దుకొంది. రాజరాజ నరేంద్రుడు వేయించిన శాసనాలు ఏవీ ఆలయంలో కనిపించకపోయినా ఇతని పాలనాకాలంలో ఒక కోమటి భీమేశ్వరునికి సంధ్య దివ్వెలు, దేవాలయముపై ఎగిరే జండా కొరకు రెండు తెల్లని వస్త్రములు సమర్పించుకొన్నట్లు క్రీశ 1038 లో వేయించిన శాసనముద్వారా తెలుస్తున్నది. దేవాలయములో లభించే అత్యంతపురాతనమైన శాసనము[32] ఇంతవరకూ ఇదే.

రాజరాజ నరేంద్రుని తరువాత అతని సవతితమ్ముడు విజయాదిత్య VII వేంగిసింహాసనాన్ని అధిష్టించాడు. ఇతని కూతురు గుణారామ, జగదేకసున్దరి, మత్తేభమందగమన అయిన సోమలదేవి క్రీశ1065లో భీమేశ్వరునికి అఖండ దీపాన్ని, మణులహారాన్ని సమర్పించుకొన్నది. క్రీశ. 1064 నాటి మరో శాసనములో[33] విజయాదిత్య VII పాలిస్తూండగా సుప్పనాయక అనే బ్రాహ్మణుడు దేవరకు దీప దానం చేసినట్లు ఉంది.

క్రీశ 1083 సంవత్సరంలోని ఒక శాసనంలో బేతినాయుదు కూంతుఱు జయమ ద్రాక్షారామ ఆలయంలో ఉన్న కులోత్తుంగచోడ సత్రానికి ముప్పది పుట్ల పంటభూమి దానంగా ఇచ్చింది. రాజరాజ నరేంద్రుని కొడుకు రాజేంద్ర చోడుడు. ఇతను తమిళనాడులోని చోళరాజ్యంలో రాజకీయశూన్యం ఏర్పడినప్పుడు క్రీశ. 1070 లో కులోత్తుంగ I పేరుతో అధిష్టించాడు. పై శాసనం ద్వారా ఇతను తనపేరుమీద ఒక సత్రం కట్టించి ఉంటాడని ఊహించవచ్చు.

వెలనాటిచోడ రెండవ గొంకరాజు భీమేశ్వరునికి క్రీశ. 1142 లో నిత్య దీపారాధనకు ఇరవై దీపపుసెమ్మెలు, దీపారాధనకొరకు వెయ్యి ఇనుప ఎడ్లు దాన మిచ్చాడు. ఇతనే కీశ. 1148 లో మరలా బంగారు కశలాలను, దీపంసెమ్మె, బంగారు ఆభరణములను సమర్పించుకొన్నట్లు, పదిద్వారములు కలిగిన కోష్టమండప నిర్మాణం గావించినట్లు, ద్వారపాలక విగ్రహములను ఏర్పాటు చేసినట్లు శాసనములు కలవు. చోడరాజులందరిలో రెండవ గొంక రాజు అనేక దానములిచ్చిట్లు సుమారు ముప్పై పైన శాసనములు కలవు[34] .



32. SII Vol IV - 1014 33. Inscriptions Of The Madras Presidency Vol. 2 p.724
34. South Indian Inscriptions, Vol IV No. 1140-1142

అనుమకొండ కాకతి రుద్రదేవుని ప్రస్తావన మొదటి సారిగా 1158లో అతని మంత్రి ఇనంగల బ్రహ్మిరెడ్డి చేసిన ఒక దానశాసనంలో కనిపిస్తుంది[35].

రుద్రదేవుడు కాకతీయ సామ్రాజ్యాన్ని ఆంధ్రావరకు విస్తరించినపుడు వేయించిన మొదటి శాసనం ద్రాక్షారామంలో ఉన్నది. అది క్రీశ.1186లో ద్రాక్షారామ భీమేశ్వరునికి రుద్రదేవుడు అఖండవత్తి, లోహదణ్డు సమర్పించుకొన్న సందర్భంగా వేయించిన శాసనము.

కాకతి గణపతి దేవుడు (క్రీశ.1199–1262) మొత్తం ఆంధ్రదేశాన్ని ఒకే పాలన క్రింద తీసుకొచ్చాడు. ఇతని పాలనకు సంబంధించి మొత్తం 7 శాసనాలు[36] ద్రాక్షారామ ఆలయంలో ఉన్నవి. వాటిలో– కాకతి గణపతిదేవుని ఆధ్యాత్మిక గురువు ధర్మశివ క్రీశ 1234లో సమర్పించిన దీపదానం, క్రీశ.1262లో స్వామి వారికి గణపతిదేవుల ఆజ్ఞప్రకారం మకరతోరణము, సింహాసనము, బంగారు చామరములు, బంగారుపల్లకి, సంగీతవాయిద్యపరికరములు సమర్పిస్తున్నట్లు మరొక శాసనము చారిత్రికంగా ముఖ్యమైనవి.

గణపతిదేవుని తరువాత రాజ్యం చేసిన రుద్రమదేవి పాలనలో ఆమెకు సంబంధించిన ఒక శాసనం కలదు. క్రీశ.1278 లో కాకతియ్య రుద్రమదేవికి శుభం కలగాలని సురయ రెడ్డి అనే వ్యక్తి మామిండివాడ అనే గ్రామంలో తనకు వచ్చే వాటాను భీమేశ్వర స్వామికి అఖండదీపారాధన కొరకు సమర్పించుకొన్నాడు.

ప్రతాపరుద్రుని (1289–1323) పాలననుండి ఒకే శాసనం కనిపిస్తుంది. కాకతీయ ప్రతాపరుద్రుని వద్ద మహాప్రధానిగా ఉన్న అన్నయ ప్రధాని క్రీశ.1293 లో భీమేశ్వరస్వామివారి అఖండదీపానికి ఏర్పాట్లు చేసినట్లు తెలుస్తుంది.



వెలనాటిచోడ రెండవ గొంకరాజు కొడుకు రాజేంద్రచోడుడు II (క్రీశ.1163–80) తండ్రికి తగ్గ తనయుడు. ఇతను సతీసమేతంగా వచ్చి స్వామివారిని దర్శించుకొని ఇచ్చిన అనేక దానాలకు సంబంధించి ఇరవైకి పైన శాసనాలు కలవు. పందమదేవి, గోకమహాదేవి ఇతని భార్యలు. రాజేంద్రచోదుని శాసనములలో పదవలు (సామాన్య అధికారి), కొట్టరువు (కోశాధికారి), ముదుసలి (రాజుగారి ఆహారతనిఖీ అధికారి), భండారము (భాండాగారాధికారి) అనే ఆనాటి వివిధ అధికారిక హోదాలు తెలుస్తాయి[37].

35. SII Vol IV - 1107   36. SII Vol IV - 1117, 1056, 1342 B   37. SII Vol IV - 1205

అనంగ భీమదేవ/అనంతవర్మ చోడగంగ (క్రీశ.1178-1198) గంగ నుంచి గోదావరి వరకు పరిపాలించిన తూర్పుగాంగు రాజు. ఇతనికి సంబంధించిన ఎనిమిది శాసనాలలోనూ ఇతని భార్యలైన లావణ్యవతి, రాజలదేవి, పద్మలదేవి, కలిగమహాదేవి, జయగొండచోడ, శ్రీయదేవి, లీలావతిదేవి, కళ్యాణవతి, జెన్నమహాదేవి పేర్లు వరుసగా ఉండటం గమనార్హం

హైహయవంశ స్థాపకుడైన ముమ్మడి భీమ కుమార్తె భీమేశ్వర స్వామికి దీపదానం ఇచ్చినట్లు ఒక శాసనం[38]ఉన్నది.

---

పద్నాలుగో శతాబ్దంలో మహమ్మదీయులు చేసిన దాడులకు ఆంధ్ర ప్రాంతం చాలా ఒడిదుడుకులకు గురయ్యింది. శ్రీకూర్మం, సింహాచల ఆలయాలపై ముస్లిం సేనలు చేసిన దాడులు అటు శాసనాలలోను, ఇటు సాహిత్యంలోను దొరుకుతాయి. కానీ ద్రాక్షారామ ఆలయంపై ముస్లిం దాడులు జరిగాయని చెప్పే శాసనాధారాలు కానీ సాహిత్యాధారాలు కానీ లభించవు. సుమారు ఇదే సమయంలో క్రీశ.1384లో అనవోత వేమారెడ్డి అనేక మండపములు,గోపురములు, ప్రాకారము, నేలమాళిగలు, నాలుగుద్వారములు నిర్మింపచేసినట్లు ఒక శాసనములో[39] ఉండటం గమనార్హం. ఇది జీర్ణోద్ధరణా, పునరుద్ధరణా లేక విస్తరణా అనేది చెప్పటం కష్టం.

అలాగే క్రీశ.1414 లో ఆస్థానమండప నిర్మాణము, ప్రాకార నిర్మాణలను తన ప్రభువు కాటవేమారెడ్డికి శుభం కలగాలని కడియం మంచినేడు అనే వ్యక్తి కట్టించాడు[40].

విజయనగర రాజుల గురించి ఒకే ఒక శాసనము కలదు. ఇది క్రీశ.1444 లో ప్రౌఢ దేవరాయుల పాలనలో శెట్టి అనే వ్యక్తి చేసిన దానముకు సంబంధించినది[41]

అదే విధంగా గజపతి రాజులకు సంబంధించి కూడా రెండు శాసనములు మాత్రమే కనిపిస్తాయి. ఒకదానిలో రాణిభానుదేవమ్మ మండపాన్ని కట్టించిన వివరములు, రెండవదానిలో పురుషోత్తమరాజు చేసిన దానము గురించి కలదు[42].

వ్యక్తులు చేసిన దానాలు

38. SII Vol IV - 1100
39. SII Vol IV - 1379
40. SII Vol IV - 1329
41. SII Vol IV - 1375
42. SII Vol IV - 1362

కోన సత్యచోడ గంగ్గ అనే వ్యక్తి తనకు సంక్రమించిన భూమిని భీమేశ్వర ఆలయానికి పడమటవైపున ఉన్న సత్రములో పొరుగూరిలనుంచి వచ్చే భక్తుల సౌకర్యముల నిమిత్తం స్వామివారికి ధారాదత్తం చేసాడు[43].

వీరకోటకు చెందిన సౌభాగ్యదేవరాజు బిక్కవోలు గ్రామంలో రెండు పుట్ల భూమిని కొనుగోలు చేసి స్వామివారి నిత్యనైవేద్యం కొరకు సమర్పించుకొన్నాడు[44].

క్రీశ. 1048 సంవత్సరములో పోలిసెట్టి అనే వైశ్యుడు ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యదినమున భీమేశ్వర స్వామికి అఖండదీపారాధన కొరకు దీపపు సెమ్మలను దానం చేసాడు. క్రీశ. 1068 లో కమ్మకోమటి (కమ్మనాడుకి చెందిన కోమటి) అనే వ్యక్తి నిత్యదీపారాధన ఏర్పాటు చేసాడు.

**వివిధ రకాల దానాలు**

ద్రాక్షారామ ఆలయానికి భక్తులు- గ్రామాలు, పంట భూములు, ఉద్యానవనాలు, పశువులు, ధనము, ఆభరణాలు లాంటి వివిధరకాల దానాలను సమర్పించుకొన్నారు[45]. ఈ దానములను ఎక్కువగా సంక్రాంతి దినములలో, కొత్త అమావశ్య రోజున, గౌరీవ్రతం నాడు, వివిధ గ్రహణముల సమయములలోను చేయటం అనేక శాసనములలో కనిపిస్తుంది. ఆలయాన్ని దర్శించుకొన్న వేరేప్రాంత వాసులు ఏదైనా దానం ఇచ్చేటపుడు స్థానికంగా ఉండే ప్రముఖులను సాక్షులుగా పెట్టుకొనే సాంప్రదాయం ఉన్నట్లు కనిపిస్తుంది. హైహయ నాయకుడైన బీమరాజు ముప్పై ఖండికల పంటభూమిని, పద్దెనిమిది ఖండికల తోటను భీమేశ్వరునికి సమర్పించుకొన్నప్పుడు వేయించిన శాసనము చివరలో దీనికి సాక్షులు కేసవ ప్రెగడ, దండనాయక మండా అనే ఇద్దరి స్థానికుల పేర్లు కలవు.

ద్రాక్షారామ భీమేశ్వరునికి భక్తులు వివిధ కాలాలలో మొత్తం 13 గ్రామాలను దానంగా ఇచ్చారు. ఈ గ్రామాలనుంచి వచ్చే ఆదాయాన్ని ఆలయ క్రతువుల కొరకు వినియోగించమని శాసనాలు వేయించారు. క్రీశ 1231 లో హైహయ వంశానికి చెందిన రాణి పద్మావతి భీమేశ్వరదేవరకు ఖుండెనపల్లి గ్రామాన్ని

43. SII Vol IV - 1104 44. SII Vol IV - 1343

45. The Inscriptions of Draksharama a Cultural Study, SV University, PhD thesis by N.V. Ramaiah Chowdhary

అంకితం చేస్తూ, ఆ గ్రామం నుంచి వచ్చే ఆదాయాన్ని దేవతార్చనకు, మరమ్మత్తులకు వినియోగించమని కోరినది.

ప్రేకేటి వీరపనాయకుని కూతురు సూరమదేవి తన తల్లిదండ్రులకు ధర్మార్ధముగా ప్రతిఏటా గౌరివ్రతం వైభవోపేతంగా జరిపించేందుకు ఒడ్డాదిలోని సంకు భీమవరము అనే గ్రామాన్ని క్రీశ 1252 భీమేశ్వరునికి దానం చేసినది. ఇదే విధంగా పంద్రువాడ, శేషవరం, విశ్వనాథపట్టణం, మదువాడ, నడకుదురు లాంటి వివిధ గ్రామాలు ద్రాక్షారామ ఆలయమునకు దానం చేయబడినట్లు శాసనాలు కలవు.



12 నుండి 14వ శతాబ్దం మధ్యకాలంలో పంటభూములను విస్తారముగా ఆలయానికి దానం చేసినట్లు 49 శాసనాలు చెపుతున్నాయి. ఇవేకాక వివిధ భక్తులు అనేక ఉద్యానవనాలను/తోటలను దేవరకు సమర్పించుకొన్నట్లు 23 శాసనాలు కలవు. కొన్ని సార్లు దాతలు స్వయంగా ఆలయ సమీపభూములను కొని దేవునికి అర్పించేవారు. ద్రాక్షారామ భీమేశ్వరునికి ఇచ్చిన భూములు ఎక్కువగా పరిసరప్రాంతాలలోనివే అయినప్పటికీ ఆర్కోట్, తిరుచ్చి లాంటి దూరప్రాంతాల భూములు కూడా దానం ఇచ్చినట్లు శాసనాలు తెలుపుతున్నాయి.

ద్రాక్షారామ భీమేశ్వర ఆలయానికి వచ్చే భక్తుల భోజనసదుపాయముల కొరకు కుళోత్తుంగ చోడ సత్రం, మహేశ్వర మఠం, అండరి మఠం, ఎరమఠం, ఆరిమఠం, తిరువీధి మఠం, పెదమాటి సత్రం లాంటి వివిధ వసతులు ఉండేవి. వీటిలో తిరువీధి మఠం ఉచిత భోజనవసతి కల్పిస్తూ విద్యనేర్పే పాఠశాల.

పంటభూములను దానం ఇస్తూ వాటి ద్వారా వచ్చే ఫలసాయంతో పైన చెప్పిన సత్రాలలో వసతిపొందే భక్తులకు, విద్యార్ధులకు, మునులకు భోజన సదుపాయం కల్పించమని వివిధ భక్తులు కోరేవారు.

దేవాలయాలకు భక్తులు తోటలను దానం ఇచ్చినట్లు అనేక శాసనాలలో ఉంది. ఆ తోటలలో పూలు, పత్రి, పండ్లు, తమలపాకులు, పోకచెక్కలు లాంటివి సాగుచేసి స్వామివారి ఆరాధన కొరకు వినియోగించేవారు. ఈ తోటలకు నందన వనము, పుష్పవనము, దవనవనములాంటి పేర్లు ఉండేవి. ద్రాక్షారామ భీమేశ్వరాలయప్రాంగణంలో, పరిసరప్రాంతాలలో విస్తారమైన తోటలు కలవు.

మొదటి కులోత్తుంగ చోడుని కాలములో వేయించిన ఒక శాసనము ద్వారా ఆనాటి తోటల వివరాలు ఇలా తెలుస్తున్నాయి. 1. అనంతరాముని తోట 2.రెండువేల పోక చెట్లు కలిగిన ఎరియనాయకుని తోట 3. ప్రోలిసెట్టి తొండ గట్టయ తోట 4. ఆలయమునకు దక్షిణమువైపున సోమానాద్రి పెమ్మాడి ఆండర్ తోట 5. తూర్పువైపున తొండకొరడియ తోట[46]



దేవాలయములో దేవుని ఎదుట ఎల్లప్పుడు వెలుగుతూ ఉండే దీపమును అఖండదీపము అంటారు. ఇది హైందవ సాంప్రదాయము. ఏ కారణం చేతయిన ఆ అఖండజ్యోతి ఆరిపోయినట్లయితే అరిష్టం జరుగుతుందని ఈనాటికీ హిందువుల విశ్వాసం. దేవునివద్ద వెలిగే అఖండదీప నిర్వహణ కొరకు నేయిని వినియోగిస్తారు. ఈ నేయిని నిరంతరం అందించటానికి భక్తులు పాడిపశువులను దానంగా ఇచ్చేవారు. ఈ పశువులలో గేదెలు, గొర్రెలు కూడా ఉండటం గమనార్హం[47]. ఒక అఖండదీపాన్ని ఆచంద్రతారార్కం ఏర్పాటుచేయటానికి సుమారు 50 ఆవులు అవసరపడతాయని వివిధశాసనాలద్వారా అర్థమౌతుంది. అఖండదీప నిర్వహణకు, క్షీరాభిషేకానికి, ప్రసాదాల తయారీకి, వివిధ సత్రాలలో వినియోగం కొరకు భక్తులు విరివిగా పాడిపశువులను సమర్పించుకొనేవారు. పదకొండు నుంచి పదిహేనో శతాబ్దం మధ్య సుమారు పన్నెండువేల పాడిపశువులను ఆలయానికి భక్తులు సమర్పించుకొన్నట్లు శాసనాల ద్వారా తెలుస్తున్నది.

ఆలయ అవసరాలకొరకు ధనాన్ని నేరుగా కానుకలుగా భక్తులు సమర్పించుకొన్నట్లు 29 శాసనాలలో కన్పిస్తుంది.

కొంతమంది భక్తులు రాజు గారికి కొంతమొత్తం చెల్లించి ఏదైనా ఒక గ్రామానికి సంబంధించిన ఆదాయాన్ని కొనుక్కొని, ఆ గ్రామ ఆదాయాన్ని స్వామివారికి సమర్పించుకోవటం జరిగేది.

క్రీశ 1123లో సింగ్గలభండార అనే వ్యక్తి వేల్పూరు వద్దకల దేవదాన అనే గ్రామ రెట్టడికమును (గ్రామ యజమాన్యం) పరాంతకదేవ చక్రవర్తి నుండి 30 మాడలకు ఖరీదు చేసి భీమేశ్వర స్వామికి అర్పితము చేస్తూ ఇకపై ఆ

46. SII Vol IV - 1114

47. మరిన్ని వివరములు పుస్తకంచివరలో ఉన్న ఇనుపఎడ్లు వ్యాసంలో కలవు

గ్రామమునుండి వచ్చే పన్నుల ఆదాయాన్ని మునులు మరియు బ్రాహ్మణుల భోజనము కొరకు, కుమ్మరులకు, సత్రానికి వంటచెరకు తెచ్చే కూలీలకు వినియోగించాలని శాసనం వేయించాడు[48] .

క్రీశ. 1153కు చెందిన మరోశాసనంలో వేయయాజుల కొడుకు యజ్ఞమూర్తి రెట్టడికము (యాజమాన్యం) అనుభవిస్తూ ఉన్న భూమిని ఉలగుయ్యవాండ పెర్మాడికి 122 మాడలకు అమ్మినట్లు ఒక శ్రవనపత్రము (క్రియదస్తావేజు) కలదు[49]. అతను ఆ భూమిని తిరిగి భీమేశ్వర స్వామికి చందన సేవలకొరకు సమర్పించుకొన్నాడు.

చోడబల్లిరాజు అతని సోదరుడు ఇరువురు కలిసి, తమ తల్లిదండ్రులకు శుభం కలగాలని ఆలయ జీర్ణోద్ధరణ నిమిత్తం 45 మాడల రొక్కం క్రీశ. 1122 భీమేశ్వర దేవరకు సమర్పించుకొన్నారు.

ఆలయఖజానాలో కొంతమొత్తమును జమచేసి (సన్నిష్కము) దానిపై వచ్చే వడ్డీతో (మహానిష్కలు) భక్తులు కోరినవిధంగా జరిపించటానికి ఏర్పాట్లు ఉండేవి. ఒక శాసనములో[50] ఆలయ ఖజానాకు 5 మాడలు సమర్పించి,రోజుకు రెండు గిద్దల గంధం చొప్పున స్వామి వారికి ఆచంద్రతారార్కం నివేదించాలని ఉన్నది.

ధనమే కాక అనేక మంది భక్తులు స్వర్ణ ఆభరణములు, పూజా పాత్రలు, వంట పాత్రలు, లోహ దర్పణములు, స్వర్ణ చామరములు, మకరతోరణములు, ఉత్సవవిగ్రహాలు, గంటలు, ఆలయగజరాజుకు అలంకరణ మువ్వలు, పట్టుచీరలు, దీపపుసెమ్మెలు, కాగడాలు లాంటి వివిధ వస్తువులను సమర్పించుకొనేవారు.

****

ప్రాచీన కాలంలో దేవాలయం అనేది సమాజంలో Money Circulate చేసే ఆర్థికకేంద్రం. సమాజం చేసిన ఉత్పత్తిని దానాల రూపంలో స్వీకరించి తిరిగి మరలా సమాజంలోకే సర్క్యులేట్ చేయటానికి ఆలయాలు అప్పట్లో ప్రధాన కేంద్రాలుగా ఉండేవి. ఆలయాలు గ్రామీణ ఎకానమీని పట్టణ ఎకానమీని అనుసంధానం చేసేవి. దేవుని పేరుమీద జరిగే ఈ తతంగంలో అప్పటి సమాజంలోని దాదాపు అన్ని సామాజిక వర్గాలకు ఏదోఒక పాత్ర ఇవ్వబడింది. అప్పటి

48. SII Vol IV - 1248   49. SII Vol IV - 1186   50. SII Vol IV - 1093

అప్పటిసమాజంలో అంత్యజులుగా చూడబడ్డ పంచమవర్ణానికి చెందిన వ్యక్తులకు కూడా – రాత్రిపూట ఆలయాన్ని కాపలాకాయటం, దేవాలయగోపురాలపై వాలి మాంసఖండాలను ఆలయప్రాంగణంలోకి జారవిడిచే గద్దలు, రాబందుల వంటి పక్షులను చెదరగొట్టటంలాంటి పనులు ఇచ్చి తనలో ఇముడ్చుకొంది[51] ఆనాటి ఆలయవ్యవస్థ. ఈ పాత్రల్లో ఎక్కువతక్కువలు ఉండటమనేది కాదనలేని సత్యం. అది వేరే చర్చ. ఒక రాజ్యంపై శతృరాజులు దండెత్తినపుడు ఆ రాజ్య ఆర్థిక కేంద్రాలయిన ఆలయాలను ధ్వంసం చేయటం ద్వారా తమ విజయాన్ని స్థిరపరచుకొనేవారు.

**ఇతర ప్రాంతాలకు చెందిన శాసనాలు**

మెకంజీ సేకరించిన తూర్పుగోదావరి జిల్లా శాసనాలలో ద్రాక్షారామం తరువాత కోరుకొండ, సర్పవరం, పిఠాపురం, బిక్కవోలు, అనపర్తి గ్రామాలకు రాజమహేంద్రవరం పట్టణానికి చెందిన శాసనాలు యాభై వరకు కలవు. ఇవి ఎక్కువగా దానాలకు సంబంధించినవి. వీటిలో కొన్ని ముఖ్యమైన శాసనాలు.

రాజమండ్రి సివిల్ జడ్జి గారైన శ్రీ ఆసిస్ట్యా దొరగారి ఇంటి గుమ్మంలోపల ఉత్తరం వైపున పాతి ఉన్న శాసనాన్ని మెకంజి అనుచరులు గుర్తించి దాని నకలు తీసారు. గణపతిదేవుడు క్రీశ 1247 లో మహాదేవరాజు పేరున గజ్జరాన (రాజమండ్రి సమీప గ్రామం గజ్జరం) ఒక విగ్రహప్రతిష్టగావించి, ఆ ఆలయ అంగరంగ భోగాల కొరకు అంగడి సుంకాలలో మార్పులు తెస్తున్నట్లు వేయించిన శాసనము ఇది.

అదే విధంగా పిఠాపురం కుంతీమాధవస్వామి ఆలయంలో నలు పలకలుగా సుమారు పన్నెండు అడుగుల స్తంబంలా ఉండే శాసనం ఆంధ్రప్రాంత రాజుల వంశావళిని నిర్మించటానికి ఆధారమైంది. మూడవ గొంకరాజు భార్య, పృధ్వీశ్వర మహారాజు తల్లి అయిన జయాంబిక నవకండవాడ అనే గ్రామాన్ని నిత్యదీపారాధనకొరకు కుంతీమాధవ స్వామికి సమర్పించుకొన్న సందర్భంగా ఇది క్రీశ. 1186లో వ్రాయించిన శాసనము. ఈ శాసనంలో సుమారు పాతికమంది రాజుల వంశ కాలక్రమణిక లిఖించబడింది.

---

51. చామర్లకోట కైఫియ్యతు

సాధారణంగా దానశాసనాల చివరలో అతిక్రమణలకు పాల్పడినవారు, బ్రాహ్మణ హత్య, తల్లి హత్య, గోహత్య చేస్తే వచ్చేలాంటి పాపం మూటకట్టుకొని నరకానికి పోతారంటూ వివిధ రకాల శాపాలు ఉంటాయి.

ఈ శాసనంలో "దానం శత్రువు చేసినదైనప్పటికీ అది రక్షింపబడాలి. ఎందుకంటే శత్రువు శత్రువే కావచ్చు, కానీ దానం శత్రువు కాదు" అనే గొప్ప వాక్యం అనశ్వరమైనది.



మెకంజీ సేకరించిన ద్రాక్షారామ శాసనాలపై Pro.Y.V. Ramana వ్రాసిన Draksharama Inscriptions అనే పుస్తకంలో మెకంజీ 209 ద్రాక్షారామ శాసనాలు సేకరించాడని, Archaelogical Survey of India వారు మొత్తం 382 ద్రాక్షారామ శాసనాలను గుర్తించారని అన్నారు, ఈ రెండిటిలో ఉమ్మడిగా 42 మాత్రమే ఉన్నాయి. ఇది ఆశ్చర్యం కలిగించే అంశం. మెకంజీ అనుచరులు శాసన ప్రతులు తీసే సమయానికి, ఆర్కియలాజికల్ సర్వే వారు తీయటానికి మధ్య సుమారు ఎనభై ఏండ్ల వ్యత్యాసం ఉంది. ఈ కాలంలో కొన్ని శాసనాలు పోయి ఉండొచ్చు. మెకంజీ అనుచరులు సేకరించిన ద్రాక్షారామ శాసనాలలో ఎక్కువ భాగం దానాలే. కొన్నైతే ఆలయ గంటలపై ఉన్న రాతలకు కూడా ప్రతులు ఉన్నాయి. మెకంజీ సేకరించిన శాసనాలలో ఆనాటి సమాజాన్ని అర్థం చేసుకోవటానికి దోహదపడే కొన్ని శాసనాలు ఇవి.

క్రీశ. 1399 లో కలింగిరి వీరన్న తమ తల్లిదండ్రులకు పుణ్యలోకాలు గలుగగాను తమకు కందాళం వారి చాత క్రయలబ్ధమయిన గ్రామం కూచినపెద్దాడను భీమేశ్వరదేవరకు సమర్పణ చేసెను.

ఇక్కడ క్రయలబ్ధమైన అన్న పదం ఆకర్షిస్తుంది. ప్రైవేటు వ్యక్తులు అప్పట్లో మాన్యాలుగా పొందిన గ్రామాల హక్కులను క్రయవిక్రయాలు చేసుకొనేవారని అర్థమౌతుంది. (మెకంజీ శాసనం నెం. 9)

మండూరి కుప్పనాయుని సమక్షంలో రామచంద్రులు గంగయ్య వృత్తిని, పెన్నాడ అయ్యల వృత్తిని క్రయముగా పుచ్చుకొని, ఒక భక్తుడు భీమేశ్వర మహాదేవరకు సమర్పించుకొన్నాడు. ఇక్కడ వృత్తి అంటే వృత్తి మాన్యం కావొచ్చు. (వృత్తి నెరపుతున్నందుకు ఇచ్చే భూమి) (మెకంజీ శాసనం నెం. 46)

మెకంజీ 161 వ నంబరు శాసనములో “మేము, మా వారసులు పరాంతక దేవునికి తప్ప అన్యులకు సేవచేయము అని, అలాచేస్తే అది మా భార్యలను ఇతరుల పరం చేయటంతో సమానమని” రాపర్తి వర్గీయులు చేసిన ప్రమాణ శాసనమొకటి ఆసక్తి కలిగిస్తుంది. దీన్ని లిఖించినది స్థానికంగా ఉండే లేఖరి కాదు. రాజేంద్ర చోడ ఆచార్య అనే పేరు కనిపిస్తుంది. బహుసా ఈ రాపర్తి వారు పరాంతకదేవుని సమక్షంలో చేసుకొన్న సంధి ఒప్పంద సారాంసం కావొచ్చు ఈ శాసనం. దాన్ని తీసుకొచ్చి ఆ వర్గీయుల స్వస్థానంలో కల ఆలయంలో నాటటం బహుసా ఆనాటి రాజకీయ ఎత్తుగడ అనుకోవాలి.

మెకంజీ 20 వ నంబరు శాసనంలో ఆలయ పడమటి సత్రములో ఉండే పరదేశి తపస్సులకు, క్రీ శ 1154 లో గుడివాడము దానంగా ఇవ్వబడినట్లు ఉంది. ఎవరీ పరదేశి తపస్సులు అన్న కుతూహలం కలిగకమానదు.

క్రీశ 1434 నాటి ఒక శాసనములో “సప్తగోదావరి” తీర ద్రాక్షారమ పురం” అనే పదం మొదటిసారిగ కనిపిస్తుంది. అంతవరకూ గోదావరి నది గుద్దవాడి, గుద్రవర లాంటి పేర్లతో పిలువబడింది శాసనాలలో.

మెకంజీసేకరించిన తూర్పుగోదావరి శాసనాలను పరిశీలిస్తున్నప్పుడు దేవాలయాల శాసనాలు కాక గోదావరి గట్టున లభించినవి అంటూ కొన్ని, జైలు లోపల నేలపై పడి ఉన్నవి అంటూ మరికొన్ని, పేపర్లు సాపుచేసే రాయిమీద ఉన్న శాసనం అంటూ ఒకటి, అనపర్తి ఊరి మధ్యలో పాతుకుపోయిన శాసనమూ అంటూ మరొకటి ఇలా అనేక శాసనాల పాఠాలు కనిపించాయి. పాపం మెకంజీ అనుచరులు శాసనాల కొరకు అప్పట్లో నేలను దాదాపు జల్లెడ పట్టారని అర్ధమౌతుంది. అలా సేకరించిన వాటిలో 42 మాత్రమే ఆర్కియలాజికల్ రికార్డులలోకి ఎక్కాయి. మిగిలినవి వాస్తవరూపంలో ఉన్నవో లేవో! లేనట్లయితే వాటికి మెకంజీ ప్రతులు మాత్రమే మిగిలాయని అనుకోవాలి.



# ముక్కంటీశ్వరుడు

ముక్కంటీశ్వరుడు అనే రాజు ప్రస్తావన వివిధ మెకంజీ కైఫియ్యతులలో కనిపిస్తుంది. తెలుగునేలపై విలసిల్లుస్తున్న జైన మతాన్ని సమూలంగా నిర్మూలించటంలో భాగంగా, అనేకవేలమంది జైనబ్రాహ్మణులను ఈ ముక్కంటీశ్వరుడు చంపించాడని వివిధ కైఫియ్యతులు చెపుతున్నాయి. ఇతను అయిదో శతాబ్దంలో నెల్లూరునుంచి కృష్ణా వరకూ గల ఆంధ్రప్రాంతాన్ని పరిపాలించాడు. ఇతనికి సంబంధించిన శాసనాధారాలు చాలా తక్కువ. కొంతమంది చరిత్రకారులైతే అసలీ పేరుగల రాజే లేడని, అదొక పురాణపాత్ర అని కొట్టిపడేసారు కూడా. మరికొందరు ఇతను శాతవాహన వంశస్థుడని మరికొందరు పల్లవరాజని అభిప్రాయపడ్డారు. ఇతనికే త్రిలోచన పల్లవుడు, త్రినయన, త్రినేత్ర ఇంకా ముక్కంటి అనే వివిధ పేర్లు కలవు.

తెలుగునేలను పాలించిన రాజులలో ఈ ముక్కంటీశ్వరుడిని అత్యంత వివాదాస్పదుడుగా భావించవచ్చు. ఇతని తండ్రి పేరు ఎక్కడా కనిపించదు. తల్పగిరి గ్రామ కైఫియ్యతు ద్వారా ఇతను శివానుగ్రహం వల్ల ఒక బ్రాహ్మణ కన్యకు జన్మించాడని తెలుస్తుంది. ఇతను అకస్మాత్తుగా తెర పైకి వచ్చిన శైవమతానికి చెందిన రాజు కావొచ్చు. ఇతను అధికారం చేపట్టే సమయానికి తెలుగునాట జైనం, బౌద్ధం, ప్రధానమతాలుగా ఉండేవి. జైనులే అధికారంలో ఉండేవారని తెలుస్తుంది. శైవం ఇంకా వైదిక సాంప్రదాయపద్ధతులను ఒంట పట్టించుకోలేదు. శూద్రులైన జంగములే పూజారులుగా ఉండేవారు. బహుసా అది క్రింది తరగతి ప్రజల మతంగా మనుగడ సాగిస్తూ ఉండవచ్చు.

అలాంటి రాజకీయ పరిస్థితులలో, హైందవేతర మత నేపథ్యంలో ముక్కంటి మహరాజు అధికారం చేపట్టి జైనులను ఊచకోత కోయించాడని, గానుగులలో వేసి తొక్కించాడని, బౌద్ధ బస్తిలను నేలమట్టం చేసాడని మెకంజీ కైఫియ్యతులలో

పదేపదే ప్రస్తావనలు కనిపిస్తాయి. ఉత్తరభారతదేశం నుంచి పెద్ద ఎత్తున బ్రాహ్మణులను రప్పించి వారికి అగ్రహారాలు, మాన్యాలు ఇచ్చి హిందూమతాన్ని ఆంధ్రదేశంలో స్థిరీకరించే ప్రయత్నం చేసాడు. శైవాలయాలలోని శూద్ర పూజారులను తొలగించి వాటిని sanskritise (సంస్కృతీకరించి) బ్రాహ్మణులకు అప్పగించాడు. వైష్ణవాలయాలను కట్టించాడు.

తెలుగువారి చరిత్రలో ఇవేవీ సామాన్యమైన విషయాలు కావు. మతపరంగా, రాజకీయపరంగా తెలుగుజాతిని మలుపు తిప్పిన సందర్భాలివి. చరిత్రను విశ్లేషించే టపుడు పర్యవసానాలను పరిశీలించాలి తప్ప మంచి, చెడుల తీర్పులు చేయకూడ దంటారు. ముక్కంటి చేసింది మంచా చెడా అన్న చర్చ అనవసరం. ముక్కంటి మహరాజు చేసిన చర్యలవలన తెలుగునేలపై జైన బౌద్ధాలు కనుమరుగయ్యాయనేది ఒక చారిత్రిక సత్యం. శైవ సంప్రదాయం వేదానుగుణ్యంగా మార్చబడింది. ఈ ముక్కంటి మహరాజు ఒకే వ్యక్తా లేక అనేకులా అనేది కూడా సందేహాస్పదమే!

చరిత్రకారులు ముక్కంటీశ్వరుని ఉనికిని ఒక పురాణపాత్రగా భావించ టానికి కారణం– ఆధారాల లేమి, ఉన్న ఆధారాలలో పొంతనలేకపోవటమూ. ముక్కంటీశ్వరుడు అయిదో శతాబ్దానికిచెందిన చాళుక్య రాజైన విజయాదిత్యుని యుద్ధంలో సంహరించినట్లు తెలుగునాట లభించిన ఆధారాలు చెపుతున్నాయి. రెండో శతాబ్దానికి చెందిన కరికాల చోళుని చేతిలో ఓడిపోయి ఘోరంగా అవమానించబడినట్లు తమిళనాట లభించిన ఆధారాలు చెపుతున్నాయి. ఈ రెంటి మధ్యా కనీసం రెండు శతాబ్దాల అంతరం ఉండటం వల్ల ముక్కంటీశ్వరుడిని ఒక మిథికల్ పాత్రగా తేల్చారు కొంతమంది చరిత్రకారులు.



అయినప్పటికీ ముక్కంటీశ్వరుని చారిత్రికతకు అనేక ఆధారాలు లభిస్తాయి.

### 1. శాసనాలు

ముక్కంటి మహరాజు చేసిన దానాల కాల గడువు ముగిసిపోయాక తరువాత వచ్చిన రాజులు వాటిని పునరుద్ధరణ చేసినట్లు వేయించిన శాసనాలు అనేకం కనిపిస్తాయి.

వీటిలో మొదటిది పశ్చిమచాళుక్యరాజైన విక్రమాదిత్యుడు– ముక్కంటి మహరాజు చేసిన అన్నవరం గ్రామదానం కొనసాగేలా క్రీశ 660 లో నెల్లూరులో ఒక శాసనం వేయించాడు.

అదే విధంగా కేతమహారాజు – ముక్కంటి మహరాజు సప్తరుషుల పేర్ల మీదుగా చేసిన (కారసాల కైఫియ్యతులో చెప్పబడిన) దానాలను పునరుద్ధరణ చేస్తున్నట్లు క్రీశ. 1197 లో వేయించిన శాసనం ముక్కంటి చారిత్రికతను నిర్ధారించే అతి ముఖ్యమైన శాసనము.

భీమనాయకుడు, మహామండలలీకుడు, అల్లాడ సుద్ధదేవుడు లాంటి వివిధ చిన్న చిన్న రాజులు తాము ముక్కంటి మహరాజు వారసులమని ద్రాక్షారామ ఆలయశాసనాలలో చెప్పుకొన్నారు.

ముక్కంటి మహరాజు నుండి కృష్ణకు దక్షిణాన కల ఆరువేల గ్రామాలను దానంగా పొందినట్లు– మల్లరాజు, కోటరాజు అనే ఇద్దరు రాజులు ఒకేరకమైన శాసనాలను కలిగి ఉండటం చరిత్రకారులను తికమక పెట్టే ఒక అంశం.

త్రిలోచన పల్లవుడు, తెనాలిలో జైన వసతిని నిర్మూలించి, ఆ ప్రదేశంలో ముక్కంటి రామలింగేశ్వర ఆలయాన్ని నిర్మించాడని తెలుస్తుంది. నేడు ఆ రామలింగేశ్వర ఆలయ ప్రాంగణంలో వర్ధమాన మహావీరుని ప్రతిమ దొరకడం ఆ అంశాన్ని బలపరుస్తున్నది. ("ఆంధ్రదేశంలో జైన, బౌద్ధ మతాలు" గ్రంథం నుండి, రచన ప్రొ.బి.ఎస్.ఎల్. హనుమంతరావు, పేజీ 145)

ముక్కంటి అనే పల్లవరాజు తనతో పాటు మంచి, కొండ అనే ఇద్దరు నాయకులను వెంటతెచ్చుకొన్నాడు. వీరిద్దరు మంచికొండ అనే పట్టణాన్ని నిర్మించారని, వీరి వంశస్థులకు మంచికొండ గోత్రనామంగా స్థిరపడిందని శ్రీరంగం తామ్రపత్రాలద్వారా తెలుస్తున్నది. (History of the Reddi Kingdoms, M. Somasekhara Sarma)

## 2. సాహిత్యం

కరికాల చోళుడు క్రీస్తుశకం రెండో శతాబ్దం నాటి తమిళ చోళ రాజు. ఇతను హిమాలయాలవరకూ తన సామ్రాజ్యాన్ని విస్తరించాడని అంటారు. సాగునీటికోసం కావేరి నదిపై కల్లణై అనే ఆనకట్ట నిర్మించాడు. ఇది నేటికీ పనిచేస్తూ ఉన్న ప్రపంచంలోని రెండవ అత్యంత పురాతనమైన ఆనకట్టగా పేరుతెచ్చుకొంది. దీనిని బ్రిటిష్ వారు పంతొమ్మిదో శతాబ్దంలో రినోవేట్ చేసారు.

కరికాల చోళుడు కల్లణై ఆనకట్ట నిర్మించే సమయంలో సమీప సామంతులను, రాజులను వచ్చి సహాయపడమని ఆజ్ఞాపించాడు. ధరణికోటను కేంద్రంగా

చేసుకొని రాజ్యం చేస్తున్న ముక్కంటి మహరాజు నేను అతనికి బానిసను కాను అని ఎదురితిరిగితే, కరికాలచోళుడు అతని గర్వాన్ని అణచి అతనితో తట్టలతో మట్టి మోయించినట్లు ఒక నేరేటివ్ అనేక కావ్యాలలో కనిపిస్తుంది. ఈ కథనాన్ని జయంగోండన్, ఇరంగేశ వేంబ లాంటి తమిళ కవులు, పండితారాధ్యచరిత లో పాల్కురికి సోమనాథుడు తమరచనలలో ప్రస్తావించారు.

### 3. మెకంజి కైఫియ్యతులలో ముక్కంటి మహరాజు

అనూచానంగా చెప్పబడుతూ వస్తున్న విషయాలకు సరైన ఇతర ఆధారాలు లేనిదే చరిత్రకారులు పరిగణలోకి తీసుకోరు. కాలిన్ మెకంజీ సేకరించిన కైఫియ్యతులను యధాతథంగా తీసుకోవటానికి చాలామంది చరిత్రకారులు సందేహిస్తారు. అయినప్పటికీ మెయిన్ స్ట్రీమ్ చరిత్రలో కనిపించని అనేక విషయాలు వీటిద్వారా తెలుస్తాయి.

క్రిందచెప్పబడిన కైఫియ్యతులలోని మాయాపాదుకలు, మూడోకన్ను లాంటి కొన్ని విషయాలు మిథికల్‌గా అనిపించినా వాటిద్వారా దేనినో మెటఫోరికల్‌గా చెప్పటానికి ప్రయత్నిస్తున్నట్లు భావించాలి. ఉదాహరణకు ముక్కంటి ఈశ్వరాను గ్రహంతో ఒక బ్రాహ్మణ కన్యకు పుట్టాడని చెప్పే కథనం ద్వారా ఇతను బహుసా ఏదో పల్లవరాజు ఉంపుడు కత్తెకు పుట్టి ఉండవచ్చని కనుక తండ్రి పేరు చెప్పుకోలేని పరిస్థితి అయి ఉంటుందని అంటారు చరిత్రకారుడు ఎం. వెంకట రమణయ్య.

ముక్కంటీశ్వరుని గురించిన ఈ సమాచారం అంతా కడప, కర్నూలు, నెల్లూరు, క్రిష్ణా, గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాల కైఫీయత్తులలో ఎక్కువగా కనిపించటం గమనార్హం.

### బందరు కైఫియ్యతు

ముక్కంటి మహరాజు నిర్మించిన బందరు పట్టణ శివాలయాలలో జంగం వారు పూజారులుగా ఉండేవారు. వారు వైదిక సంప్రదాయానికి విరుద్ధంగా పూజలు నిర్వహించేవారు. ముక్కంటి మహరాజు ఆ జంగములను తొలగించి బ్రాహ్మణులను నియమించి వైష్ణవాలయాలలో వలే వేదనియమానుసారం పూజలు జరిపించమని ఆజ్ఞాపించాడు.

## జల్లూరు కైఫియ్యతు

చాళుక్యరాజైన విజయాదిత్యుడు తన చతురంగబలాలతో దిగ్విజయయాత్ర జరుపుతున్నప్పుడు, పశ్చిమదేశమందు త్రిలోచనపల్లవుడితో తలపడి విధివశాత్తు మరణించెను. ఆ సమయంలో విజయాదిత్యుని భార్య ఆరునెలల గర్భవతి. ఈమె "ముడిలేము" అనే అగ్రహారమునకు పోయి అక్కడి వాస్తవ్యుడు అయిన విష్ణుభట్ట సోమయాజి అనే ముని సంరక్షణలో విష్ణువర్ధనుడు అనే కుమారుడిని కన్నది.

## చందవోలు కైఫియ్యతు

కావేరి నదిపై ఆనకట్ట కట్టిన కరికాల చోళుడు ముక్కంటీశ్వరుని, ఇతర రాజులను జయించాడు.

## పల్లికులం పుట్టుపూర్వోత్తరాలు కైఫియ్యతు

కరికాలచోళుడు కావేరినదిపై ఆనకట్ట కడుతున్న సమయములో వివిధ ప్రాంతాలను ఏలే రాజులను ఆ నిర్మాణానికి సహాయపడవలసినది అని ఆజ్ఞాపించాడు.

అప్పట్లో ధరణికోటలో అమరేశ్వర మహాప్రసాదంబున నుదుట కన్నుగలిగిన ముక్కంటీశ్వరుండనే రాజు వద్దకు కరికాల చోళుని భటులు వచ్చినపుడు "నేను మూడు కన్నులు కలిగిన వాడను, రెండుకన్నులు కలిగిన వాడికి (కరికాలునికి) ఎందుకు వెట్టి చేస్తానని" ఆగ్రహించి పలికెను. ఈ విషయాన్ని ఆ భటులు కరికాలునికి విన్నవించినపుడు అతడు ముక్కంటీశ్వరుని ఆకారమును నేలపై వ్రాయించి, బొటనవ్రేలుతో నుదుటకన్నును ద్రొక్కిన అక్కడ అతని కన్ను రక్తంబు మెరుగ దర్పంబుమాని వచ్చి వెట్టి చేసెను.

## చౌడేశ్వరీ నందవరీకుల సారాంశం కైఫియ్యతు

త్రిలోచనమహారాజు గంగాస్నాన నిమిత్తమై వారణావర్తమునకు పోయి యుండగా స్నానకాలమందు అనేక బ్రాహ్మణ్యులు వచ్చి తమకు ఒక అగ్రహారం కావలెనని యాచించగా, వారిని మహారాజు మీకు ఏ సీమలో కావలెను అని అడుగగా, వారు శ్రీశైల ప్రాంత్యమునందు కావలెనని యాచించినారు.

పిమ్మట పద్దెనిమిది గోత్రాలకు చెందిన నూటఎనిమిదిమంది ఆ బ్రాహ్మణులను త్రిలోచన మహారాజు తన వెంటబెట్టుకొని శ్రీశైల పర్వత సమీపములో, అహోబిల

నరసింహాలయనకు పశ్చిమభాగమునందుకల అరణ్యములను నరికించి గ్రామ నిర్మాణము చేయించి, అక్కడ ముక్కంటీశ్వరుడు అనే యీశ్వరదేవాలయము కట్టించి ఆ ఊరికి త్రిలోచనపురమనే నామధేయము చేసి, నూట ఎనిమిది వృత్తుల వారిని అమర్చి ఆ గ్రామమును ఆ బ్రాహ్మణులకు దానమిచ్చెను.

**సంతరావూరు–శాసనములు కైఫియ్యతు**

ఇది ప్రకాశం జిల్లా సంతరావూరు గ్రామానికి చెందిన కైఫియ్యతు. ఈ ప్రాంతమున జైనులు ప్రాలులై (మంగళకరముగా) చాలాదినములు ప్రభుత్వం చేస్తూ ఉన్నారు. అటుపిమ్మట యీశ్వరాంశం చేతను ముక్కంటి మహారాజు– జైనులను, బౌద్ధులను, చార్వాకులను తరిమివేసి, వారి రాజ్యములను జయించి, దివ్యప్రభావ సంపన్నుడై యోగవాగములు గ్రహించి, గంస్నానమున్ను, విశ్వేశ్వర ఆరాధనలు చేస్తూ చాలా దినములు ప్రభుత్వము చేసెను.

**ఉప్పుటూరు (గుంటూరు) కైఫియ్యతు**

ముక్కంటి మహారాజు వద్ద మాయాపాదుకలు ఉండేవి. వీటి సహాయంతో ప్రతీరోజు ధరణికోటనుండి కాశి వెళ్లి విశ్వేశ్వరుని దర్శించుకొని పూజచేసుకొని తిరిగి వచ్చేవాడట. ఒకరోజు అలా కాశీ వెళ్ళి గంగానదిలో స్నానం చేసి బయటకు వచ్చేసరికి తన మాయాపాదుకలు కనిపించలేదట. తిరిగి తన రాజ్యానికి ఎలా చేరుకోవాలో తెలియని మహారాజు దుఃఖితుడై ఉండగా, కొంతమంది బ్రాహ్మణులు వచ్చి తమ యోగబలంతో ఆ మాయాపాదుకలను కనుగొని మహారాజుకు ఇచ్చారట. దీనికి సంతసించిన ముక్కంటి మహారాజు ఆ బ్రాహ్మణులను ధరణికోట రప్పించుకొని వారికి వందగ్రామాలను కలిగి ఉన్న ఉప్పుటూరు అనే అగ్రహారాన్ని సర్వమాన్యంగా ఇచ్చినాడు.

**మోటుపల్లి (కృష్ణా) కైఫియ్యతు**

ముక్కంటి మహరాజు ధరణికోటను రాజధానిగా చేసుకొని పాలిస్తున్న కాలంలో కొంతమంది బౌద్ధులు వచ్చి ద్వేలానగరం పేరుతో ఒక నగరాన్ని ఏర్పరచుకొని అక్కడ ప్రాకారంతో కూడిన ఒక బుద్ధుని ఆలయాన్ని నిర్మించుకొని నివసించుచున్నారు. ముక్కంటి మహరాజు తనరాజ్యంలో బౌద్ధులను నిర్మూలించే క్రమంలో ఈ ద్వేలానగరానికి వచ్చినపుడు దానిని ధ్వంసం చేసి, ఆ ప్రాంతానికి

ముకుళానగరమని పేరు పెట్టి (మోటుపల్లి) అక్కడ కోదండరామస్వామి, మల్లికేశ్వరుల ఆలయాలను నిర్మించి బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. కొంతకాలానికి ఆ ప్రాంతం సముద్రంలో మునిగిపోయింది.

### కారసాల గ్రామ కైఫియ్యతు

చిల్కలూరిపాడు తాలుకా కారసాల గ్రామంలో కలియుగం ప్రవేశమైన తర్వాత జయినులు ప్రబలులై బస్తీలు ఏర్పరచుకొని దేశం యొక్క ప్రభుత్వములు ఆక్రమించుకొని అధికారం చేసే సమయమందు, కొంతమంది జయినులు ఈ కారసాల గ్రామం కట్టి నివాసం చేసిరి.

తదనంతరం రుద్రవరప్రసోదోద్భవులయినషువంటి ముక్కంటి మహారాజు లుంగారు ప్రభుత్వానకు వచ్చి జయన, బౌద్ధ, చార్వాక మతస్తులను ఖిలపరచి గంగాతీరమందు వున్న బ్రాహ్మణులను యీ దేశానకు రప్పించి 700 అగ్రహారము లిచ్చినారు. అంతే కాక సప్తరుషుల పేర్లు మీదుగా– వశిష్టస్థానంగా వుప్పుటూరు, కశ్యప స్థానంగా మగ్గిపురం, ఆత్రేయ స్థానంగా కారంచేడు, భరద్వాజ స్థానంగా సొలస, గౌతమ స్థానంగా గుంటూరు, జమదగ్ని స్థానంగా ఇనగల్లు ఇచ్చి ఈ కారసాల గ్రామమును విశ్వామిత్రుని స్థానంగా దానం ఇచ్చాడు. ఇక్కడ శ్రీలక్ష్మినారాయణ స్వామి, లక్ష్మినరశింహస్వామి, కేశవస్వామి అనే మూడు విష్ణ్వాలయాలను, శ్రీమల్లేశ్వరస్వామి వారనే లింగమూర్తిని ప్రతిష్టచేసి ఆలయములు కట్టించి, యీ గ్రామానకు ఉత్తరాన చెర్వు తవ్వించినారు.

### యాబుతి గ్రామ కైఫియ్యతు

సత్తెనపల్లి తాలుకాలో కల యాబుతు గ్రామం సమీపంలో పూర్వం బుద్ధ అనే పేరుతో బౌద్దుల బస్తీ ఉండెడిది. ఈశ్వరాంశశంభూతుడయిన ముక్కంటి మహరాజు జయిన, బౌద్ధాచార్యులను నిర్మూలించి దేశం స్వాధీనం చేసుకొని ప్రభుత్వం చేసినపుడు ఆ బస్తీ పాడుపడినది.

### రేటూరు (గుంటూరు) గ్రామ కైఫియ్యతు

ఈ గ్రామానికి ఈశాన్యమందు పూర్వము జయనులు రాజ్యము చేసేటపుడు కొండ్రాజుపాలెం అనే గ్రామం జయిన బస్తిగా ఉండేది. ముక్కంటి రాజ్యకాలమందు కాశీనుంచి వచ్చిన బ్రాహ్మణులకున్ను, జయినులకున్ను సిద్ధాంత వివాదములు

జరిగినపుడు జయినులు హీనవాదులు (ఓడిపోయారు) అగుట వలన ఈ కొం(డ్రాజుపాలెం అనే జయిన బస్తి పాడయిపోయినది.

**అనంతవరం (గుంటూరు) కైఫియ్యతు**

మాధవవర్మ గతించినతరువాత ఈశ్వరానుగ్రహముతో ముక్కంటి జన్మించాడు. ఇతను తపోధన సంపన్నులైన బ్రాహ్మణులను దక్షిణభారతదేశానికి రప్పించి వారికి స్థిరనివాసములు కల్పించాడు. ఇతను జైనులను, బౌద్ధులను, చార్వాకులను నిర్మూలించి ధరణికోటను, వరంగల్‌ను కేంద్రంగా చేసుకొని పరిపాలన సాగించాడు.



చారిత్రికంగా ముక్కంటి/త్రిలోచన పల్లవ రాజుగురించిన సమాచారం పెద్దగా లభించదు. ఆ తరువాత వచ్చిన వివిధ శత్రురాజులు పూర్వరాజుల ఆనవాళ్లను చెరిపేసే పద్దతి ఒకటి సహజంగానే ఉండటం దీనికి కారణం కావొచ్చు. అయినప్పటికీ ఈ మహరాజు గురించి ఈ క్రింది అంశాలను అంగీకరించవచ్చు

- ముక్కంటి/త్రిలోచన పల్లవుడు అయిదో శతాబ్దాంతంలో తెలుగు నేలను ధరణికోటను కేంద్రంగా చేసుకొని పరిపాలించిన ఒక రాజు.
- ఇతను తెలుగునాట ప్రబలంగా ఉండి జైన, బౌద్ధ, చార్వాక మతాలను అణచివేసి, వైదిక హిందూ మతాన్ని ప్రవేశపెట్టటానికి విశేషంగా కృషి చేసాడు. ఉత్తరాదినుంచి బ్రాహ్మణులను పెద్దఎత్తున రప్పించాడు. శైవుడై నప్పటికీ శైవ, వైష్ణవాలను సమాదరించాడు.
- క్రీశ 486 లో ముక్కంటి మహరాజు, చాళుక్యరాజైన విజయాదిత్యుని యుద్ధంలో సంహరించి ఉండొచ్చని ఎన్. వెంకట రమణయ్య అభిప్రాయ పడ్డారు.
- ఈ ముక్కంటి మహరాజు కరికాల చోళుని సమకాలీనుడని చెప్పే ఒక గాథ "పల్లెకులం పుట్టుపూర్వోత్తరాలు" కైఫియ్యతులో కనిపిస్తుంది. ముక్కంటి మహరాజు పాలించిన సమయంలో కరికాల చోళుడు అప్పటి ముక్కంటి రాజ్యాలైన నెల్లూరు,శ్రీశైలం ప్రాంతాలలో అడవులను నరికించి గ్రామాలను ఏర్పరచాడని తమిళ శాసనాలు చెపుతున్నాయి. బహుసా అనంతవరం,

చందవోలు కైఫియత్తులలో చెప్పబడినట్లు ముక్కంటి మహరాజు కరికాల చోళుని చేతిలో ఓడిపోయి అతనికి సామంతుగా వ్యవహరించి ఉండాలి.

ముక్కంటి మహరాజు కావేరినదిపై ఆనకట్టకట్టిన కరికాల చోళుని సమకాలీనుడా కాదా అనే అంశంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఎందు కంటే వీరిద్దరిమధ్యా కనీసం రెండు శతాబ్దాల అంతరం ఉంది. జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసర్చ్ సొసైటి వాల్యూమ్ 4 పే.నం 122 లో బి.వి.కె వ్రాసిన ఒక రివ్యూలో– ముక్కంటిని కరికాలచోళుని సమకాలీనులుగా అంగీకరిస్తే తమిళ సంగం యుగపు తేదీలన్నీ మొత్తం తలక్రిందులవుతాయి, కనుక చరిత్రకారులు అంగీకరించలేరు అంటాడు. చరిత్రకారులకు ఈ అంశం ఒక బండరాయి.

- ఒకప్పుడు దుర్గమారణ్యాలుగా ఉండే తెలుగు ప్రాంతాలలోని అరణ్యాలను తొలగించి వ్యవసాయభూములుగా మార్చినందుకు ఇతనికి కాడువెట్టి (అడవులు నరికిన) ముక్కంటి అనే పేరుకూడా కలదు
- చాలా కైఫియ్యతులలో ముక్కంటి మహరాజు ధరణికోటను రాజధానిగా చేసుకొని పాలించినట్లు ఉంది, కానీ అనంతవరం కైఫియతులో వరంగల్‌ను రాజధానిగా చేసుకొని కూడా పాలించినట్లు ఉండటాన్ని బట్టి ఇతను కృష్ణానదికి దక్షిణం వైపు మాత్రమే కాక దక్కనులో కూడా కాలుమోపాడని అనుకోవాలి.



నేడు మనం చూస్తున్న భారతజాతి భిన్నకాలాలలో వివిధ వలసలతో నిర్మితమైన జాతి. మధ్యధరా కాక్సస్ జాతులు/ఆర్యజాతి భారతదేశంలోకి ప్రవేసించేనాటికే సింధు–హరప్పానాగరికత ఇక్కడ ఉచ్ఛదశలో ఉంది. ఒకప్పుడు సింధు–హరప్పా నాగరికత కొన్ని వందలకిలోమీటర్ల విస్తీర్ణంలో మాత్రమే ఉండేదని అనుకొన్నారు. కానీ ఆనాటి మూలవాసుల నాగరికత దేశవ్యాప్తంగా విస్తరించి ఉందని పురాతత్వ పరిశోధనల మూలంగా నేడు తెలుస్తున్నది.

ఆర్యుల ప్రవేశపెట్టిన వైదికసంస్కృతి కన్నా ముందు ఇక్కడి దేశీయులు అమ్మతల్లుల ఆరాధన, తంత్ర, పశుపతినాథ లాంటి ఆచారాలను ప్రబలంగా పాటించారు. ఆర్యులు తమ నమ్మకాలను వైదికసంస్కృతి పేరిట దేశీయులపై

రుద్దటం ప్రారంభించటంతో అజీవకులు, జైనులు, బౌద్ధులు వారిని వ్యతిరేకించారు. వైదికసంస్కృతికి రాజు ఆదరణ లభించటంతో జైన బౌద్ధ మతాలు నెమ్మదిగా క్షీణించాయి. వైదికసంస్కృతి క్రమక్రమంగా హిందూ మతంగా స్థిరపడింది.

అప్పట్లో ఆంధ్రదేశం జైన బౌద్ధాలకు ఆలవాలంగా ఉండేది. ఉత్తరాది నుంచి హిందూమతం ఆంధ్రాకు విస్తరించే క్రమంలో జరిగిన పరిణామక్రమంలో ఈ ముక్కంటీశ్వరుడు పోషించిన పాత్రను కైఫియ్యత్తులు స్పష్టంగా చెపుతున్నాయి.



## సంప్రదించిన పుస్తకాలు


1. Trilochana pallava and karikala chola by N. Venkata ramanayya
2. History of the Tamils from the earliest times to 600 A.D by Srinivas Iyengar
3. A P Archives Kaifiyats R No 1083__pallikulam kaiphiyat
4. A P Archives Kaifiyats R No% 1426_ చౌడేశ్వరినందవరీకుల సారాంసం
5. A P Archives Kaifiyats R No% 1222_ సంతరావూరు
6. Mackenzie Vol% 001_1963_ కారసాల, యబూతి
7. Journal of The Andhra Historical Research Society,vol.vii,pt.1 To 4
8. ఆంధ్రదేశంలో జైన, బౌద్ధ మతాలు, రచన ప్రొ.బి.ఎస్.ఎల్. హనుమంతరావు, పేజీ 145
9. History of the Reddi kingdoms, M. Somasekhara Sarma

# ఇద్దరు సితాఫ్ ఖాన్ లు

సీతాఫిఖానుడు, సీతాపతి, సీతడు, సీతాపతి రాజు అనే వివిధ పేర్లతో పిలువబడ్డ సితాప్ ఖాన్ గురించి రాజమహేంద్రవరం, బోయినపూడి, కిమ్మూరు కైఫియ్యతులలో వస్తుంది. ఈ కైఫియ్యతులన్నింటిలో సితాప్‌ఖాన్ వృత్తాంతం దాదాపు ఒకే విధంగా ఉంటుంది. కొంత కల్పన, కొన్ని వాస్తవాల కలగలుపు అది.

చరిత్రలో మూడు చోట్ల సితాఫ్ ఖాన్ పేరును స్పష్టంగా పోల్చుకోవచ్చు.

క్రీ.శ.1504 నాటి వరంగల్ శాసనంలోని షితాబు ఖాను. ఇతనే ఖుష్ మహల్ నందు దర్బార్ నిర్వహించేవాడు.

క్రీ.శ.1516 లో శ్రీకృష్ణదేవరాయలను ఎదిరించిన చితాపుఖానుడు

క్రీ.శ.1572 లో ఇబ్రహిమ్ కుతుబ్ షా (మల్కిభరాముడు) కాలంలో, రాజమహేంద్రవరం లో ఓడిపోయి పారిపోయిన సీతాఫిఖానుడు.

పై మూడు సందర్భాల కాలాలను గమనిస్తే మొదటి రెండు చోట్ల కనిపించే సితాఫ్ ఖానుడు ఒకవ్యక్తే కావచ్చుని, రాజమహేంద్రవరంలోని సితాఫ్ ఖాన్ వేరే వ్యక్తి కావచ్చునేది స్పష్టమౌతుంది.

ఎందుకంటే క్రీ.శ.1504 నాటి శాసనంలోని సితాఫ్ ఖాన్‌కు కల భార్యలలో దేవాంబికకు అవధూత ఖాన్, పురాంతక పేర్లతో ఇద్దరు కొడుకులు ఉన్నారు. వీరిలో పురాంతక అనే కొడుకు వివిధ యుద్ధాలలో అనేకమంది వీరులను సంహరించాడట. మరొక భార్య అయిన అనుమాంబకు అమర, బోగి, రామ అనే ముగ్గురు కొడుకులు. వీరిలో పెద్దకొడుకు యుద్ధంలో చనిపోయాడట. ఈ వివరాలను బట్టి వరంగల్ శాసనం వేయించిన సితాఫ్ ఖాన్ వయసు నలభై–

ఏభై ఏళ్ళ మధ్యలో ఉండొచ్చు. క్రీశ.1516 లో కృష్ణదేవరాయలితో యుద్ధం చేసే నాటికి ఇతనికి అరవై ఏళ్ల వయసు ఉండొచ్చు. అది సంభవమే కనుక వరంగల్ శాసనం వేయించిన సితాఫ్ ఖాన్, కృష్ణదేవరాయలతో యుద్ధం చేసిన సీతాఫ్ ఖాన్ ఒకడే అయ్యే అవకాసాలు ఎక్కువ.

ఇక 1572 లో ఇబ్రహిమ్ కుతుబ్ షా సమకాలీనుడిగా చెప్పబడిన రాజమహేంద్రవరం సితాఫ్ ఖాన్ ఖచ్చితంగా మరొక వ్యక్తి అయి ఉండాలి. ఇతను ఎవరనే ప్రశ్నకు సరైన చారిత్రిక సమాధానాలు కనిపించవు. వరంగల్ సితాఫ్ ఖాన్‌ను క్రీశ.1512 లో Quli Qutb-ul-Mulk ఓడించాకా ఇతను ఒరిస్సా పారిపోయి గజపతిరాజుల వద్దకు వెళ్ళితలదాచుకొన్నాడు. గజపతి రాజులవద్ద సేనాధిపతిగా కుదిరి ఉంటాడు. అందుకనే కృష్ణదేవరాయలు గజపతి రాజులపై దండెత్తి వస్తున్నప్పుడు నిలువరించటానికి వీరోచితంగా ప్రయత్నించాడు.

క్రీశ.1572 ల నాటి రాజమహేంద్రవరం సితాఫ్ ఖాన్ వరంగల్ సితాఫ్ ఖాన్ మనవడు అవటానికి అవకాశాలు కనిపిస్తాయి. తాత వలే తనుకూడా గజపతిరాజుల వద్దే కొలువులోఉండి, సేవలందిస్తూ పేరుతెచ్చుకొని రాజమహేంద్రవరానికి అధికారిగా నియమితుడై ఉంటాడు.

## వరంగల్ సితాఫ్ ఖాన్ హిందువా ముస్లిమా?

వరంగల్ శాసనాన్ని బట్టి సితాఫ్ ఖాన్ ను హిందువుగా పరిగణించాలి. ఎందుకంటే ఈ శాసనంలో – ఇతను భోగి (బోయి ?) కులానికి చెందిన వ్యక్తిగా చెప్పబడ్డాడు. ఇతని భార్యలు, పిల్లల పేర్లన్నీ హిందూ నామాలే. ముస్లిములు నాశనం చేసిన కృష్ణుని విగ్రహాన్ని (పాంచాలరాయుడు), కాకతీయుల కులదైవమైన కాకతి విగ్రహాన్ని తిరిగి పునప్రతిష్ట గావించాడని చెప్పబడింది. అంతే కాక శాసనం ఆఖరున ఏకశిలానగరంలో (వరంగల్) ఉన్న శివాలయములో నిత్యం పూజలు చేయటం వలన సితాఫ్‌ఖాన్ కు ఇన్ని సుగుణాలు, ఐశ్వర్యాలు సిద్ధించాయి అని ఉంది.

Shitab Khan of Warangal అనే పుస్తకాన్ని వ్రాసిన Dr.Hirananda Sastri సీతాఫ్ ఖాన్ హిందువని, ఇతను బోయకులానికి చెందినవాడు కావొచ్చునని అన్నారు. దక్కను సుల్తానుల చరిత్రను వ్రాసిన ఫెరిష్టా సితాఫ్ ఖాన్ గురించి “ఖమ్మంమెట్టు రాజు, Fearless infidel (అవిశ్వాసి)” అన్నాడు. 1829లో ఫెరిష్టా

రాతలను ఇంగ్లీషులోకి అనువదించిన Col. Briggs సితాప్‌ఖాను ను హిందువుగా పరిగణించి అతని గురించిన ప్రస్తావనలను అన్నింటిని మూలంలో సితాప్ ఖాను అని ఉన్నప్పటికీ సీతాపతి (Seetaputty) గా అనువదించాడు.

సితాఫ్ ఖాన్ ఒరిస్సాకు చెందిన గజపతిరాజులకు సన్నిహితుడైన హిందువని, ముస్లిం రాజ్యంలో మనుగడకొరకు ముస్లిమ్ పేరు పెట్టుకొన్నాడని అంటారు మరికొందరు చరిత్రకారులు.

సితాఫ్ ఖాన్ హిందు ద్వేషిఅని, చతుర్ముఖేశ్వర, ఇంకా ఇతర ఆలయాలను ధ్వంసం చేసినట్లు ఏకశిలానగర కైఫియ్యతులో ఉన్నది. Glimpses of the Nizam Dominions (1898) లో Campbell, A. Claude వరంగల్‌ను చేజిక్కించుకొన్న "మొదటి ముసల్మాన్" సితాఫ్ ఖాన్ అని పేర్కొన్నాడు.

బహుమని సుల్తానులకు సితాఫ్ ఖాన్ ఒక సామంతుగా ఉంటూ ఆ సామ్రాజ్యం కూలిపోతున్న సమయంలో హిందూ రాజుల ప్రాపకం సంపాదించుకొని వరంగల్, హనుమకొండ ప్రాంతాలకు తానొక స్వతంత్ర రాజుగా ప్రకటించుకొన్న renegade Musalman (ముస్లిం మతభ్రష్టుడు) అని అభిప్రాయపడతాడు col T.W. Haig తన Landmarks of the Deccan అనే పుస్తకంలో.

ఇలా పొంతన లేని ఆధారాల వల్ల సితాఫ్ ఖాన్ హిందువా, ముస్లిమా అన్న ప్రశ్నకు నేటికీ స్పష్టమైన సమాధానం లభించదు.

**కృష్ణదేవరాయలను నిలువరించిన వరంగల్ సితాఫ్ ఖాన్**

కృష్ణదేవరాయలు కళింగదేశంపై దండయాత్ర చేసిన సమయంలో క్రీశ. 1516 లో సితాఫ్ ఖాన్ తన అరవై వేల మంది సైన్యంతో కృష్ణదేవరాయలును నిలువరించటానికి ప్రయత్నించాడనే విషయం "రాయవాచకం"లో ఇలా ఉంది.

//చితాపుఖానుడనేవాడు అరవై వేలు సింగ్గాణి రౌతులతోడట్టు కనుమ మార్గమున పొయ్యే రౌతు రాణువమీద చిత్త వాన గురిసినరీతి అమ్ముల గురియించ్చగా అంమ్ముల నుండ్డి తప్పించుకొనువారున్ను ఆయంమ్ములకు యెదురై నిలిచిన వారున్ను ముంద్దు వెనక తెలియక నిలిచిన వారున్ను ఆడాడ దిగ్భ్రమ పడివున్న వారున్ను యీరీతిని వుండ్డగా చితాపుఖానునికి యెదురులేదు గనక జగడం శేయగా ఆ సమయాన కర్నాటకం కైజీతం రౌతులు చితాపుఖానునికి పెడతల పోటుగా యిరుపార్శ్వాల కనమల పొడువున నెక్కి చితాపు ఖానుని వెనకదిక్కులకై

వచ్చి సింగ్గాణులమతనున్ను, కడ్గముల చేతనున్ను బరిజీల చేతనున్ను వేటారు తునకలుగా నరకగా చితాపుఖానుని తెగలకు కనుమలో నిలువకూడక విరిగి పొరగ వెంబ్బడించ్చి తరుముకబోయి వారిని దుర్గంచొర దోలి తిరుగా వచ్చిరి.// (రాయల సైన్యం అడవిమధ్యలో వెళుతుండగా అకస్మాత్తుగా సితాఫ్ ఖాన్ సైన్యం బాణాల వాన కురిపిస్తే మొదట్లో కంగారు పడ్డ రాయల సైన్యం, కొండలపైకెక్కి సితాఫ్ ఖాన్ సైన్యంపై బాణాలతో, బరెసెలతో దాడిచేసి వారిని తునకలుగా నరికి, సుదూరంగా తరిమివేసిందట)

రాయలను కళింగవైపు రాకుండా అడ్డుకోవటానికి కటకం గజపతి రాజుల ఆదేశాలతో, సితాఫ్ ఖాన్ ఈ దాడి చేసి ఉండొచ్చు. ఈ దాడి తరువాత సితాఫ్ ఖాన్ వివరాలు ఎక్కడా కనిపించకపోవటాన్ని బట్టి రాయల సైన్యం ఎదురుదాడిలో వరంగల్ సితాఫ్ ఖాన్ మరణించి ఉంటాడని భావించవచ్చు.

**రాజమహేంద్రవరం సితాఫ్ ఖాన్**

రాజమండ్రి సీతాభిఖానుడి గురించి లభించే చారిత్రిక సమాచారం ఇది.

కటకంలో సింహాసనం అధిష్టించి పాలిస్తున్న ముకుందదేవు గజపతి మేనల్లుడైన రాజవిద్యాధరుడు, సీతాభిఖానుడు కలిసి రాజమహేంద్రవరాన్ని కేంద్రంగా చేసుకొని ఆ ప్రాంతాన్ని పాలించేవారు.

తెలుగు కవులచే మల్కిభరాముడిగా కీర్తించబడిన గోల్కొండ పాలకుడు ఇబ్రహిమ్ కుతుబ్‌షా ఆదేశంపై, రుస్తుంఖాన్ పదివేలమంది అశ్వదళంతో 1572లో రాజమండ్రిని జయించటానికి వచ్చాడు. అక్కడ ఉన్న సీతాభిఖానుడు రాజపూడి కోటకు పారిపోయాడు. రుస్తుం ఖాన్ రాజపూడి కోటపై దాడి చేయగా, సీతాభిఖానుడు అక్కడనుంచి తప్పించుకొని రాజమండ్రి కోటను చేరుకొని అక్కడ ఉంటున్న విద్యాధరునితో కలసి రుస్తుం ఖాన్ సైన్యం పై ఎదురుదాడి చేయటం మొదలు పెట్టాడు. అలా నాలుగునెలల పాటు యుద్ధం జరిగింది. చివరకు సీతాపతి, విద్యాధరులు, రుస్తుం ఖాన్ తో సంధి కుదుర్చుకొని, విద్యాదరుడు కంశింకోటకు, సీతాపతి బీజానగర్ కు ప్రాణాలు దక్కించుకొని వెళ్ళిపోయారు.

మెకంజీ కైఫియ్యతులలో వర్ణించబడిన సితాఫిఖానుడు

1. అవసరాల పెద్దిరాజు అనే బ్రాహ్మణుడి ఇంట సీతడు అనే ఒక శూద్రదాని కొడుకు దూడలు కాస్తూ ఉండేవాడు. ఒకనాడు సీతడు తాడిచెట్టునీడను

పడుకొని ఉండగా ఒక పెద్ద సర్పము తనపడగను విప్పి అతనిపై ఎండ పడకుండా గొడుగుపట్టటం పెద్దిరాజు చూసి, వీడు ఏనాటికైనా గొప్పవాడు అవుతాడని ఊహించి ఆరోజునుంచి అతనితో దూడలు కాయించటం మాని విద్యలు చెప్పించటం మొదలెట్టాడు.

2. విద్యలు నేర్చుకొన్న సీతడు ఓరుగల్లు వెళ్ళి సైన్యంలో చేరి చురుకుగా పనిచేస్తూ ప్రభువు ఆదరణకు పాత్రుడైనాడు. సీతడు సీతాఫిఖానుడు అనే బిరుదు పొందాడు.
3. కొన్నాళ్ళకు ఓరుగల్లుని తురకలు ఆక్రమించుకోగా, సీతాఫిఖానుడు ఓరుగల్లు విడిచి కటకం చేరాడు. అక్కడి గజపతి ముకుందదేవుని విశ్వాసం చూరగొనటంతో ఆయన సీతాఫిఖానుడికి రాజమహేంద్రవరం సంరక్షణా బాధ్యతలను అప్పగించాడు.
4. సీతాఫిఖానుడు రాజమహేంద్రవరం వచ్చి, తనకు చిన్నతనంలో సహాయం చేసిన అవసరాల పెద్దిరాజును పిలిపించి అతనికి దివానుగిరీ ఇచ్చి రాజమహేంద్రవరాన్ని గజపతిరాజు ప్రతినిధిగా పాలించటం మొదలెట్టాడు.
5. పొరపొచ్చాలు రావటంతో పెద్దిరాజు కనుగుడ్లు పీకించాడు సీతాఫిఖానుడు.
6. గుడ్డివాడైన పెద్దిరాజు గోలకొండకు పోయి అక్కడ విభురాం పాదుషా (ఇబ్రహిమ్ కుతుబ్) గారిని దర్శించుకొని, సీతాఫిఖానుడు తనకు చేసిన అన్యాయాన్ని చెప్పుకొని, తనకు సైనిక మద్దతు ఇచ్చినట్లయితే రాజమహేంద్రవరం కోటను మీ పరం చేస్తాను అని విన్నవించుకొన్నాడు. దీనికి పాదుషా గారు అంగీకరించి, పెద్దిరాజుకి సహాయంగా పటాలాన్ని పంపించాడు.
7. గోల్కొండ నవాబు సేనలు క్రీ.శ. 1572 లో రాజమహేంద్రవరం కోటను ముట్టడించినపుడు సీతాఫిఖానుడు వారి ధాటికి తాళలేక కోట విడిచి పారిపోయాడు.
8. రాజమహేంద్రవరం నుంచి పారిపోయి తోటపిల్లి అడవిలో దాక్కొన్న సీతాఫిఖానుడిని తురకసైన్యం పట్టుకొని తలనరికి చంపేసారు.

మెకంజీ కైఫియ్యతులు మౌఖిక సాంప్రదాయంలో భద్రపరచబడిన చరిత్ర. నిజానికి సితాఫ్‌ఖాన్ కు సంబంధించి మెయిన్ స్ట్రీమ్ చరిత్రే అష్టవంకరలు పోయిన పరిస్థితి ఉంది. అలాంటపుడు కైఫియ్యతులలో నిర్ధిష్టమైన తారీఖులు, పేర్లు ఉంటాయని ఆశించలేం.

పై ఎనిమిది పాయింట్లను గమనిస్తే

మొదటి పాయింటులో కనిపించే పాము పడగ విప్పి నీడపట్టటం అనే కథనం ఒక వ్యక్తి దైవాంశసంభూతుడు అని చెప్పటానికి ఉద్దేశించబడే ఒక మెటాఫర్. ఇది సర్వాయి పాపన్న, ముమ్మిడివరం బాలయోగి లాంటి వ్యక్తుల జీవితచరిత్రలలో కూడా కనిపిస్తుంది. రెండు మూడు పాయింట్లలో ఈ కైఫియ్యతు వ్రాయసగాడు వరంగల్ సీతాఫ్ ఖాన్ , రాజమండ్రి సీతాఫ్ ఖాన్ ల చరిత్రను కలగాబులగం చేసినట్లు అనిపిస్తుంది. అయిదు, ఆరు, ఎనిమిది పాయింట్లలో చెప్పబడిన కథనాలు పూర్తిగా స్థానీయమైనవి.

వరంగల్ సితాఫ్ ఖాన్‌ని హిందువుగా భావించటానికి అవకాసం ఎక్కువగా కనిపిస్తుంది. ఇదే కాలంలో హరిహర, బుక్కరాయలు లాంటి కొంతమంది ఓడిపోయిన హిందూరాజులు ముస్లిములుగా మారి ముస్లిం చక్రవర్తికి సామంతులుగా మారిన సందర్భాలు చరిత్రలో కనిపిస్తాయి. అదే విధంగా వరంగల్ సితాఫ్ ఖాన్ కూడా ముస్లిం రాజ్యంలో మనుగడ కొరకు ముస్లిం పేరు పెట్టుకొని ఉంటాడు. మతం మారినా మారి ఉంటాడు. ఇతని కుటుంబ సభ్యుల పేర్లు హిందూ మతానికి చెందినవై ఉండటం, తాను స్వయంగా ఓడిపోయినపుడు హిందురాజులైన గజపతుల వద్ద ఆశ్రయం పొందటం, కొన్ని హిందూ ఆలయాలను సంరక్షించటం లాంటివి, ఈ ఊహను బలపరుస్తాయి. ఇక రాజమహేంద్రవరం సితాఫ్‌ఖాన్, వరంగల్ సీతాప్‌ఖాన్ మనవడు కావొచ్చునేది సత్యదూరం కాకపోవచ్చు.

### సంప్రదించిన పుస్తకాలు


1. Shitab Khan of Warangal - Dr Hirananda Sastri
2. Andhra Pradesh District Gazetteers: East Godavari
3. Historic Land Marks Of The Deccan by Lt. Col. T. W. Haig
4. The Qutb Shahi Kings of Golconda by S. Hanumanth Rao (Essay)
5. రాయవాచకము– సివి రామచంద్రరావు
6. History of The Rise of the Mahomedan Power In India Vol. 3 by Briggs, John
7. Warangal inscription of Annul Report Of The Archaeological Department of His Highness The Nizams Dominions 1934-35 p.no 33
8. Inscribing the Self: Hindu-Muslim Identities in Pre-Colonial India - Cynthia Talbot

# సర్కారు జిల్లాల నుంచి ఫ్రెంచివారి నిష్క్రమణ

ఫ్రెంచి సేనాని Marquis de Bussy క్రీశ. 1751 లో సలాబద్ జంగుకి సైనిక సహకారం అందించి అతడిని నిజాంరాజుని చేసాడు. దానికి ప్రతిగా సలాబత్ జంగు ఫ్రెంచి సేనల పోషణ నిమిత్తం 1753 లో శ్రీకాకుళం నుండి ఏలూరు వరకూ ఉన్న ఉత్తర సర్కారు ప్రాంతాలను ఫ్రెంచివారికి అప్పగించాడు. అలా సుమారు 470 కిలోమీటర్లు పొడవున్న అత్యంత సారవంతమైన కోస్తా భూములు ఫ్రెంచి వారి పరమయ్యాయి. అప్పట్లో ఇవి రెండులక్షల రూపాయిల పన్ను ఆదాయం కలిగి ఉండేవి. అంతవరకూ ఈ పరగణాలను నిజాం ప్రతినిధిగా ఏలుబడి చేస్తోన్న జాఫర్ అల్లీఖాన్ ఈ ప్రాంతాలను ఫ్రెంచివారికి ఇవ్వటాన్ని ఇష్టపడలేదు. అదే విధంగా విజయనగరం రాజైన విజయరామ గజపతికి కూడా ఈ ప్రాంతాలను ఫ్రెంచివారికి స్వాధీనపరచటం నచ్చలేదు. ఈ విషయం తెలుసుకొన్న ఫ్రెంచి అధికారి Moracin, ఇదివరకు నిజాం ప్రభువుకు చెల్లించిన కౌలు కంటే తక్కువ మొత్తానికే భూములను ఇస్తానని చెప్పటంతో విజయరామరాజు ఫ్రెంచివారి పక్షాన చేరిపోయాడు. ఫ్రెంచి సైన్యం మద్దతుతో క్రీశ. 1757 లో ఈ విజయరామరాజు బొబ్బిలి వంశస్థులను అంతమొందించి తుదకు తాండ్ర పాపారాయుని చేతిలో హతమయ్యాడు.

విజయరామరాజు అనంతరం విజయనగర సంస్థానాధీశునిగా వచ్చిన ఆనందగజపతిరాజు ఫ్రెంచివారి పట్ల విముఖత కలిగి వారిని ఎలాగైనా కోస్తా జిల్లాలనుండి తరిమేయాలనే ఉద్దేశంతో ఇంగ్లీషు వారితో చేతులు కలిపాడు. అదేసమయంలో కలకత్తా నుండి విస్తరిస్తూ వస్తున్న బ్రిటిష్ వారికి ఆనందగజపతి రాజు ఇస్తానన్న మద్దతు వెతుకుతున్నతీగ కాలికి తగిలినట్లయింది.

కోస్తా జిల్లాలనుండి ఫ్రెంచివారిని పారద్రోలటానికి చేసిన యుద్ధాలలో తూర్పుగోదావరి జిల్లాలోని చందుర్తి అనే చోట 1759 డిసెంబరు 9 న ఫ్రెంచి,

ఇంగ్లీషు సేనల మధ్య జరిగిన "చందుర్తి యుద్ధం" నిర్ణయాత్మకమైనదిగా, మొత్తం భారతదేశంలోనే ఫ్రెంచి వారి విస్తరణకు అడ్డుకట్టవేసిన ముఖ్యమైన యుద్ధాలలో ఒకటిగా చరిత్రకారులు భావిస్తారు.

500 మంది యూరోపియన్ సైనికులు, 6000 మంది స్థానిక సిపాయిలు, 500 మంది అశ్వికులతో ఉన్న ఫ్రెంచి సైన్యానికి Conflans నాయకత్వం వహించాడు. కల్నల్ Ford నాయకత్వం వహించిన బ్రిటిష్ సైన్యంలో 470 మంది యూరోపియన్స్, 1900 మంది స్థానిక సిపాయిలు ఇంకా ఆనందరాజు తీసుకొచ్చిన కొంతమంది సైనికులు ఉన్నారు. నిజానికి బలాబలాల్లో ఫ్రెంచివారిదే పై చేయి అయినప్పటికీ కల్నల్ Ford ఎత్తుగడలు Conflans అసమర్థత వల్ల, ఈ యుద్ధంలో ఫ్రెంచి సేనలు పరాజయంపొంది తొలుత రాజమండ్రి, అక్కడనుండి మచిలిపట్నం పారిపోయారు. బ్రిటిష్ సేనలు వెంబడించి వారిని ఓడించి పాండిచేరికి తరిమేసాయి. ఆ విధంగా ఒకప్పుడు శ్రీకాకుళం నుంచి కృష్ణానది వరకూ ఉన్న కోస్తాజిల్లాలలో ఏడేళ్ళపాటు అధికారం చెలాయించిన ఫ్రెంచివారు తమ ఉనికిని పూర్తిగా కోల్పోయారు. కాలక్రమేణా ఫ్రెంచివారు పాండిచేరి ఇంకా పెద్దగా ప్రాధాన్యతలేని ఇతర ప్రాంతాలకు పరిమితమై తమ వ్యాపారాలను చేసుకొన్నారు.

చారిత్రికంగా అంతటి ప్రాముఖ్యత కలిగిన "చందుర్తి యుద్ధం" గురించి కైఫియ్యతులలో పెద్దగా సమాచారం లభించదు. దీనికి కారణం కైఫియ్యతులు రాసే సమయానికి, చందుర్తి యుద్ధఓటమి వలన భారతదేశాన్ని ఫ్రెంచి వలసరాజ్యంగా మార్చగలిగే అవకాశాన్ని ఫ్రాన్స్ చేజార్చుకొన్నదనే సంగతి ఇంకా పూర్తిగా స్పష్టపడలేదని అనుకోవచ్చు.

## చందుర్తి యుద్ధం

చందుర్తి యుద్ధం గురించిన ప్రస్తావన నేరుగా లేకపోయినా తదనంతరం జరిగిన కొన్ని స్థానిక పరిణామాలు సామర్లకోట కైఫియ్యతులో ఇలా ఉన్నాయి. "పూసపాటి ఆనందగజపతి సైన్యముతో వచ్చి చామర్లకోట మీద పోట్లాడగా, మహీపతిరాయనింగారు, నీలాద్రిరాయనింగారు కోటలో ఉండి కాకినాడ జగన్నాధపురంలో మందుగుండు కొని, తీవ్రమైన ప్రతిఘటన ఇచ్చారు. కోటను వశపరచుకొనుట సాధ్యం కాలేదు. తదనంతరం ఆనందగజపతికి నీలాద్రిరాయనింగారికి

మధ్య ఒప్పందము జరిగింది. దీనిప్రకారము; నీలాద్రిరాయనింగారు చామర్లకోట ఖాళీచేసి సైన్యసహాయం అందించిన ఇంగ్లీషువారికి ఇచ్చివేసి అతను పిఠాపురం కోటలో నివాసముండేటట్లు ; జమిందారీ ఆదాయంలో నూటికి అయిదువరహాల వాటా ఇచ్చేటటు ; వెలమలు, ఒంటర్లు ఎక్కడైనా వ్యవసాయం చేసుకొనేందుకు కావలసినన్ని భూములు ఇచ్చి పండినపంటలో సగభాగము ఇచ్చేలాగ ; ఆనంద గజపతి వారి మనుషులు ఈ ప్రాంతములో అధికారము చెలాయించేటట్లు– ఉభయులు అంగీకారానికి వచ్చారు.

*ఆనందగజపతి, నీలాద్రిరాయనింగారు ఇలా ఒప్పందానికి రావటం నచ్చని ఇంగ్లీషువారు గజపతివారిపై అలిగి వెళ్ళిపోయారు. ఆనందగజపతి కంపనీవారిని జగ్గంపేట వద్ద కలిసి ఒప్పించి వారి జండాను చామర్లకోట కోటబురుజుపై ఎగరేయించాడు."*

పై వాక్యాలలో ఎక్కడా చందుర్తి యుద్ధ ప్రస్తావన కానీ, ఫ్రెంచి వారి గురించి కానీ లేదు. ఆ యుద్ధానంతరం జరిగిన కొన్ని సంఘటనలను మాత్రమే ఉన్నాయి. చందుర్తి యుద్ధాన్ని పేజీలకొద్దీ వర్ణించి విశ్లేషించిన A History of military transactions of British Nation in Indostan by Robert Orme, A descriptive and historical account of the Godavery District in the Presidency of Madras by Morris Henry, Records of Fort St. George Publications, History of The French In India by Malleson లాంటి చరిత్ర పుస్తకాలలో పైనచెప్పిన ఒప్పందాలను గురించి ఎక్కడా కనిపించదు. ఎందుకంటే ఇవి పూర్తిగా స్థానీయ విషయాలు. కైఫియ్యతుల లాంటి స్థానిక చరిత్రలలోనే లభిస్తాయి.

కైఫియ్యతు వర్ణనలో ఇంగ్లీషు వారు గజపతివారిపై అలిగి వెళ్ళిపోయారు అన్న వాక్యంలో "అలిగి వెళ్ళిపోవటం" గురించి మెయిన్ స్ట్రీమ్ చరిత్రలో కొన్ని ఆధారాలు లభిస్తాయి.

ఆనందగజపతిరాజు కోస్తా జిల్లాల నుంచి ఫ్రెంచి వారిని వెళ్లగొట్టాలని ఇంగ్లీషు వారితో చేతులుకలిపి ఇరువురూ 1758, నవంబరు 2 న ఒక ఒప్పందం చేసుకొన్నారు. దీనిప్రకారం కల్నల్ ఫోర్డ్, ఆనందగజపతిరాజు కలిసి చేయబోయే యుద్ధంలో –

*కొల్లకొట్టిన సంపదలను చెరిసమానంగా పంచుకోవాలని; యుద్ధం ముగిసాక ఫ్రెంచివారి ఆధీనంలో ఉన్న కోస్తాజిల్లాలపై పన్ను వసూలు అధికారం ఆనంద రాజుకు, ఓడరేవులు ఇంగ్లీషు వారికి దక్కాలని; బ్రిటిష్ సైన్యం ఖర్చుల కొరకు నెలకు రూ. 50,000, సైనికాధికారులకు రూ. 6000 చొప్పున ఆనంద గజపతి* ఇవ్వాలని – అంగీకారానికి వచ్చారు.

చేసుకొన్న ఒప్పందం ప్రకారం ఆనందగజపతిరాజు డబ్బు సక్రమంగా చెల్లించకపోవటంతో కల్నల్ ఫోర్డ్ అసహనంతో ఉండేవాడు. చందుర్తి యుద్ధం ముగిసేనాటికి ఆనందగజపతి రాజు 56,000 రూపాయలు బకాయి పడటమే కాక ఫోర్డ్ నుండి వ్యక్తిగత అవసరాలకొరకు 20,000 రూపాయిలను అప్పుగా తీసుకొన్నాడు కూడా.

చందుర్తియుద్ధం ముగిసికా ఆనందగజపతి సామర్లకోటలోనే ఉండి నీలాద్రి రావుతో ఒప్పందం చేసుకొని తీరిగ్గా రాజమహేంద్రవరం వెళ్ళేసరికి అప్పటికే అక్కడ అంతవరకూ ఫ్రెంచివారి చేతుల్లో ఉన్న రాజమహేంద్రవరపు కోటను బ్రిటిష్ సైన్యం స్వాధీనపరుచుకొని ఉండటంతో ఆశ్చర్యపోతాడు. ఒప్పందం ప్రకారం కోటను తనకు అప్పగించమని అడగగా, బకాయిలు చెల్లిస్తేకాని కోటను ఇచ్చేది లేదంటాడు కల్నల్ ఫోర్డ్.

రాజమండ్రినుంచి ఇంగ్లీషుసేనలు మచిలీపట్నంపై దాడికి బయలుదేరు తున్నప్పుడు కల్నల్ ఫోర్డ్ ఆనందగజపతిరాజును కూడా అతని సైన్యంతో రమ్మన్నప్పుడు ఆనందగజపతిరాజు అంగీకరించడు.

ఈసందర్భంగా వీరిద్దరిమధ్యా ఘర్షణజరిగి ఉంటుంది. ఆనందగజపతి రాజు రాజవొమ్మంగి అడవులలోకిపోయి కొంతకాలం అజ్ఞాతంలో ఉండిపోయాడు.

ఆనందగజపతి రాజు 1758 డిసంబరు 7న మద్రాసులోని బ్రిటిష్ ఉన్నతాధికారులకు వ్రాసిన ఒక లేఖలో "రాజమహేంద్రవరం కోటను స్వాధీన పరచని కారణంగా తాను శిస్తులు వసూలు చేయలేకపోయానని అందువల్ల కంపనీ సైన్యానికి బాకీ పడ్డానని" సంజాయిషీ ఇచ్చుకోవటం ఆసక్తికలిగిస్తుంది.

ఇంగ్లీషు సేనలు ఒంటరిగానే 1759 ఏప్రిల్‌లో మచిలీపట్నాన్ని వశపరచు కొన్నాయి.

అంతిమంగా విజేతగా నిలిచిన ఇంగ్లీషు వారి మద్దతు ముందుముందు అవసరముంటుందని తలచిన నిజాం ప్రభువు సలాబత్ జంగ్ 1759 మే 14 న

ఒక దానపత్రం ద్వారా ఈ కోస్తా జిల్లాలను బ్రిటిష్ వారికి "ఈనాం" గా ఇచ్చాడు. వాటిని "సర్కారు జిల్లాలు" అని పిలిచేవారు. అవి ఇప్పటి విభజన ప్రకారం శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు మరియు ప్రకాశం జిల్లాలు. ఆ దానపత్రంలో అంతవరకూ ఈ ప్రాంతాలలో ఉంటున్న ఫ్రెంచి వారు వారి వారి సరంజామాను సర్దుకొని పదిహేను రోజుల్లో ఖాళీచేసి వెళిపోవాలి కూడా ఉండటం గమనార్హం. అలా కోస్తాజిల్లాలలో ఫ్రెంచివారి భవిష్యత్తు ముగిసిపోయింది.

ఆ విధంగా సామర్లకోట కైఫియ్యతులో కనిపించే "ఇంగ్లీషు వారి అలక" వెనుక ఆర్థిక, రాజకీయ కారణాలెన్నో కనిపిస్తాయి. ఈ ఉదంతంలో ఇంగ్లీషు వారు, ఆనందగజపతిరాజు ఇద్దరిలో ఎవరు ఎవరిని వాడుకొన్నారో ఇతమిద్ధంగా తేల్చలేం. నిజాం ప్రభువు దృష్టిలో ఆనందగజపతి రాజు చాన్నాళ్ళుగా శిస్తులు బకాయి పడటంతో ఒక "రెబల్ జమిందారు"గా చెడ్డపేరు తెచ్చుకొన్నాడు. బ్రిటిష్ వారు నిజాం ప్రభువును ఒప్పించి, పాతబాకీలన్నీ రద్దుచేయించి తిరిగి ఆనంద గజపతి రాజుకే ఈ ప్రాంతాల జమిందారీ ఇప్పించటం కొసమెరుపు.



సామర్లకోట కైఫియ్యతులో ఫ్రెంచి వారి గురించిన ఒక ప్రస్తావన ఇలా ఉంది.

"అవమాన భారంతో కుంగిపోయిన పిఠాపురం జమిందారు నీలాద్రి రాయినింగారు, పెద్దాపురం జమిందారు జగపతిరాజులు ఎలాగైనా పగతీర్చు కోవాలని జట్టుకట్టారు. కాకినాడ జగన్నాధపురం రేవులో ఫ్రెంచివారి ఓడ ఒకటి వచ్చి ఆగింది. వీరిద్దరు ఒక దచ్చివ్యాపారిని మధ్యవర్తిగా పెట్టుకొని– చామర్లకోట నుంచి బ్రిటిష్ వారిని తరిమికొట్టేందుకు ఫ్రెంచివారితో నాలుగులక్షలరూపాయిలకు ఒక ఒప్పందం చేసుకొని లక్షరూపాయిలు బయానాగా ఇచ్చారు. రెండువందల మంది ఫ్రెంచి సైన్యాన్ని ఓడదింపి, చామర్లకోటకు నావలమీద తీసుకొచ్చారు. నీలాద్రిరాయనింగారు మొత్తం వ్యవహారంపై నమ్మకం కుదరక ఊగిసలాడుతుంటే జగపతిరాజు అతడిని ఉత్సాహపరచి, అయిదారువందలమంది సైనికులతో వెంటవేసుకొని, ఆనందగజపతి సైన్యంపై యుద్ధం చేయనారంభించారు. ఆ యుద్ధంలో వత్సవాయి జగపతికి తుపాకిగుండు తగిలి చనిపోయాడు. రావునీలాద్రి రాయనింగారు పారిపోయి జూపల్లెవారి సంస్థానంలో తలదాచుకొన్నాడు. నీలాద్రి

రాయనింగారు పరారీ అయినాడని గ్రహించి, ఆనందగజపతి చామర్లకోటవచ్చి కోటలో తొలగించబడిన ఇంగ్లీషువారి జండాను తిరిగి నిలబెట్టి, అక్కడ కాపలా కాస్తున్న ఫ్రెంచివారిని తరిమేసాడు. వారు తిరిగి కాకినాడ ఓడమీదకు పోయారు".

ఆనందగజపతి రాజుకు మద్దతుగా బ్రిటిష్ వారు నిలవగా, ఫ్రెంచివారికి అండగా రెడ్డి పోలవరం రాజా, మంగపతి దేవు, నూజివీడు అప్పారావు, మొగల్తూరు వెంకట రాజా, పెద్దాపురం జగపతి రాజు, పిఠాపురం నీలాద్రిరావు లాంటి జమీందారులు నిలిచారు. చందుర్తి యుద్ధంలో ఫ్రెంచివారు ఓడిపోయి నిష్క్రమించటంతో ఈ జమిందారులందరూ చెల్లాచెదురైపోయారు. వీరిలో పిఠాపురం జమిందారు నీలాద్రిరావుగారు, పెద్దాపురం జమిందారు జగపతిరాజులు ఈ అవమాన భారాన్ని తట్టుకోలేకపోయారు. వీరికి అప్పటికే ఆనందగజపతిరాజుతో పాత శతృత్వాలు ఉన్నాయి. అతన్ని దెబ్బతీయటానికి వీరిద్దరూ తమ సర్వశక్తులూ కూడదీసుకొని ఒక చివరిప్రయత్నం చేసినట్లు పై ఉదంతం ద్వారా అర్ధమౌతుంది.

దీనికి సంబంధించి ఆధారాలు Robert Orme వ్రాసిన A History of military transactions of British Nation in Indostan అనే పుస్తకంలో కనిపిస్తాయి. గంజాంనుంచి తిరిగి వస్తున్న Moracin అనే ఫ్రెంచి సైనికాధికారిని 1759 డిసెంబరు నెలలో పెద్దాపురం జమిందారైన జగపతిరాజు కలిసి, సైనిక సహాయం కోరగా అతను కొంతమంది ఫ్రెంచి సైనికులను జగపతిరాజుకు తోడు ఇచ్చి పంపించాడు. ఈ సంగతి తెలిసిన ఆనందగజపతి రాజు ఈ తిరుగుబాటును అణచివేయమని తన సైన్యాన్ని సామర్లకోట పంపాడు. అదేసమయంలో మచిలీపట్నం వెళుతున్న బ్రిటిష్ సైన్యం కూడా వీరితో కలిసింది. పెద్దాపురం జమిందారు జగపతి రాజు, పిఠాపురం జమిందారు నీలాద్రిరావులు ఫ్రెంచి సైనికులతో కలిసి ఆనందగజపతిరాజు సైన్యానికి తీవ్రమైన ప్రతిఘటన ఇచ్చారు. ఈ పోరాటంలో మొరాసిన్ పంపిన ఫ్రెంచి సైనికులు తట్టుకోలేక వెనక్కి వచ్చేసారు. జగపతిరాజు చనిపోగా, నీలాద్రిరావు పారిపోయాడు.

Orme కథనానికి కైఫియ్యతు కథనానికి చాలా తేడా కనిపిస్తుంది. జగపతిరాజు మొరాసిన్ కు లక్షరూపాయలు బయానాగా ఇచ్చి సైనిక సహాయం కోరిన సంగతి Orme పుస్తకంలో కనిపించదు. లక్షరూపాయలు తీసుకోవటమనేది ఇక్కడ చాలాకీలకమైన సంగతి. అంతేకాక సామర్లకోట కోటపై ఫ్రెంచి సైనికులను తరిమివేసి తిరిగి అక్కడ ఇంగ్లీషువారి జండాను ఎగరేసిన సంగతి కూడా. అంటే

బహుసా జగపతిరాజు మద్దతుతో ఫ్రెంచి వారు ఈ ప్రాంతంలో తిరిగి ప్రవేశించి అక్కడి బ్రిటిష్ జండాను తొలగించి, తమ సైనికులను కాపలా ఉంచి ఈ ప్రాంతం ఇంకా మా ఆధీనంలోనే ఉంది అని ప్రకటించుకొన్నారని ఊహించుకోవచ్చు. ఇది కోస్తా జిల్లాలలో తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవటానికి ఫ్రెంచివారు చేసిన చివరి విఫలయత్నమని అనుకోవాలి.

**ముగింపు**

ఆనందగజపతిరాజు ఇంగ్లీషు వారిని ఆహ్వానించి సైనిక సహాయం అందించినందుకు నెలకు అరవై వేలు ఇవ్వటానికి ఒప్పందం చేసుకోవటం; అదే విధంగా ఫ్రెంచి వారు సైనిక సహాయం అందించేలా జగపతి రాజు నాలుగు లక్షలకు బేరం కుదుర్చుకోవటం ఆసక్తికరంగా అనిపిస్తాయి. అప్పట్లో యూరోపియన్స్ వద్ద తుపాకులు, ఫిరంగులు ఎక్కువగా ఉండేవి. వాటి సహాయంతో స్థానిక శత్రువులను నిర్మూలించవచ్చుననే దురాశ జమిందార్లలో కనిపిస్తుంది. మొదట్లో యూరోపియన్ల దృష్టి వ్యాపారావసరాలకు ఉపయోగపడే ఓడరేవులపైనే ఉన్నప్పటికీ, కాలక్రమేణా అది సైన్యాన్ని పోషించటం కొరకు భూములను ఈనాములుగా పొందటం వరకూ వెళ్ళింది.

తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించిన మెకంజీ కైఫియ్యతులలో ఎంతో చారిత్రిక ప్రాధాన్యత కలిగిన చందుర్తి యుద్ధ ప్రస్తావన లేకపోవడానికి కారణం బహుసా అప్పటి ప్రజలు ఈ యుద్ధాన్ని ఇంగ్లీషు, ఫ్రెంచి రాజ్యాలమధ్య యుద్ధంగా కాక రెండు సంస్థానాల మధ్య యుద్ధంగా భావించి ఉంటారు. అందుకనే విజయనగర సంస్థానాధీశుడైన ఆనందగజపతిరాజు గురించి, పెద్దాపురం సంస్థానానికి చెందిన జగపతిరాజు గురించిన సమాచారమే ఎక్కువగా ఉంటుంది. ఒక గొప్ప చారిత్రిక ఘట్టం తనని తాను ఆవిష్కరించుకొనేటపుడు ఆ ఘటనలో పాలుపంచుకొనే వ్యక్తులకు  తాము ఓ గొప్ప విషయాన్ని ప్రకటిస్తున్నామని తెలియదు.  కాలం నిర్ణయిస్తుంది.

ఆనందగజపతిరాజుతో చేసిన యుద్ధంలో జగపతిరాజు చనిపోయినపుడు అతని భార్య సతీసహగమనానికి సిద్ధపడింది. ఆ సందర్భంగా ఆనందగజపతి రాజు భార్య ఆమెకు పసుపుకుంకుమలు పంపించిందట. ఆ చర్యకు అవమానపడిన జగపతిరాజు భార్య “మాది కూడా దేశమే ఇక్కడా పసుపుకుంకుమలు లభిస్తాయి,

భవిష్యత్తులో మీ దేశానికీ అవసరపడొచ్చు మీరే ఉంచుకోండి” అని తిరిగి పంపించేసిందట. “నా భర్త మరణానికి కారణమైన ఆనందగజపతిరాజు భార్య కూడా వైధవ్యాన్ని పొందుగాక” అని శాపం ఇచ్చి సతీసహగమనం చేసిందామె. ఈ సంఘటన జరిగి మూడునెలలు తిరక్కుండా 1760లో ఆనందగజపతిరాజు రాజమండ్రిలో మసూచి సోకి చనిపోవటం కాకతాళీయమే.

జగపతిరాజు భార్య శాపం పెట్టటం కైఫియ్యతు అయితే 1760లో ఆనంద గజపతిరాజు చనిపోవటం చరిత్ర. రెండిటినీ విడదీయలేం.



**సంప్రదించిన పుస్తకాలు**


1. A History of military transactions of British Nation in Indostan by Robert Orme
2. History of The French In India by Malleson
3. Andhra between Empires by Dr. Y. Sarada
4. పెద్దాపుర సంస్థాన చరిత్రము, రాయజగపతి వర్మ
5. మెకంజీ కైఫియ్యతులు

# ఇనుప ఎడ్లు

కాలిన్ మెకంజి సేకరణలలో 8076 శాసనాలు ఉన్నట్లు వాటిని కేటలాగ్ చేసిన H H Wilson గుర్తించాడు. వీటిలో ద్రాక్షారామ భీమేశ్వర ఆలయానికి చెందిన 209 శాసనాలు కలవు. పదకొండవ శతాబ్దం నుంచి పదిహేనవ శతాబ్దాంతం వరకూ ఆనాటి రాజులు, అధికారులు, వ్యాపారులు, సామాన్యులు అనేకమంది ఈ ఆలయానికి విశేషమైన దానాలు సమర్పించుకొన్నారు. ఈ దానాలలో భీమేశ్వరుని అఖండ దీపారాధన జరిపించటం కొరకు ఇచ్చిన పశువుల దానాలు అనేకం కలవు.

భీమేశ్వర ఆలయానికి సొంత కిలారము (పశువుల కొట్టాం) ఉండేది. పశువులను సాకటానికి అనేకమంది బోయ వాండ్రు ఉండేవారు. ఆలయానికి దానంగా ఇచ్చిన పశువులను ఈ బోయవాండ్రు మేపుతూ ఆలయ పూజాదికాలకు అవసరమైన దీపారాధనకొరకు నేయి, అభిషేకాలకొరకు పాలను అందించటం వీరి పని. అనేక శాసనాలలో పశువులను ఈ బోయలకు అప్పగించినట్లు ఉంది[1]. ఇక్కడ బోయ అన్నది బహుసా యాదవులయి ఉండవచ్చు. క్రీశ.1259 నాటి ఒక శాసనములో దేవనబోయ అనే పేరుగలిన వ్యక్తి కులనిధి గోపాన్వయుడుగా (యాదవకులస్థుడు) చెప్పబడ్డాడు[2]. బోయ అనే పదం నేటికీ చాలామంది యాదవకులస్థుల ఇంటిపేర్లలో కనిపిస్తుంది.

ఈ రకపు దానములలో "ఇనుప ఎడ్లు" పేరు ఆసక్తికరంగా అనిపిస్తుంది. ఇది ఆలయంలో నిత్య దీపారాధన జరిపించటానికి ఇచ్చిన దానమని, "పాలు ఇచ్చే పశువులు" అనే అర్థంలో "ఇనపఎడ్లు" అనే పదం వాడబడిందని అర్థమౌతుంది. ఎడ్లు కి నైఘంటికార్థం ఎద్దులు, ఆవులు లేక గొర్రెలు (తెలుగు వ్యుత్పత్తి కోశం

1. SII Vol IV - 1156　　2. SII Vol IV - 1370

1978 – ఆంధ్రభారతి). నేడు ఎడ్లు అంటే అంటే ఎద్దులు అనే అర్ధమే జనసామాన్యంలో స్థిరపడింది. “ఇనుప ఎడ్లు” పదం వాడిక నేడు వింతగా అనిపించక మానదు.



ద్రాక్షారామ భీమేశ్వరునికి అఖండదీపారాధన, అభిషేకాల కొరకు సమర్పించుకొన్న వివిధరకాల పశువుల సంఖ్య వివిధ శతాబ్దాలలో ఒక్కో విధంగా ఉంది. 11వ శతాబ్దంలో వేయి పశువులను దానం ఇవ్వగా, ఇది 12వ శతాబ్దంలో ఈ 9470 గాను (వెలనాటి చోళుల పాలన), 13వ శతాబ్దానికి ఇది 1105 గానూ ఉండటం గమనార్హం. 14,15 శతాబ్దాలకు సంబంధించి దానం చేయబడిన పశువుల సంఖ్య 50 మరియు 221 కావటం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆ తరువాతి శతాబ్దాలలో అలాంటి దానాలకు సంబంధించిన వివరాలు లేవు. ఈ మార్పులు ఆనాటి పాలకుల రాజకీయ ప్రాధాన్యతలను లేదా ఒడిదుడుకులను సూచిస్తాయి. ఈ లెక్కలు తగ్గిన Temple Patronage ను ప్రతిబింబిస్తాయి.

ఆలయంలో స్థానికంగా కొంతమంది యాదవులు ఉంటూ భక్తులు ఇచ్చే ఈ పశువుల దానాలను స్వీకరించేవారు. వాటి నిర్వహణా బాధ్యతను మరొకరికి అప్పగించవలసి వచ్చినప్పుడు, స్థానిక యాదవులు హామీ ఇచ్చి ఆ పశువులను బయటవ్యక్తులకు అప్పగించినట్లు కూడా కొన్ని శాసనముల ద్వారా తెలుస్తున్నది.

క్రీశ. 1166 లో చోడమహాదేవి 10 కులోత్తుంగ మాడలతో 50 ఇనుప ఎడ్లను బహుకరించింది. అంటే ఒక మాడ (అర వరహా) అయిదు ఇనుపఎడ్లకు సమాన విలువ అని అర్ధమౌతుంది[3].

ఇనుపఎడ్లు అనే పదం “ఆవు” పదానికి ప్రాకృత రూపం అనుకోవటానికి వీల్లేదు. ఎందుకంటే అదే సమయంలో ఆవులను మొదవులని (మొదవు=పాడియావు) పేర్కొంటూ ఉన్న కొన్ని శాసనాలు కలవు. ఒక శాసనములో[4]– ఒక్కెత్తు గండయ సోదరి అయిన మేడసాని అనే ఆమె ద్రాక్షారామ భీమేశ్వర దేవరకు అఖండ దీపారాధన నిమిత్తము “మొదవులు” (ఆవులు) దానం ఇచ్చినట్లు స్పష్టంగా ఉన్నది.

అదే విధంగా మొదటి కులోత్తుంగుని పాలనాకాలంలో చేసిన ఒక శాసనములో, ఒక మణుగు నెయ్యిని (సుమారు 11 కేజీలు) ఇచ్చేలాగ 35 “సురభిలు” (ఆవులు) దానం ఇచ్చినట్లు తెలుస్తున్నది[5].

---

3. SII Vol IV - 1052 4. SII Vol IV - 1158 5. SII Vol IV - 1288



1158 నంబరు

శాసనాలలో చెప్పిన ఇనుపఎడ్లను నిఘంటువులో చెప్పిన విధంగా గొర్రెలు అనుకోవటానికి కూడా వీలుచిక్కదు, ఎందుకంటే కొన్ని శాసనాలలో గొర్రెలను "గొరియలని" పేర్కొనటం జరిగింది. క్రీశ 1038 నాటి శాసనములో క్షేత్రపాలకుని సంధ్యదివ్వెల కొరకు ఒక మానిక (సుమారు లీటరు) నెయ్యి ఇచ్చేలాగ 50 గొఱియలు, అర మానిక నెయ్యి ఇచ్చేలాగ 25 గొఱియలు దానంగా ఇవ్వబడ్డాయి[6].

క్రీశ. 1084 లో వేసిన ఒక శాసనములో ఆలయములో ఉన్న కులోత్తుంగ సత్రమునకు ముప్పది పుట్ల భూమి (60 ఎకరములు) దానముతో పాటు 300 యెడ్లను కూడా దానం ఇచ్చినట్లు ఉంది[7]. 300 ఎడ్లు అంటే చాలా పెద్ద సంఖ్య. ఇది అరవై ఎకరముల పంట భూమితో పాటు ఇస్తున్న దానం కనుక ఆ భూమిని సాగుచేయటానికి అవసరపడే ఎద్దులు అని భావించారి. ఆ నేలను సాగుచేయగా వచ్చిన ఫలధాన్యాలను సత్రంలో భోజనాదులకు వినియోగించి ఉండవచ్చు. దీనిని బట్టి "ఎడ్లు" అనే పదం వాడిక నేటిలాగే అప్పట్లోకూడా ఉందనే అనుకోవచ్చు.

---

28 మార్చ్, 2018 ఆంధ్రభూమి పత్రికలో "తెలుగు భాషకిదో ప్రాకృతిక బాంధవ్యం" అనే వ్యాసంలో శ్రీచీమకుర్తి శేషగిరి రావు "ఇనపఎడ్లు" అన్న పదానికి దేవర ఆంబోతులు/దేవరెద్దులు అన్న అర్థం చెప్పారు. కానీ ఈ పదానికి ఆ అర్థం అనుకూలించదు. ఎందుకంటే......

ఇనుపఎడ్ల సంఖ్య దాదాపు అన్ని శాసనాలలోను 25 నుంచి 50 వరకూ ఉండటాన్ని గమనించవచ్చు. ఇనుప ఎడ్లకు "దేవర ఆంబోతు" అన్న అర్థం తీసుకొన్నప్పుడు అంత పెద్ద సంఖ్యలలో ఆంబోతులను దానం చేయటం జరగదు. అప్పట్లో వ్యవసాయానికి ఎద్దుల అవసరం ఎక్కువ. కనుక ఊరికి రెండో మూడో దేవర ఆంబోతులును అంకితమిచ్చే అవకాశం ఉంటుంది తప్ప ఇంత భారీ సంఖ్యలలో ఆంబోతులను ఇవ్వటానికి వీలుపడకపోవచ్చు.

అనేక శాసనాలలో భీమేశ్వరుని "దీపారాధన" కొరకు ఇనుపఎడ్లను దానం చేస్తున్నట్లు స్పష్టంగా ఉంది. రెండవ గొంకరాజు వద్ద ప్రధాని, సమస్త సేనాధిపతిగా

6. SII Vol IV - 1014 7. SII Vol IV - 1015

పనిచేసిన వాసనపెగ్గడ కూతురు గుండమ భీమేశ్వరునికి "అఖండదీప నిర్వహణ" కొరకు 50 ఇనపఎడ్లను దానం ఇచ్చినట్లు ఆమె వేయించిన శాసనంలో స్పష్టంగా ఉంది[8]. ఈ అవసరం దృష్ట్యా ఇనుపఎడ్లు అన్న పదానికి ఆంబోతులు అనే అర్థం పొసగదు.

**ఇనుప ఎడ్లు అంటే గేదెలా లేక మేకలా?**

ఈ శాసనాలను పరిశీలించగా ఎద్దులు, ఆవులు, గొర్రెలు లాంటి పశువులను సూచించటానికి అప్పటికే స్పష్టమైన పదాలు ఉండినట్లు అర్థమౌతుంది.

ఇనుప ఎడ్లు అన్నపదానికి అర్థం ఆంబోతులు, ఎద్దులు, ఆవులు, గొర్రెలు కాదు అనుకొంటే పాలు ఇచ్చేపశువులలో బర్రెలు, మేకలు మిగులుతాయి. ఇనుపఎడ్లు శబ్దానికి ఇంతవరకూ వివిధ ప్రముఖులు ఇచ్చిన అభిప్రాయాలు ఇలా ఉన్నాయి.

ఆంధ్రశబ్దరత్నాకరములో "ఈన్పయెడ్లు" అనే పదానికి ఆడుమేకలు అనే అర్థం ఉన్నది. "ఈన్ప" ఈనుప అనే పదానికి హ్రస్వరూపమనుకొంటే దానికి "ఈనగలిగే" అనే అర్థం చెప్పుకొనవచ్చును. ఈ వ్యుత్పత్తి ప్రకారం ఇనుపఎడ్లు అంటే మేకలు అని చెప్పబడ్డాయి

ఇనుపఎడ్లు అంటే నల్లని పశువులు. ఇనుము నల్లగా ఉంటుంది కనుక ఆ పేరు అలా వచ్చిందని శ్రీ బులుసు వెంకట రమణయ్య 1937 జూలై, భారతి పత్రికలో వ్రాసిన ఒక వ్యాసంలో అభిప్రాయపడ్డారు.

శ్రీ ఈశ్వరదత్తు సంకలనపరచిన "శాసన శబ్దకోశము"లో ఇనుపఎడ్లు అంటే మేకలు, గొర్రెలు అనే అర్థం ఇచ్చారు (పే. 77)

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో వచ్చిన "పదబంధ పారిజాతము" అనే నిఘంటువులో 158 పేజీలో "ఇనుపయెడ్లు- ఎనుములు, గేదెలు, దున్నలు శాసనపరిభాష. ఎనపగొడ్లు అని రాయలసీమలో నేటివాడుక" అని ఉన్నది.

తెలుగులో ఎనుములు అంటే గేదెలు. ఎనుము రూపాంతరమే ఇనుప ఎడ్లు అనే పదం. ఆవిధంగా ఇనుపఎడ్లు అంటే గేదెలు అని శ్రీ బూదిరాజు రాధాకృష్ణ "ప్రాచీనాంధ్ర శాసనములు" పుస్తకంలో అన్నారు (పే. 231).

---

8. SII Vol IV - 1089

ఈ క్రింది శాసనముల జాగ్రత్తగా పరిశీలించినపుడు ఇనప ఎడ్లుగా చెప్పబడినవి గేదెలా లేక మేకలా అనే అంశాన్ని నిర్ణయించవచ్చును.

1068 నంబరు కల శాసనములో 5 ఆలయ దీపాల నిర్వహణకు 250 "ఇనుపఎడ్లు" ఇవ్వబడినట్లు ఉంది.

1158 నంబరు కల శాసనములో 2 ఆలయ దీపాల నిర్వహణ కొరకు ఒక్కింటికి 50 "ఆవుల" చొప్పున దానం చేసినట్లు ఉన్నది.

పై రెండు శాసనములను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ఒక అఖండదీపమును ఏర్పాటు చేయటానికి 50 ఆవులు కానీ 50 ఇనుపఎడ్లు కానీ అవసరపడుతున్నట్లు అవగతమౌతుంది. ఆవులతో సమానంగా పాలు ఇచ్చే పశువులు గేదెలు అవుతాయి తప్ప మేకలు అయ్యే అవకాసం లేదు. ఆ లెక్కన "ఇనుపఎడ్లు" అనే పదం "ప్రాచీనాంధ్ర శాసనములు", "పదబంధ పారిజాతము" పుస్తకములలో చెప్పినట్లు ఎనుములు లేదా గేదెలు అన్న అర్థంలోనే వాడబడిందని నిర్ధారణ చేయవచ్చును.

**ఉపసంహారం**

నేటి సమాజంలో దేవునిపూజకు ఆవుపాలు, ఆవునెయ్యి తప్ప ఇతరజీవుల ఉత్పత్తులను వినియోగించరు. అలాచేయటం అపవిత్ర చర్యగా కూడా భావిస్తారు. కానీ సుమారు వెయ్యేళ్ల క్రితం గేదెల, గొర్రెల ఉత్పత్తులను దేవతార్చనకు వాడటం పట్ల ఏ రకమైన అభ్యంతరం లేదని పై శాసనాల ద్వారా తెలుస్తుంది.

సమకాలీనంగా ఆవుకు ఎనలేని పవిత్రత ఆపాదించటం జరిగింది. గోమూత్రం ఒక సర్వరోగనివారిణిలాగ ప్రచారించటం కూడా చూస్తున్నాం. వెయ్యేళ్ళ క్రితంనాటి సమాజం గోవును ఇతరపశువులతో సమానంగా చూసింది తప్ప ఏ రకమైన ప్రత్యేకతను ఇచ్చినట్లు ద్రాక్షారామ ఆలయ శాసనాలలో కనిపించదు. బౌద్ధ జైనాల వైపు మళ్లిన ప్రజలను వెనక్కి లాక్కోవటానికి వైదిక ధర్మం అహింసను విడనాడి, సాత్వికమైంది. ఈ క్రమంలో గోవుకు పవిత్రత వచ్చిచేరింది. పన్నెండో శతాబ్దంలో మూడవ కులోత్తుంగచోళుడు తొలిసారిగా ఆలయాలలో గోశాలలు నిర్మాణం చేసినట్లు తెలుస్తుంది.

వైదిక క్రతువులలో సాగించిన గోవధ [9] నుండి క్రమక్రమంగా దేవతలకు బర్రెలను, గొర్రెలను బలులుగా ఇవ్వటం వరకూ హిందూ సమాజం సాగించిన ప్రయాణంలో ఎన్నో ఎత్తుపల్లాలు కనిపిస్తాయి. ఒకప్పుడు ఆవులతో సమాన హెూదా కలిగిన బర్రెలు, గొర్రెలు కాలక్రమేణా పవిత్రతను పొందలేకపోవటమే హిందూదేశ చరిత్ర.



9. The Myth of Holy cow, by D.N. Jha p.n 30

# గుడిసాని వ్యవస్థ

ఆరవ శతాబ్దం నుంచి పదిహేనో శతాబ్దం వరకూ ఆంధ్రప్రాంతంలో గుడిసానుల వ్యవస్థ ఉండేది. ఈ సాని అనే పదం స్వామిని అనే పదం నుంచి వచ్చింది. గుడిలో ఉంటూ నాట్యము, సంగీతము లాంటి కళలను ప్రదర్శించే స్త్రీలను సానులు, సాని సంప్రదాయమువారు, గుడిసానులు అని పిలిచేవారు. వంశపారంపర్యంగా నాట్యవృత్తిని కొనసాగిస్తున్న వారిని సాని సంప్రదాయము వారు అంటారు.

వీరు చిన్నతనం నుంచి సంగీత నాట్య విద్యలను నేర్చుకొని దేవుని సేవకు, ఆలయంలో ఇతర కైంకర్య పనులకు భక్తితో అంకితమైనవారు. ఆలయములలో జరిగే అంగరంగ భోగములను గుడిసానులే జరిపించేవారు. (అంగభోగము అంటే దేవతా విగ్రహములకు చేసే అలంకారాలు నివేదనలు. రంగభోగము అంటే గుడిని శుభ్రపరచి ముగ్గులతో అలంకరించటం). నాట్యము, గానము షోడశోపచారాలలో[1] భాగం కనుక ఆ ఉపచారాలకొరకు గుడిసానుల వ్యవస్థ ఆవిర్భవించింది.

మధ్యయుగ ఆంధ్రలో సంగీతం, నృత్యంలాంటి కళలు వర్ధిల్లాయి. కూచిపూడి కన్నా పురాతనమైన విలాసినీ నృత్యప్రక్రియ ఆంధ్రప్రాంతానికి చెందిందే. చందవోలుకు చెందిన జాయపసేనాని వ్రాసిన గీతరత్నావళి, నృత్య రత్నావళి, వాయిద్యరత్నావలి గ్రంధాలు సంగీత, నృత్య, వాయిద్యపరికరాలకు చెందిన శాస్త్రాలలో ప్రామాణికమైన రచనలు. భారతీయసంగీతానికి ఆంధ్రులు ఆంధ్రిరాగాన్ని అందించారు. తెలుగువాగ్గేయకారులు లేని దక్షిణభారత సంగీతం లేదు. ఈ కళలను శతాబ్దాలపాటు గుడిసాని వ్యవస్థ పెంచి పోషించింది. బాపట్ల, తెనాలి, నర్సారావుపేట, వినుగొండ, గుంటూరు, కావలి, భీమవరం, పాలకొల్లు,

---

1. The kakatiyas and their times, by PV Parabrahma Sastry p. 423-424.

,

శ్రీముఖం, సింహాచలం లాంటిచోట్ల ఉన్న ఆలయాలలో గుడిసానుల వ్యవస్థ ఉండేదని అక్కడ లభించే శాసనాలలో విరివిగా చెప్పబడింది[2] .

## 1. గుడిసానులు వ్యభిచారులు కాదు.

అప్పట్లో వేశ్యావృత్తి వ్యవస్థాగతమైన వేరే పరిశ్రమ. వేశ్యావృత్తిని సాగించే స్త్రీలను వేశ్య, వారాంగన, వెలయాలు లంజియ అనే పేర్లతో వ్యవహరించేవారు. ఈ వృత్తిని చేపట్టిన స్త్రీలు ఊరిలో వేశ్యావాటికల పేరుతో కేటాయించబడిన ప్రాంతాలలో ఉండేవారు. వేశ్యావృత్తిలో ఉన్న వారాంగన నెలలో రెండు రోజుల ఆదాయాన్ని పన్నుగా కట్టేది. శ్రీకృష్ణదేవరాయల కాలంలో రాజ్యాదాయంలో వేశ్యలు కట్టే పన్నులు పెద్దమొత్తమే.

హనుమకొండలోని వేయిస్తంభాల గుడి శాసనాలలో ఓరుగల్లులో ఉన్న అలాంటి వేశ్యావాటిక వర్ణన కలదు. ప్రతాపరుద్రచరిత్రలో ఓరుగల్లులోని వేశ్యావాటిక వర్ణన కలదు[3]. వేములవాడ భీమకవి వ్రాసిన ఒక చాటువులో ద్రాక్షారామంలోని వారాంగనల వర్ణన కనిపిస్తుంది. ద్రాక్షారామ వారకాంతల నృత్యాలను రంభకూడా వీక్షించాలట.

ఈక్షితికి వచ్చి వేగమ
ద్రాక్షారామమున వార తరుణులనృత్యం
బీక్షించి యంతకంటెను
దక్షణమున నేర్చి రంభతగ వేర్పడగన్

శ్రీనాధుడు భీమేశ్వర పురాణంలో ద్రాక్షారామంలోని వారాంగనల సౌందర్యాన్ని వర్ణించటానికి మన్మధునికి కూడా సాధ్యపడదని అంటాడు[4] .

అదే శ్రీనాథుడు భీమేశ్వర ఆలయంలోని గుడిసానులను వర్ణించేటపుడు శృంగారరసం కాక భక్తిరసం పలికించాడు

---

2. JAHRS, vol. 27
3. కాకతీయ శాసన సాహిత్యము, పి.వి. పరబ్రహ్మశాస్త్రి
4. దక్షారామ విలాసినీ వతుల సౌందర్యంబు వర్ణింపగా/జక్షుఃశ్రోత్ర కులాది నాయకునకున్ శక్యంబే

"వారంతా తమ అందంతో, చామరసేవలతో, అపురూపమైన నాట్య కౌశలంతో, గానమాధుర్యంతో ప్రతిసంధ్యలో, భోగసమయములలో భీమేశ్వరునిని రంజింపచేస్తున్నారని వర్ణిస్తాడు[6]" .

మరోచోట – "చక్కని వెన్నెల కాయగా దక్షవాటికా వేదికల మీద కూర్చుండి బంగారు వీణలు మీటుతూ అప్సరసలు తీయనిమత్తుతో, మోదంతో, మిక్కిలి నేర్పుతో శివుని మీది పాటలు భువన మోహన విగ్రహుడైన బీమనాథుని గూర్చి పాడారు" అంటాడు శ్రీనాథుడు గొప్ప మైమరపుతో".(5-103)



అప్పట్లో రాజవంశ కన్యలు,కులీనవర్గాల స్త్రీలు స్వచ్ఛందంగా వచ్చి ఆలయ సేవకు అంకితమయ్యేవారు.

క్రీశ.1047లో కుందరాజ తన సోదరి బిక్కబ్బరసిని మల్లేశ్వరునికి అంకితమిచ్చాడు.

క్రీశ.1271 లో మంకిశెట్టి అనే వ్యక్తి తన ఇద్దరు మనుమరాంఢ్రను ఏలేశ్వరుని ముందు నాట్యం చేసే సానులుగా అంకితమిచ్చాడు.

అప్పటి సమాజంలోని రాజులు, ధనవంతులు తాము ఇష్టపడిన ఈ గుడిసానులను వివాహమాడటం కూడా జరిగేది. వెలనాటి గొంక III చందవోలు పాందీశ్వరాలయానికి చెందిన కామిదేవి అనే గుడిసానిని వివాహమాడాడు.

క్రీశ.1225 లో వీరశేఖర వర్మ అనే వేనాడు రాజు ఉన్నికాల్తం అనే గుడిసానిని వివాహమాడాడు.

శ్రీకాకుళంలోని ముఖలింగేశ్వర ఆలయంలో క్రీశ.1126 లో వేయించిన ఒక శాసనంలో పసాయిత పేరుకల గుడిసాని కొమ్మినాయకుని భార్యగా చెప్పబడింది[7].

---

6. ఈ సానులు నీశానుని భీమేశ్వరుని... చామర వ్యజన వీటికా కరండ పాదుకా ముకుర దీపికా సంగీత నాట్యాద్యుపచార విశేషంబుల బ్రతి సంధ్యంబును బల్యంకికాసేవ బహిర్విజయాది బోగావసర సమయంబుల సేవించుచుందురు – భీమేశ్వర పురాణం.

7. South Indian Inscriptions vol 5 No. 1102 "ఎఱకమ్మకూంతుఱు గుడిసాని పసాయిత కొమ్మినాయకుని పెణ్ణము శ్రీ మధుకీశ్వరదేవరకు అఖండదీపమును బెట్టినది".

పాందీశ్వర ఆలయానికి చెందిన సొక్కమ, బయ్యాంబిక పేర్లు గల గుడిసానిలకు పుట్టిన కొడుకులు గొంక II వద్ద ఉన్నతపదవులలో పనిచేసారు.

గుడిసాని, వారాంగన వ్యవస్థలు వేరువేరుగా ఉండేవి. గుడిసానుల వ్యవస్థలోని స్త్రీలు సంగీతం, నృత్యం, సాహిత్యం వంటి కళలను అభ్యసించి, ప్రావీణ్యం పొంది తమ సేవలను దేవుని ఎదుటమాత్రమే ప్రదర్శించేవారు. వారాంగన వ్యవస్థ భోగార్థమై ఏర్పాటుచేసుకొన్నది

**2. గుడిసానులు ఆలయ ఉద్యోగులు**

దేవునికి నృత్య, గాన సేవలు అందించినందుకు గుడిసానులకు ఆలయ ఆదాయంలోంచి కొంత ద్రవ్యం జీతంగా ఇచ్చేవారు. కొన్ని సందర్భాలలో భక్తులు తమతరపున దేవునికి నృత్య, సంగీత ఉపచారాలను జరిపించమని గుడిసానులను నియమించేవారు. గుడిసానులు ఆలయంలో ఏ పనులు చేసేవారో కొన్ని శాసనాలలో చెప్పబడింది.

గుంటూరు జిల్లా కొప్పరం ఊరిలోని కోదండరామస్వామి ఆలయంలో క్రీశ 1114 లో వేసిన ఒక శాసనముద్వారా ఆలయం గుడిసానులు చేసే పన్నెండు విధులను గుర్తించవచ్చు[8].

అవి వరుసగా నర్తకాచార్య (నట్టువాంగి), నర్తకి, నటీమణి (పాత్ర),గాయని, వేణువు, మృదంగము, మద్దెలు, శంఖము, నాదస్వరం ఊదు సానులు, వింజామర వీచే సాని, పరిచారిక. ఇవన్నీ నాట్యము, సంగీతములకు సంబంధించిన విద్యలు.

శ్రీకూర్మంలో క్రీశ. 1249నాటి ఒక శాసనములో[9] గుడిసానులకు ఇచ్చే జీతభత్యాల వివరాలు ఇలా ఉన్నాయి

ముప్పైమంది సానులకు ఒక్కింటికి – ఏడాదికి 42 పుట్ల ధాన్యం (ఒకపుట్టి ఇరవై కుంచాలు) ప్రతిరోజు రెండు తాంబూలాలు, మూడు అప్పాలు

నాట్యం నేర్పే సానికి – ఏడాదికి నాలుగు మాడల ఎనిమిది చిన్నాలు, నిత్యం నాలుగు కుంచాల భోజనం[10] (నిత్యనాలువు కుంచ్చాలు కూడు), రోజు ఒక తాంబూలం, నెలకు నాలుగు అప్పాలు.

---

8. SII Vol X ins no 74, pno 32
9. South Indian Inscriptions vol 5 No. 1188
10. కుంచం అంటే నాలుగు కేజీలు అని వాడిక. ఆ అర్థం ఇక్కడ పొసగదు. మరేదైనా కొలత కావొచ్చును.

వాద్యకారిణికి – ఏడాదికి మూడు మాడలు, నిత్యం రెండున్నర కుంచాల భోజనం, రోజూ ఒక తాంబూలం, నెలకు నాలుగు అప్పాలు

మృదంగ, శంఖం, బాకా వాయించే సానులకు ఒక్కొక్కరికి రోజుకు రెండుకుంచాల భోజనం, అర తాంబూలం. (?)

పైనచెప్పినవి వస్తురూపంలో కానీ సమానమైన ధనం రూపంలో కానీ ఆ సానులు పొందవచ్చు.

ఇదే ఆలయంలో ఉన్న క్రీశ.1348లో నరనారసింహదేవుని భార్యలైన గంగాదేవి, సీతాదేవిలు శ్రీకూర్మనాథదేవర సేవలకొరకు ఒక నాట్యమునేర్పే స్త్రీని, ఇద్దరు నర్తకిలను నియమించి– నాట్యమునేర్పే తలాసానికి రోజూ భోజనము, ఒక అప్పము, ఒక తాంబూలము, జీతము 1 గండమాడ; నాట్యం చేసే శూరాసాని, బాశాసానిలకు నిత్యభోజనము, ఒక అప్పము, ఒక తాంబూలము, అర గండమాడ చొప్పున జీతములు ఇచ్చేందుకు 30 బంగారుమాడలు ఆలయ భాంఢాగారమందు పెట్టినట్లు ఆ శాసనము[11] ద్వారా తెలుస్తున్నది.

### 3. గుడిసానులు గౌరవ పాత్రులు

పదమూడవ శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని సందర్శించిన మార్కో పోలో– గుడిసానిలు ప్రతీరోజు దేవునికి ప్రసాదాలు సమర్పించి ఆలయంలో నృత్యం చేస్తూ సంకీర్తనలు ఆలపిస్తారని వీరి గురించి ప్రస్తావించాడు.

మధ్యయుగాలలో ఈ గుడిసాని వ్యవస్థ కళలను పోషించింది. పవిత్రంగా ఉంది. స్వామినులుగా గుడిసానులు సమాజంలో గౌరవం పొందారు. వివాహాలు చేసుకొన్నారు. పిల్లల్ని కన్నారు. వాళ్ళూ కూడా రాజోద్యోగులుగా మన్ననలు పొందారు. గుడిసానులు ఆలయానికి ఇచ్చిన వివిధ దానాలు అమలు అయ్యేలా చూసే అధికారం కలిగి ఉండేవారు.

కొన్ని శాసనాలలో కనిపించే జ్ఞానసాని, సూరసాని, దొడ్డసాని లాంటి పేర్లలో ఆయా వివాహితుల పేర్లకు చివర సాని అనే పదం ఉండటం గమనించవచ్చు.

---

11. South Indian Inscriptions vol 5 No. 1225

వేమారెడ్డి తన తండ్రి కాటమరెడ్డి, తల్లి దొడ్డ"సాని" అమ్మకు శుభం జరగాలని పిఠాపురం కుంతీమాధవ ఆలయంలో క్రీశ. 1391 లో ఒక మండపము కట్టించినట్లు ఆలయ స్తంభంపై శాసనము కలదు. ఈ దొడ్డసాని రాజమాత.

1450 ప్రమోదూతనామసంవత్సరం శ్రావణమాసంలో శ్రీకుమారారామ భీమేశ్వర ఆలయంలో దక్షిణపు దిక్కున ఒక భక్తుడు తన తల్లి అన్నయసాని, తండ్రి భీమాభక్తుని పేరిట ఒక గుడి కట్టించి అనభీమలింగమును ప్రతిష్ట చేసాడు.

1424 క్రోధినామ సంవత్సరం, కార్తీకమాసమందు వేమారెడ్డి సేవకుడైన భక్తుని కూనయనెనిం తమ తల్లి మనుమసానికి పుణ్యముగాను తిరువళికంభము (దీపస్తంభము) నిర్మించి తిరువళికి చమురుకొరకు తొంభై గోవులను, స్వామివారికి పట్టువస్త్రాలను, కొంతభూమిని, నలభైఒక్క టంకాలను సమర్పణ చేసి ఆ విషయాన్ని దక్షిణ గోడకు శాసనము వ్రాయించాడు.

భక్తులు తమ తరపున దేవునికి సేవలు చేస్తున్నందుకు గుడిసానులకు ప్రత్యేకంగా బహుమతులు ఇచ్చేవారు. ఆంధ్రదేశంలో వివిధ ఆలయాలలో దేవదేవునికి చామరకొలువు, అంగ రంగ భోగములు నిర్వహించటానికి సానులకు ఇచ్చిన దాన శాసనాలు మొత్తం 74 కలవు. తూర్పుగోదావరి జిల్లాకు చెందిన సామర్లకోట కుమారారామభీమేశ్వరుని, పలివెల కొప్పేశ్వరస్వామి ఆలయాలలో అలాంటి శాసనాలు కనిపిస్తాయి కానీ ద్రాక్షారామ భీమేశ్వర ఆలయంలో ఒక్కటీ కనిపించకపోవటం ఆశ్చర్యకరం. గుడిసానుల ఆదాయం గణనీయంగా ఉండటంచే వీరుకూడా ఇతర భక్తులలా దేవుడికి అనేక మాన్యాలు, దానాలు సమర్పించుకొన్నట్లు వివిధ శాసనాలలో కన్పిస్తుంది.

క్రీశ. 1263 లో ద్రాక్షారామ భీమేశ్వరునికి వాససాని అనే మున్నూరుసాని ఒక గ్రామాన్ని దానం చేసింది. అదే విధంగా చందోలు, పాందీశ్వర గుడిసాని అయిన బానమామ్మ ద్రాక్షారామ భీమేశ్వరునికి దానాలు ఇచ్చింది. క్రీశ. 1229 లో గుడిసాని కూతురు సంకరమ భీమేశ్వరునికి కనకదండ వింజామర, 25 వరహాలు సమర్పించుకొన్నది[12].

తిరుపతి ఆలయంలో తిరువెంకట మానిక్కం అనే గుడిసాని పల్లకిపై రావటానికి అత్యుతరాయలు అనుమతినిచ్చాడు.

---

12. SII Vol IV - 1372

అచ్యుతరాయని కాలంలో తిరుమల గుడిసాని కుప్పసాని విశేషమైన పాండిత్యప్రతిభ కనబరచి “విద్వత్సభారాయరంజక” అనే బిరుదును పొందింది. తిరుపతి గుడి శాసనాలలో లింగసాని, హనుమసాని, తిప్పసాని, నాగసాని అనే వివిధ గుడిసానుల పేర్లు కనిపిస్తాయి.

## 4. కోల్పోయిన ప్రాభవం

పదోశతాబ్దపు గుడిసానులు భారతీయ నృత్య,గాన కళలను వారసత్వ సంపదగా కొనసాగించారు. పంతొమ్మిదో శతాబ్దానికి వచ్చేసరికి గుడిసానులంటే వ్యభిచారులనే ముద్రపడటానికి మారిన పాలకుల వైఖరి కారణం.

పదిహేనోశతాబ్దంనుంచి భారతదేశం అనేక రాజకీయ, ఆర్థిక మార్పులుకు లోనైంది. రాజ్యం వివిధ చేతులు మారింది. అంతవరకూ రాజులు, సామంతులు ఆలయాలను పోషించారు. ఆలయాలకు విపరీతంగా భూములు, డబ్బులు దానాలుగా వచ్చేవి. ఆనాటి సమాజంలో అంత్యజులుగా చెప్పబడే వారితో సహా అన్నివర్ణాలవారికి ఆలయంలో కొద్దోగొప్పో ఉపాధి దొరికేది. చుట్టూ అంగళ్లలో వ్యాపారాలు జరిగేవి. పండుగలూ, పర్వదినాల పేరుతో ఎంతచెట్టుకు అంతగాలి అన్న రీతిలో సంపద చేతులుమారుతూండేది. అలా ఆలయాలు ఆనాటి సమాజపు “మనీ సర్క్యులేటింగ్” కేంద్రాలు. అందుకనే శతృరాజులు జయించినరాజ్యాల ఆలయాలను ధ్వంసం చేయటం ద్వారా తమ విజయాన్ని సంపూర్ణం కావించేవారు. తరువాత వచ్చిన హైందవేతర పాలకులు ఆలయాలను పట్టించుకోలేదు. వారి ప్రాధాన్యతలలో ఆలయాలు లేవు. ఆలయమాన్యాలు అన్యాక్రాంతమయ్యాయి. దానమివ్వగలిగే ఆర్థికస్థితిలో హిందువులు ఉండేవారు కాదేమో!. మారిన ఈ రాజకీయ పరిణామాలవల్ల హిందూ దేవాలయాలు తమ పూర్వ వైభవాన్ని కోల్పోయాయి.

12వ శతాబ్దంలో ద్రాక్షారామ ఆలయానికి దీపారాధన నెయ్యి, క్షీరాభిషేకాల కొరకు 9470 పశువులు దానంగా ఇవ్వగా, పదిహేనో శతాబ్దానికి వచ్చేసరికి ఈ సంఖ్య 221 మాత్రమే ఉండటాన్ని బట్టి రాజకీయకారణాలవల్ల ఆలయవ్యవస్థ ఏమేరకు ప్రభావితమైందో అర్థమౌతుంది.

దేవాలయాలు ఎప్పుడైతే పతనమయ్యాయో, అంతవరకూ దేవుని ఎదుట మాత్రమే నాట్యం, గానం చేస్తూ ఆలయాన్ని ఆశ్రయించుకొని ఉండిన గుడిసానిలు

ప్రత్యామ్నాయ ఆదాయమార్గాలు వెతుక్కొనే పనిలో పెళ్ళిళ్ళకు, విందులకు కూడా నాట్యం చేయటం ప్రారంభించారు. అది క్రమేణా గుడిసానులను ఉత్త Dancing girls స్థాయికి దిగజార్చింది.

మధ్యయుగానికి చెందిన గుడిసానులకు పంతొమ్మిదో శతాబ్దపు Dancing girls కు మధ్య వ్యత్యాసం తెలియని బ్రిటిష్ చరిత్రకారులు గుడిసానులను Temple Prostitutes గా జమకట్టారు. వీరు గుడిసాని, వేశ్య, బసివిని, మాతంగి, జోగిని – ఇలా అన్ని వర్గాలను ఒక గాటన కట్టేసారు. ఈ అన్ని రకాలలో ఒక్క గుడిసానుల గురించి మాత్రమే విస్తృతంగా శాసనాలలో ఉంటుంది. మిగిలిన వారు కనిపించరు. ఆ తేడా సంస్కృతికి సంబంధించింది.

Abbé Dubois(1765–1848) లాంటి కొంతమంది మాత్రం Professional Prostitutes and Dancing girls అనే విభజనను గుర్తించారు. మిగిలిన బ్రిటిష్ చరిత్రకారులను తప్పుపట్టలేం. అప్పటికి వారుచూస్తున్న సత్యం అది. జమిందారీ యుగంలో గుడిసానులకు, వేశ్యలకు మధ్య ఉండే సాంస్కృతిక విభజన పూర్తిగా చెరిగిపోయింది.

గుడిసాని వ్యవస్థకు చెందిన చివరితరపు ప్రతినిధిగా బెంగుళూరు నాగరత్నమ్మ– ముద్దుపళనిని కందుకూరి వీరేశలింగం వేశ్యగా సంబోధించటాన్ని తీవ్రంగా ఖండించింది. దేవదాసీల హక్కుల కోసం అవిశ్రాంతంగా పోరాడింది.

ఇరవయ్యోశతాబ్దం ప్రారంభంలో Anti Nautch ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసి పడింది. ఈ ఉద్యమం ముసుగులో పునరుజ్జీవనం పేరిట– తాము వారసత్వ సంపదగా నిలుపుకొన్న సాంప్రదాయ నృత్యం, సంగీతం తమచేతుల్లోంచి వేరే సామాజికవర్గాల చేతుల్లోకి పోతున్నాయని వీణా ధనమ్మాల్, నాగరత్నమ్మ, బాలసరస్వతి లాంటి వారు అప్పట్లో ఎలుగెత్తారు.

## 4. ముగింపు

గుడిసానులు సంగీతం, నాట్య శాస్త్రాలను అభ్యసించి పోషించిన వర్గంగా చెప్పుకొంటున్నప్పుడు, నేటికీ దేశవ్యాప్తంగా గ్రామాలలో ఇంకా మనుగడలోనే ఉన్న మాతంగి, బసివిని, జోగిని లాంటి ఆచారాలగురించి కూడా మాట్లాడు కోవాలి. ఈ ఆచారాలుకూడా ఆరోశతాబ్దం నుంచీ ఉన్నాయి. వీరు ఎక్కువగా శివాలయాలకు, గ్రామదేవతల ఆలయాలకు అనుబంధంగా ఉండే; దేవుడికిచ్చి

పెళ్ళిచేయబడిన దళితబహుజన స్త్రీలు. ఒకప్పుడు వీరు నుదుట పెద్దబొట్టుపెట్టుకొని చేతిలో వెదురుకోల, గోపాలం(భిక్షాపాత్ర)తో గ్రామంలో తిరుగుతూ ప్రజలను ఆశీర్వదిస్తూ వారు ఇచ్చినవి స్వీకరిస్తూ జీవించేవారు. ఊరిలో జరిగే శుభకార్యాలలో, ఉత్సవాలలో వీరికి అగ్రపీఠం ఉండేది. ఇది ఒకరకంగా Matriarchial సమాజపు అవశేషంగా బావించవచ్చు. వీరు గ్రామంలో ఆయా గుడుల పూజారిణిలుగా గౌరవం పొందారు.

క్రమక్రమంగా గుడిసానుల లాగే వీరుకూడా వేశ్యలుగా మార్చబడ్డారు. బాలికలను దేవుళ్ళకిచ్చి పెళ్ళిచేసే దేవదాసి వ్యవస్థను 1924 బ్రిటిష్ ప్రభుత్వం రద్దుచేసింది. ఆంధ్రప్రదేష్ ప్రభుత్వం 1982 లో ఈ చట్టాన్ని మరింత బలోపేతం చేసింది.



ఓ వెయ్యేళ్ళక్రితం ఏదో ఆలయంలో దేవదేవుని ఎదుట తన్మయత్వంతో గానం చేసిన ఎవరో ఓ గుడిసాని గాత్రమాధుర్యం ఎమ్మెస్ పాడిన సుప్రభాతంలో లీలగా నేటికీ తారాడుతుంది.

తమపూర్వీకులు నృత్యంచేసిన ఆలయానికి ఏడాదిలో ఒకరోజు వెళ్ళి దేవుని ఎదుట నృత్యంచేసి ఆ సంప్రదాయ పరంపరను భక్తితో కొనసాగించే వ్యక్తులు ఇంకా ఈ నేలపై ఉన్నారు.



# మెకంజీ సహాయకులు

## కావలి సోదరులు

ఏలూరుకు చెందిన కావలి వెంకట సుబ్బయ్యకు అయిదుగురు కుమారులు ఒక కుమార్తె. వారు వరుసగా వెంకట నారాయణప్ప, వెంకట బొర్రయ్య, వెంకట లక్ష్మయ్య, వెంకటరామస్వామి మరియు సీతయ్య. కుమార్తె పేరు లక్ష్మిదేవమ్మ/ సీతమ్మాళ్ [1]. ఈమెకు విస్సన్నకోట జమిందారు రమణప్పతో వివాహం అయింది. ఈ కావలి సోదరులు కల్నల్ కాలిన్ మెకంజీ వద్ద సహాయకులుగా పని చేసారు.

## కావలి వెంకట బొర్రయ్య (Cavelly Venkata Boriah -1776-1803)

బొర్రయ్య 1776లో ఏలూరులో జన్మించాడు. ఇతను ఏలూరులోని ఒక ప్రైవేట్ స్కూలులో పదిసంవత్సరముల వరకూ విద్యనభ్యసించాడు. ఆ తరువాత సాంప్రదాయ సంస్కృతపాఠశాలలో చేరాడు. ఇక్కడ అయిదారు నెలలలోనే సంస్కృతంలో ప్రావీణ్యత గడించి సొంతంగా పద్యాలల్లేవాడట. ఇతని బంధువులు కొంతమంది ఈస్ట్ ఇండియా కంపనీలో ఉద్యోగులు. వారిలాగే తానుకూడా ఉన్నతంగా జీవించాలనే ఆశయంతో బొర్రయ్య ఉండేవాడు. ఈ క్రమంలో పెర్షియన్, హిందీ భాషలను, తన ఇంటికి రెండుమైళ్ల దూరంలోకల కొత్తూరు వెళ్ళి నేర్చుకొన్నాడు. బొర్రయ్య పద్నాలుగేళ్ల వయసుకు చేరుకొన్నాక మచిలీపట్నంలో Mr. Morgan నడుపుతున్న స్కూలులోచేరి కొన్నాళ్లు ఇంగ్లీషు విద్యను అభ్యసించాడు. ఇది 1790–93 మధ్య కాలం కావొచ్చు.

---

1. ఈ వివరాలు by C.V. Ramachandra Rao వ్రాసిన The Life and Work of Kavali Brothers అనే వ్యాసంలోనివి. కాగా కావలిసోదరులు వరుసగా– బొర్రయ్య, లక్ష్మయ్య, రామస్వామి, నరసింహులు, సీతయ్యలు గా కూతురుపేరు సీతమ్మాళ్ అని Modern Historiography in India పుస్తకంలో Rama Sundari Mantena పేర్కొన్నారు. మొదటి ముగ్గురుమాత్రమే మెకంజీతో కలిసి పనిచేసారు. మిగిలినవారు లక్ష్మయ్యకు సహాయంగా ఉండేవారు.

తీరిక సమయాలలో బొర్రయ్య తెలుగు సాహిత్యం, చందస్సు, అలంకార శాస్త్రం అభ్యసనం చేస్తూ పద్యాలు అల్లటం చేసేవాడు. అత్తలూరి పాపయ్య వ్రాసిన కవిత్వం ఎక్కువగా ఇష్టపడేవాడట. మచిలీపట్నంలో ఆంగ్లేయులతో ఏర్పడిన పరిచయాల ద్వారా బొర్రయ్య ఈస్ట్ ఇండియా కంపనీ, మచిలీపట్నం సైనిక విభాగంలో ఉద్యోగం సంపాదించాడు. ఒంగోలు, మునగాల, కొండపల్లి లాంటి వివిధ ప్రాంతాలలో ఉంటున్న సైనికులకు జీతాలను తీసుకెళ్ళి పంచిపెట్టే ఉద్యోగం అది. ఉద్యోగ రీత్యాకూడా బొర్రయ్యకు అనేకమంది ఆంగ్లేయులతో పరిచయాలు పెరిగాయి. అప్పటికి ఇతని వయసు పద్దెనిమిదేళ్ళు. కొంతకాలం నర్సాపురంవద్ద బ్రిటిష్ స్థావరమైన మెడపొల్లం (మాధవపాలెం) లో కూడా పనిచేసాడు. అప్పటికే కంపనీ ఉద్యోగిగా ఉన్న బొర్రయ్యసోదరుడైన నారాయణప్ప సిఫార్సుతో, బొర్రయ్య 1796లో మెకంజీ వద్ద ప్రధాన లేఖకునిగా ఉద్యోగంలో కుదరటంతో ఇతని జీవితం మారిపోయింది. బొర్రయ్య మేధోశక్తిని గమనించిన మెకంజీ ఇతనిపట్ల ఎంతో మాన్యత కలిగిఉండేవాడు. అప్పగించిన పనులను సమర్థవంతంగా పూర్తిచేయగలడని విశ్వసించేవాడు. తెలుగు, తమిళ, కన్నడ, సంస్కృతం, పర్షియన్, భాషలలో ప్రావీణ్యం కలిగి ఉండటంతో దక్షిణ భారతదేశ శాసనాలను అవలీలగా ప్రతులు తీసి ఇంగ్లీషులోకి అనువదించేవాడు బొర్రయ్య. బొర్రయ్య చక్కని చిత్రకారుడు కూడా కావటంతో అనేక ఆలయాల డ్రాయింగులను చిత్రించాడు



1798 మైసూరు యుద్ధంలో మెకంజీ పాలుపంచుకొన్నపుడు బొర్రయ్య అతనిని అనుసరించాడు. ఆ సమయంలో ఒక గోల్కొండ జమిందారుడి అనుచరులు మెకంజీ కాగితాలను ఎత్తుకుపోతే, వాటిని తిరిగి సంపాదించిపెట్టమని మెకంజీ బొర్రయ్యను కోరాడు[2]. అంత యుద్ధసమయంలోను బొర్రయ్య వెరవక ఆ జమిందారు వద్దకు వెళ్ళి వచ్చినపని చెప్పగా, అతను బొర్రయ్యను ఖైదు చేయించి తిండితిప్పలు పెట్టకుండా హింసించాడు. బొర్రయ్య ధైర్యం కోల్పోకుండా ఆ జమిందారుని పొగుడుతూ పద్యాలు అల్లి, అతని విశ్వాసాన్ని చూరగొని మెకంజీ కాగితాలతో పాటూ తనుకూడా అనేక బహుమతులను సంపాదించుకొన్నాడు.

2. Biographical sketches of Dekkan Poets by Cavelly Venkata Ramaswamie.

కొన్నిసార్లు బొర్రయ్య దట్టమైన అరణ్యాలు, కొండలు, వాగులు దాటుకొని విషయసేకరణ జరిపేవాడు.

టిప్పు సుల్తాను, బ్రిటిష్ వారికి మధ్య జరిగిన యుద్ధవిశేషాలను బొర్రయ్య కావ్యంగా రాసాడు. శ్రీరంగ రాజుల వంశావళిని తెలియచేసే "శ్రీరంగరాజ చరిత్ర", "యాదవరాజ వంశావళి", "కాంచిపుర మహత్యము" లాంటి పద్య కావ్యాలు రచించాడు. బొర్రయ్య వ్రాసిన– Account of the Jains, collected from a priest of this sect at Mudgeri; Translated by Cavelly Boria, Brahmin: for Major C Mackenzie[3]. అనే పరిశోధనాత్మక వ్యాసం భారతదేశ జైనమత పునరుజ్జీవనంలో మైలురాయిగా నిలిచిపోయింది. కావలి వెంకట బొర్రయ్య అనేక సంస్కృత, కన్నడ శాసనాలను ఇంగ్లీషులోకి అనువదించినట్లు ఏసియాటిక్ జర్నల్స్ లో కనిపిస్తుంది. ఆ తరువాత కొన్ని సంచికలలో "బొర్రయ్య నిర్ధారించాడు" అంటూ ఇతరులు వ్రాసిన వ్యాసాలలో బొర్రయ్యకు సంబంధించిన అనేక రిఫరెన్సులు కనిపిస్తాయి.

బొర్రయ్యకు పన్నెండేళ్ళ వయసులోనే కసింకోట జమిందారైన వెంకటా చలం చిన్న సోదరితో వివాహమైంది. వీరిద్దరికీ ఒక కూతురు పుట్టి చనిపోయింది. 1803 లో ఇరవైఆరేళ్ల వయసులో బొర్రయ్య, రుద్రవాతం వచ్చి చనిపోయాడు (మెదడు నరాలు చిట్లి అకస్మాత్తుగా మరణించటం). బొర్రయ్య చేసిన సేవలకు గుర్తుగా కాలిన్ మెకంజీ బొర్రయ్య మద్రాసు సముద్రపు ఒడ్డున ఒక స్మారకచిహ్నాన్ని కు ఏర్పాటు చేయించాడు మెకంజీ. ఇది 1834 వరకూ అక్కడే ఉండేది[4].

బొర్రయ్య చనిపోయిన తరువాత కూడా అతనిని ఎప్పుడైనా ప్రస్తావించవలసి వచ్చినప్పుడల్లా 'శోకనీయ మిత్రుడు బొర్రయ్య ' అని సంభోదించేవాడు మెకంజీ. బొర్రయ్య చనిపోయిన పదిహేనేళ్ళ తరువాత మిత్రునికి వ్రాసిన ఒక ఉత్తరంలో "బొర్రయ్య ద్వారా నాకు భారతీయ విజ్ఞానానికి కొత్తతలుపులు తెరుచుకొన్నాయి" అని మెకంజీ చెప్పుకొన్నాడు[5].

3. 1809 Asiatic Researches vol 9
4. Biographical sketches of Dekkan Poets by Cavelly Venkata Ramaswamie.
5. Mackenzie Letter dated 1 February, 1817 to Alexander Johnston.

బొర్రయ్య మొట్టమొదటి భారతీయ ఎపిగ్రాఫిస్ట్ (పురాలేఖన కారుడు). 1816లో రాజారామమోహన్ రాయ్ Abridgment of the Vedanta అనే పుస్తకం రాసినందుకు అతనిని ఇంగ్లీషులో రచించిన మొట్టమొదటి భారతీయునిగా గుర్తించారు. కానీ 1803కి ముందే బొర్రయ్య వ్రాసిన అనేక ఇంగ్లీషురాతలు ఉన్నాయి. చాలా రచనలు జర్నల్స్‌లో ప్రచురింపబడ్డాయి. The political conditions of the Carnatic during Moghul times, Lives of Telugu poets అనే పుస్తకాలను బొర్రయ్య రచించాడు. కానీ ఇవేమీ చరిత్రలోకి ఎక్కకపోవటం శోచనీయం[6].

**కావలి వెంకట లక్ష్మయ్య**

బొర్రయ్య బ్రతికి ఉండగానే వెంకటలక్ష్మయ్య మెకంజివద్ద పనిచేస్తూ ఉండేవాడు. 1802లో ఇతను నెల్లూరులో ఉంటూ వ్రాతప్రతులను సేకరించి మెకంజీకి పంపేవాడు. బొర్రయ్యమరణానంతరం అతని స్థానంలో లక్ష్మయ్య మెకంజీ ప్రధాన సహాయకునిగా మారాడు. వివిధ ప్రాంతాలనుండి వివరాలను తెప్పించటం వాటిని మెకంజీకి అందచేయటం ఇతని ప్రధానవిధిగా ఉండేది. ఈ పనికొరకు ఇతనికి నారాయణరావు, తిరుమలరావు, సీతారామయ్య వెంకట్రావు, మహమద్ హనుమా, మురహరిరావు, కైలాసపతి లాంటి అనుచరులను ఏర్పాటు చేసుకొన్నాడు[7].

1816లో వెంకటలక్ష్మయ్య ఒక చీటింగ్ కేసు ఎదుర్కొని కోర్టులో చివాట్లు తిన్నాడు. వెంకటలక్ష్మయ్య సోదరి సీతమ్మాళ్ భర్త రమణప్ప విస్సన్నపేట జమిందారు. అతను మరణించాక ఆ జమిందారీని తనకున్న పరపతిని ఉపయోగించి సీతమ్మాళ్‌కు ఇప్పిస్తానని లక్ష్మయ్య నమ్మబలికాడు. అందుకయ్యే ఖర్చులకొరకు 6000 రూపాయిల మొత్తాన్ని నరసింహాచారి అనే మధ్యవర్తినుండి గ్రహించాడు. జమిందారీ వ్యవహారం ఎంతకీ తేలకపోవటంతో తన బాకీ తీర్చమని లక్ష్మయ్యపై నరసింహాచారి కోర్టులో దావావేసాడు. ఈ దావాలో ఓడిపోయిన లక్ష్మయ్య మొత్తం డబ్బును కోర్టుద్వారా చెల్లించాల్సివచ్చింది.

---

6. C.V. Ramachandra Rao వ్రాసిన The Life and Work of Kavali Brothers వ్యాసం
7. Modern Historiography in India by Rama Sundari Mantena

1821 లో మెకంజీ మరణించాకా ఆ సేకరణలను కేటలాగ్ చేయటంలో H. H. Wilson కు సహాయపడటం కొరకు కొంతకాలం లక్ష్మయ్య కలకత్తాలోనే ఉండి 1827లో మద్రాసుకు తిరిగి వచ్చేసాడు. ఈస్ట్ ఇండియా కంపనీ లక్ష్మయ్య చేసిన సేవలకు ప్రతిఫలంగా నెలకు మూడువందల రూపాయిల పింఛను, ప్రభుత్వఖర్చులతో ఒక పల్లకిని మంజూరు చేసింది. రామస్వామికి 30 రూపాయిల పింఛను ఏర్పాటుచేసింది. విల్సన్ 1828లో మెకంజీ సేకరణల కేటలాగును పుస్తకరూపంలో ప్రచురించాకా, చాలా సేకరణలను బ్రిటిష్ మ్యూజియంకు, దక్షిణభారతదేశానికి చెందిన వ్రాతప్రతులను మద్రాసుకు తరలించారు.

మద్రాసులో ఉన్న మెకంజీ వ్రాతప్రతులపై తదుపరి పరిశోధనలు చేస్తాను అని కావలి లక్ష్మయ్య 1833లో కంపనీ ప్రభుత్వానికి ఒక అర్జీ పెట్టుకొన్నాడు. ఆ పనిచేయటానికి సమర్థుడు లక్ష్మయ్య అని Alexander Johnston లాంటి మెకంజి మిత్రులు కూడా మద్దతు ఇచ్చారు.

మెకంజీ ముఖచిత్రంతో వచ్చిన Saturday Magazine, 28 June, 1834 సంచికలో మెకంజీపై Alexander Johnston వ్రాసిన ఒక సంస్మరణ వ్యాసంలో వెంకట లక్ష్మయ్య ప్రస్తావన ఉంది. ఇందులో మెకంజీ మొదలుపెట్టిన పనిని కొనసాగించాలని, దీనికొరకు Royal Asiatic Society చర్యలు తీసుకొని, మెకంజీ సహాయకులను సంప్రదించాలని, వారిని ప్రభుత్వం ప్రోత్సహించాలని – తాను కావలి వెంకట లక్ష్మయ్యకు పైన చెప్పిన పనులను చేపట్టమని ఒక ఉత్తరం వ్రాసానని, అది అందుకొని – వెంకటలక్ష్మయ్య మద్రాసులో రెండువందల మంది ఔత్సాహిక స్థానికులతో Madras Literary Society ని స్థాపించి మెకంజీ ఆశయాలను ముందుకు తీసుకొని వెళ్ళే ప్రయత్నాలు చేస్తున్నట్లు నాకు తెలియచేసాడు– అని అలెగ్జాండర్ అన్నాడు. ఇదే వ్యాసంలో రాయల్ ఏసియాటిక్ సొసైటి, లండన్‌కు భారతదేశ ప్రతినిధిగా ప్రస్తుతం కావలి వెంకటలక్ష్మయ్య వ్యవహరిస్తున్నడని కూడా ఉంది.

వెంకటలక్ష్మయ్య మెకంజీ సేకరణలను పరిశోధిస్తానని పెట్టుకొన్న అభ్యర్ధనను తిరస్కరిస్తూ, 1836లో secretary of the Asiatic Society, J. Prinsep "ఆ పని బృహత్తరమైనదని, సమర్ధవంతుడైన నాయకుడు ఉండాలని, లక్ష్మయ్యకు అంతటి శక్తి, నైపుణ్యాలు లేవని" రిమార్కు వ్రాసాడు. ఈస్ట్ ఇండియా కంపనీమెకంజీ సేకరణలను కేటలాగ్ చేసే పనిని 1837లో William Taylor కి అప్పగించింది . ఇతనికి లక్ష్మయ్య సహాయపడినట్లు తెలియరాదు.

1837లో లక్ష్మయ్య మద్రాసులో ఆరునెలలపాటు Julia Thomas అనే మహిళకు తమిళ టీచర్‌గా నెలకు అయిదు వరహాల జీతంపైన పనిచేసాడు. ఈ జూలియా భర్త రాజమండ్రి కలక్టరుగా పనిచేసేవాడు. జూలియా లండన్‌లోని తన బంధువులకు వ్రాసిన ఉత్తరాలలో ఒకచోట లక్ష్మయ్య ప్రస్తావన ఇలా ఉంది.

> "నాకు తమిళం నేర్పించే ఉపాధ్యాయుడు వారానికి మూడుసార్లు వస్తాడు. పెద్ద పెద్ద మీసాలతో, గంభీరంగా ఉంటాడు. నడుముచుట్టూ కట్టుకొన్న రంగురంగుల అందమైన శాలువాలు నడుస్తున్నప్పుడు ఊగుతూ ఉంటాయి. ఇతను మొదటి సారిగా కలిసినపుడు మీ స్నేహం ముఖ్యం, జీతం మీరు ఎంత ఇస్తే అంత అన్నాడు. నెలకు అయిదు వరహాలు అనుకొన్నాం. నేను ఏ సమయం చెపితే ఆ సమయానికి వస్తాడు. ఇకచాలు మిగిలినది తరువాత చూద్దాం అంటే వెళిపోతాడు. ఒక్కోసారి నేను తయారుగా లేను కాసేపు ఆగు అంటే, వరండాలో కూర్చొని నా పిలుపుకొరకు అలా ఖాళీగా ఎన్నిగంటలైనా ఎదురు చూస్తాడు. ఇతను హిందూ లిటరరీ సొసైటీ అధ్యక్షుడట[8]"

పై ఉత్తరంలోని వర్ణనల ద్వారా కావలి వెంకటలక్ష్మయ్య రూపాన్ని, ఆహార్యాన్ని, నడవడికను గ్రహించవచ్చు. లక్ష్మయ్య రచయిత కూడా. భారవి విరచిత కిరాతార్జునీయ కావ్యాన్ని వెంకట లక్ష్మయ్య ఇంగ్లీషులోకి అనువదించి 1869లో ప్రచురించాడు.



ముందుగా చెప్పుకొన్న సీతమ్మాళ్ యొక్క జమిందారీ హక్కులను 1838లో లక్ష్మయ్య తనపేరిట రాయించుకొని కేసునడిపించటం మొదలెట్టాడు. ఈ కేసు తుదితీర్పు 1867లో లక్ష్మయ్యకు అనుకూలంగా వచ్చింది[9]. అప్పటికి సంతులేని సీతమ్మాళ్ చనిపోయింది. లక్ష్మయ్య చనిపోయాడు. లక్ష్మయ్య కొడుకు నారాయణప్ప కూడా చనిపోయాడు. చివరకు జమిందారీ హక్కులు కావలి రామస్వామి కుమారులైన కావలి వెంకట సీతారామయ్యలకు దక్కాయి. విధిచేయు వింతలంటే ఇవేనేమో!

---

8. Letter dated 11th January, 1837 by Mrs. Julia Thomas from the book "Letters from Madras during the Years 1836-1839 by a Lady"
9. కృష్ణా జిల్లా మాన్యువల్, పే 339

**కావలి వెంకట రామస్వామి**

రామస్వామి 1798 నుంచి మెకంజీ వద్ద అనువాదకుడిగా పనిచేసాడు. పైన చెప్పిన నరసింహాచారి కావలి వెంకటలక్ష్మయ్యపై వేసిన కేసులో ఈ రామస్వామి తప్పుడు సాక్ష్యం ఇచ్చాడని రుజువుకావటంతో 1818లో ఇతనిని కంపనీప్రభుత్వం ఉద్యోగం నుండి తొలగించింది. మద్రాసులో నెలకు పదిహేను వరహాల జీతంపై కొంతకాలం టీచరుగా పనిచేసాడు. తరువాత కలకత్తాలో ఉంటున్న అన్నగారైన లక్ష్మయ్యవద్దకు చేరాడు. వీరిద్దరూ రాజారామమోహన్ రాయ్ బ్రహ్మసమాజ సభలకు హాజరయ్యేవారు. బ్రహ్మసమాజం ప్రార్ధనా సమయంలో ఇద్దరు తెలుగు బ్రాహ్మణులు వేదపఠనం చేసేవారట. వారు కావలి వెంకట లక్ష్మయ్య, రామస్వామిలు కావొచ్చునని The Life and Work of Kavali Brothers వ్రాసిన C.V. Ramachandra Rao అభిప్రాయపడ్డారు. ఆరుద్ర ఈ అభిప్రాయంతో విభేదించారు. కావలి సోదరులు నియోగులు, వేదాధ్యయనం చేసినట్లు కనపడరు అంటారాయన[10].

రామస్వామి మంచి రచయిత. మెకంజీ సేకరించిన విషయాలను పుస్తక రూపంలోకి తీసుకురావటానికి ప్రయత్నించాడు. 1828లో ప్రచురించిన Descriptive and Historical Sketches of Cities and Places in the Dekkan ఇతని మొదటి పుస్తకం. ఈ పుస్తకంలో రామస్వామి ఒకచోట "వివిధ యుద్ధాలు, విశ్వాసవైరుధ్యాల వలన శాసనాలు, శిల్పాలు, కట్టడాలు లాంటి చారిత్రిక ఆధారాలు నాశనం చేయబడతాయి. కానీ సాహిత్యరూపంలో లిఖించబడిన చరిత్ర ప్రజల నాలుకలపైన జీవించే ఉంటుంది. దీన్ని ఏ యుద్ధమూ నాశనం చేయలేదు. సాహిత్యం ద్వారా లభించే చరిత్రను మనం శోధించాల్సిన అవసరం ఎంతైనా ఉంది" అంటూ వెలిబుచ్చిన అభిప్రాయాలు నేటికీ ప్రాసంగితను కోల్పోలేదు. "హార్డ్ ఎవిడెన్సెస్" తో మాత్రమే చరిత్ర ప్రతిపాదనలు చేయాలి అని నమ్మే ఆనాటి యురోపియన్ చరిత్రకారులకు ఈ మాటలు చెంపపెట్టులాంటివి.

1829లో కలకత్తా నుంచి రామస్వామి Biographical Sketches of Dekkan Poets పేరుతో దక్కను కవులచరిత్ర పుస్తకం వెలువరించాడు. ఈ పుస్తకానికి రాసుకొన్న ముందుమాటలో కావలి వంశస్థులు కృష్ణదేవరాయల

---

10. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, వాల్యూం 3, పే.నం.109

ఆస్థానంలో రాయబారులుగా పనిచేసేవారని చెప్పుకొన్నాడు. ఈ పుస్తకాన్ని విలియం బెంటింగ్‌కి భక్తితో అంకితమిచ్చాడు. దీనిలో నన్నయ, పోతన, అవ్వయార్, సుందరర్ లాంటి మొత్తం 79 మంది కవుల జీవిత, సాహిత్య విశేషాలను ఇంగ్లీషులో అక్షరబద్ధం చేసాడు. ఇది గొప్ప విశేషం. బహుసా ఇదే మొదటి తెలుగు కవుల చరిత్ర కావొచ్చు. ఇందులో తమిళ, కన్నడ, ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలకు చెందిన కవులు ఉన్నారు. ఈ పుస్తకంలో తన తమ్ముడైన కావలి బొర్రయ్య సాహిత్యకృషిని కూడా చివరలో చేర్చాడు.

1833 లో రామస్వామి కలకత్తానుంచి మద్రాసుకు తిరిగి వచ్చేసాడు. 1836లో The Modern Culinary Recipes of the Hindoos పేరుతో ఒక వంటల పుస్తకాన్ని ప్రచురించాడు.

వెంకట లక్ష్మయ్య వద్ద తమిళం నేర్చుకొన్న Julia Thomas 19 నవంబరు, 1838న వ్రాసిన మరో ఉత్తరంలో రామస్వామి గురించి ఇలా వ్రాసింది.

> "ఒకరోజు ఒక తెలివైన ఇండియన్‌ను కలిసాను. ఇతను రాజా రామమోహన్ రాయ్ స్నేహితుడట. తను ప్రచురించబోతున్న ఒక పుస్తకం కొరకు చందా ఇవ్వమని అడిగాడు. స్త్రీలకు విద్యనేర్పకూడదు అనే మూఢ హిందూ సాంప్రదాయాలను ఎదిరించి తన ముగ్గురు కూతుర్లకు, కొడుకులతో సమానంగా చదువు చెప్పిస్తున్నానని, అలా చేయటాన్ని తన భార్యకు ఇష్టం లేదని చెప్పుకొచ్చాడు. ఇందువల్ల తనకు ఇంట్లో మనశ్శాంతి లేదని బాధపడ్డాడు. రాజారామ్ మోహన రాయ్ సూచనలను ప్రభుత్వం వారు అంగీకరిస్తే బాగుంటుందని ప్రజలు అనుకొంటున్నారని అన్నాడు"

పై ఉత్తరం ద్వారా రామస్వామి జీవనశైలి, ఆధునిక భావాలు, కుటుంబ విషయాలు అర్థమౌతాయి.

రామస్వామి పబ్లిషర్‌గా వ్యాపారకిటుకులు బాగానే ప్రదర్శించేవాడని అనుకోవాలి. దక్కను కవుల చరిత్ర మొదటి ముద్రణను విలియం బెంటింగ్ కు అంకితమివ్వగా 1847లో రెండవ ముద్రణను Erskine Parry అనే సుప్రీమ్‌కోర్టు జడ్జ్‌కి అంకితం ఇచ్చాడు. ఇతని పుస్తక ప్రచురణల కొరకు చందాలు ఇచ్చిన వ్యక్తుల పేర్లు పుస్తకం వెనకాల ముద్రించేవాడు. ప్రచురణ కర్తగా రామస్వామి మూలికాస్వాంతనము, castes of southern India, ఏకశిలానగర వృత్తాంతము,

Account of Pulicat లాంటి అనేక పుస్తకాలను ముద్రించాడు. ఇవన్నీ మెకంజీ సేకరణలోవి కావొచ్చు. (ఏకశిలానగర కైఫియ్యతు కలదు)

**మెకంజీ చిత్రకారులు**

మెకంజీ వృత్తిరీత్యా సర్వేయరు కనుక మేప్స్ గీయటానికి అతని వద్ద అనేకమంది చిత్రకారుల బృందం ఉండేది. మెకంజీ సేకరణలలో దేవాలయాలు, భవనాలు, శిల్పాలు, తామ్రశాసనాలు, లాండ్ స్కేప్స్ లాంటి వివిధ చిత్రాలు మొత్తం 2630 ఉన్నాయిని విల్సన్ గుర్తించాడు. వీటిలో మెకంజీ స్వయంగా గీచిన చిత్రాలు, తన సహాయకులు వేసిన డ్రాయింగులే కాక మెకంజీ ఇతరులనుంచి సేకరించిన చిత్రాలు కూడా ఉన్నాయి.

మెకంజీ మొదట్లో తన బొమ్మలు తానే వేసుకొనేవాడు. అతని ఉద్యోగ బాధ్యతలు పెరిగేకొద్దీ క్రమక్రమంగా అతనికి సహాయకులను నియమించుకొనే అవకాసం వచ్చింది. అలా అతనివద్ద పనిచేసిన సహాయకుల వివరాలు ఇవి.

**Thomas Anderson:** ఇతను 1811 నుంచి మెకంజీ వద్ద పనిచేసాడు. ఇతను 18 అమరావతి స్థూప డ్రాయింగ్స్ వేసాడు.

**Charles Barnett :** ఇతను సర్వే డిపార్ట్ మెంటులో సహాయక డ్రాఫ్ట్స్ మేన్. ఇతను 9 అమరావతి డ్రాయింగ్స్ చిత్రించాడు

**Marcellus Burke :** ఇతను 1806లో మెకంజీ సహాయకునిగా చేరాడు. గుంటూరు జిల్లాను సర్వేచేసి మేప్ తయారుచేసాడు. 14 అమరావతి శిధిలాల డ్రాయింగ్స్ గీచాడు.

**Buxton Bentley :** ఇతను 1818 నుంచి మెకంజి వద్ద పనిచేయనారంభించాడు. కటక్ సర్వేలో పాల్గొన్నాడు. పూరిజగన్నాధ రథయాత్ర చిత్రాన్ని ఇతను గీచిందే.

**Thomas Fiotte Havilland :** ఇతను 1796 నుంచి మెకంజీతో కలిసి పనిచేసాడు. మెకంజీ మొదలుపెట్టిన దక్కను సర్వేను ఇతను కొనసాగించాడు. 1809 లో థామస్ ఆదోని కోట చిత్రాలను గీచాడు.

**Fraser Edward :** ఇతను మెకంజీతో కలిసి మైసూరు సర్వేలో పాల్గొన్నాడు. 1801లో ఉత్తరాంధ్ర జిల్లాల సర్వే చేసాడు. 1820లో మెకంజీ జబ్బుపడి వైద్యం కొరకు ఒరిస్సా వెళ్లినపుడు Fraser ఆతిథ్యం ఇచ్చాడు.

**John Gould :** 1817లో ఇతను మద్రాసులో చదువుముగించుకొని మెకంజీ వెంట కలకత్తా వెళ్లాడు. అనేక ఒరిస్సా శిల్పాలను చిత్రించాడు. ఒక అమరావతి శిల్పం యొక్క చిత్రాన్ని గీచాడు.

**Henry Hamilton :** ఇతను నా వద్ద శిక్షణ పొందాడు అని మెకంజీ ఎంతోగర్వంగా చెప్పుకొనేవాడు. హామిల్టన్ కొండపల్లిని సర్వేచేసాడు. అమరావతి తవ్వకాలకు సంబంధించిన 21 డ్రాయింగులు వేసాడు. మెకంజీనితోపాటు కలకత్తా వెళ్లాడు.

**Pyari Lal :** ఇతను కలకత్తా చిత్రకారుడు. 1819 నుంచి మెకంజీతో కలిసి పనిచేసాడు. అప్పటికే ఇతను 1815లో ద్రాక్షారం ఆలయ స్తంభం అనే డ్రాయింగ్ వేసినట్లు తెలుస్తుంది. కలకత్తా చేర్చబడ్డ అమరావతి ఫలకాల చిత్రాలను లిఖించాడు.

**Najibullah :** ఇతను కలకత్తా చిత్రకారుడు. ప్యారిలాల్‌తో కలిసి అమరావతి ఫలకాల చిత్రాలను గీచాడు.

**Benjamin Syndenham :** ఇతను 1795లో మెకంజీ సహాయకునిగా చేరాడు. ఇతను నిజాంరాజ్యంలో అనేక డ్రాయింగ్స్ వేసాడు.

**John Newman :** ఇతను 1791 నుంచి మెకంజీ సహాయకునిగా ఉన్నాడు. తరువాతి కాలంలో మెకంజీ టీముకు హెడ్ డ్రాఫ్ట్స్‌మాన్ అయ్యాడు. అత్యుత్తమ చిత్రకారుడితడు అని మెకంజీచే మన్ననలు పొందాడు. కలకత్తా వెళ్ళాడు. 1818లో మరణించాడు. ఇతని గురించి మెకంజీ "నా దృష్టికోణాన్ని అర్థం చేసుకొన్న ఒకే ఒక వ్యక్తి న్యూమేన్. అతన్ని కోల్పోవటం సొంతబిడ్డను కోల్పోయినట్లు అనిపిస్తుంది" అని బాధపడ్డాడు. ఇతను ప్రతులు తీసిన చిత్రాలలో, ద్రాక్షారామ ఆలయ ఉత్తర ద్వార దృశ్యం, వైజాగ్ డాల్ఫిన్ నోస్, సింహాచల ఆలయశిల్పాలు, 14 అమరావతి చిత్రాలు తెలుగునేలకు చెందినవి.



మెకంజీ వృత్తిరీత్యా ఒక మిలటరీ అధికారి. మైసూరు, పాండిచేరి, శ్రీలంక, జావాలలో జరిగిన అత్యంత సంకటమైన యుద్ధాలలో పాల్గొన్నాడు. సర్వేయర్ గా భారతదేశంలో అనేక ప్రాంతాల మేప్‌లు తయారుచేసాడు. ఇవన్నీ జీవిక కోసం చేసిన పనులని బావించి ఉంటాడు. అందుకనే సమాంతరంగా వివిధ రంగాలకు చెందిన సహాయకుల సాయంతో భారతదేశ సంస్కృతికి సంబంధించిన

అనేక చారిత్రిక ఆధారాలను సేకరించటంద్వారా తన మేధోపరమైన దాహాన్ని తీర్చుకొనేవాడేమో ! మెకంజీ తన మిత్రులకు వ్రాసిన ఉత్తరాలలో "తన సహాయకులు చాలా తెలివైన వాళ్ళని, వారివల్లనే నేను అనేక విషయాలను నేర్చుకొంటున్నానని" పదే పదే చెప్పేవాడు. వారి పనిని ఏనాడూ దొంగిలించలేదు. మెకంజీ సేకరణలను గమనిస్తే వాటిని ఎవరు, ఎప్పుడు, ఎక్కడనుంచి సేకరించారన్న సమాచారం ఈనాటికీ లభిస్తుంది. తాను కలకత్తా వెళిపోయిన తరువాత కూడా మద్రాసులో ఉండిపోయిన తన సహాయకులకు ఉపాధికల్పించమని అధికారులకు ఉత్తరాలు వ్రాసాడు.

మెకంజీ తన సహాయకులను ప్రేమించాడు, గౌరవించాడు వారు మరణించినపుడు బాధపడ్డాడు, స్మారకచిహ్నాలు నెలకొల్పాడు, తన వీలునామాలో కొన్ని ఏర్పాట్లు చేసాడు. ఇవన్నీ అధికారి–సేవకుడు అనుబంధం క్రిందకురావు. కాలిన్ మెకంజీ పరిపూర్ణ మానవుడు.



# బొల్లోజు బాబా

**తల్లిదండ్రులు** బొల్లోజు బసవలింగం, అమ్మాజి

**సహచరి** సూర్య పద్మ

**పిల్లలు** అపరాజిత, బసవ శ్రీధర్

**చదువు** M.Sc., B.Ed., M.Phil.

**వృత్తి** జువాలజీ అధ్యాపకుడు

**రచనలు** **యానాం విమోచనోద్యమం** (2007)
**ఆకుపచ్చని తడిగీతం** (2009) కవితా సంపుటి
**ఫ్రెంచిపాలనలో యానం** (2012)
**స్వేచ్ఛావిహంగాలు** (2016) (రవీంద్రుని స్ట్రే బర్డ్స్ అనువాదం)
**వెలుతురు తెర** (2016) కవితా సంపుటి
**కవిత్వ భాష** (2018) సాహిత్య వ్యాసాలు
**మూడో కన్నీటిచుక్క** (2019) కవితా సంపుటి

**ఇ.బుక్స్** **ఎడారి అత్తరులు** (ప్రముఖ సూఫీకవుల గీతాల అనువాదాలు)
**ఇరవై ప్రేమకవితలు ఒక విషాదగీతం**
(Twenty Love Poems & a Song of Despair, Pablo Neruda అనువాదం)
**రవీంద్రుని క్రిసెంట్ మూన్** అనువాదం
**గాథాసప్తశతి** విశ్లేషణా వ్యాసాలు

(పై ఇ.బుక్కులు https://archive.org/details/@bolloju_baba వద్ద లభ్యం)

**బ్లాగు** http://sahitheeyanam.blogspot.com/

**ఎఫ్.బి.** https://www.facebook.com/bolloju.baba

**అవార్డులు** '*ఆకుపచ్చని తడిగీతం*' కు శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం 2010
శ్రీ ర్యాలి ప్రసాద్ – డా. సోమసుందర్ స్మారక సాహితీ పురస్కారం 2016
ఇస్మాయిల్ సాహితీ పురస్కారం 2017
రొట్టమాకు రేవు కవిత్వ అవార్డు 2018
పాతూరి అన్నపూర్ణ స్మారక సాహిత్య పురస్కారం 2020

